# కార్మిక

సి.ఐ.టి.యు. ఆంధ్రప్రదేశ్ కమిటీ
మాసపత్రిక



# కార్మిక లోకం

సి. ఐ. టి. యు. ఆంధ్రప్రదేశ్ కమిటీ మాసపత్రిక

1983 ఏప్రియల్, మే


# ఈ 'మే డే' శపథం

సి. ఐ. టి. యు. నాల్గవ రాష్ట్ర మహాసభ జయప్రదంగా పూర్తి అయింది. ఆలిండియా అయిదవ మహాసభ కాన్పూరులో విజయవంతమయింది.

12 ఏండ్లు నిండాయి. సి ఐ.టి.యు. బలం పుంజుకున్నదనేది నిర్వివాదాంశం. సంఖ్యరీత్యా పెరగడం ఒకఎత్తు కార్మికుల పోరాట ఐక్యత సాధించింది. వివిధ సెక్షన్ల కార్మికుల పోరాటాలు సమన్వయించడంలో కీలక పాత్ర వహించింది. "ఐక్యత–పోరాటం" అనే నినాదం కార్మికుల నినాదమైంది.

జీతాల విషయంలో భారత ప్రభుత్వం వెనకడుగు వేసింది- కాదు, కార్మిక వర్గం వేయించింది. ఇది కార్మికుల ప్రథమ విజయం. దాని సాధనలో సి. ఐ. టి. యు. కీలకపాత్ర వహించింది.

కాని ఇది చాలదు....కార్మిక వర్గం మరో అడుగు–గుణాత్మకమైన ముందడుగు వేయాలి. ప్రజానుకూల విధానాల సాధనకు వైతాళికుడు కావాలి.




అందుకే .... దానికేం చేయాలని మహాసభలు ప్రశ్నించుకున్నాయి. శక్తిని అంచనా వేసుకున్నాయి. బలహీనతలు పరిశీలించాయి. వాటిని అధిగమించేందుకు, శక్తిని మరింత శక్తివంతంగా వుపయోగించుకొనే మార్గాలు నిర్ణయించాయి.

"ప్రభుత్వవిధానాలపై పోరాటం, కష్టజీవులందరి సమైక్యత"- ఇదీ ఈనాటి నినాదం. అమలుకు తెచ్చేందుకు అంకితమవుదాము.

ఈ కర్తవ్యం ఆంధ్ర కార్మికుల ముంగిటి కొచ్చింది.

కాంగీ పోయింది. తానే ప్రత్యామ్నాయమని చెప్పుకుంది "తెలుగుదేశం."

కుర్చీలలో ముఖాలు మారితే ప్రత్యామ్నాయం కాదు. కార్మికుల పోరాటాల పట్ల వైఖరేమిటి ? ఉద్యోగుల కోర్కెలను ఎలా పరిష్కరిస్తారు? నియంతృత్వ వ్యతిరేక పోరాటంలో పాత్ర ఏమిటి? కష్టజీవుల నికృష్ట స్థితికి ఎలా విష్కృతి కనుక్కుంటారు?

ఐ. ఎల్. టి. డి. మూత ఆంధ్ర ప్రభుత్వానికే సవాలు. ఏం చేసింది "తెలుగుదేశం?" పేపరు మిల్లు సమ్మెకు 'ఎస్మా' ప్రయోగించడం కాంగ్రెస్‌కన్నా ఎలా భిన్నమనిపించుకుంటుంది? కార్మికుల సమ్మెలలో పోలీసు జోక్యం తరిగిందా?....లేదు....లేదు.

మధ్యతరగతి వుద్యోగులపై ప్రభుత్వ దాడి పాత ప్రభుత్వాన్ని తలదన్నుతోంది.

ఉద్యోగ విరమణ వయస్సు తగ్గించారు. అది చట్ట విరుద్ధం. ఆ పొరపాటు చర్యను సమర్థించుకునేందుకు సర్వీసు నిబంధనలను సవరించారు. ఆర్డినెన్సు తెచ్చారు. అది పూర్వపు రోజులకు వర్తించేలా అన్వయించడం మరీ ఘోరం.

స్వాతంత్ర్యం వచ్చినప్పటికీ సామ్రాజ్యవాదులు ఏర్పరచిన సర్వీసు నిబంధనలే సాగుతున్నాయి. అవి మరింత కఠినతరంగా మార్చారు.

ఇప్పుడు తెలుగుదేశం ఆ ఒరవడినే నడిచింది. ముందువారిని తలదన్నింది.

అయినా తాను ప్రత్యామ్నాయమంటుంది.

బెంగాల్ లెఫ్ట్‌ఫ్రంట్ ప్రభుత్వం సమ్మె హక్కుతో సహా అన్ని ప్రజాతంత్ర హక్కులనూ కలిగిస్తూ సర్వీసు నిబంధనలు రూపొందించింద. దేశానికే ఆదర్శంగా నిలిచింది.

ఇదీ ప్రత్యామ్నాయం.

ప్రత్యామ్నాయమని మాట్లాడటం కాదు.

చేతల్లో ప్రత్యామ్నాయం చూపడం.

'తెలుగుదేశం' చేసిన తప్పును దిద్దుకుంటుందా? ప్రతిష్ఠకు ప్రాకులాడి మరిన్ని తప్పులు చేస్తుందా?

మొదటి బాట పట్టాలని మేము ఆకాంక్షిస్తున్నాం

రెండవమార్గం పడితే ప్రతిఘటనతప్పదని హెచ్చరిస్తున్నాం.

అందుకే–

"ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలపై పోరాటం. కష్టజీవు లందరి సమైక్యత" ఈనాటి కీలక నినాదం.

అది ఆంధ్ర కష్టజీవుల ముంగిటికి వచ్చింది.

ఆ కర్తవ్య నిర్వహణకు ఈ "మే డే"నాడు అంకితమవుతూ శపథం చేద్దాం.

# సి. ఐ. టి. యు. పతాక నీడన...

భరతదేశ శ్రామికులకు
భవితవ్యం చూపగా
సి ఐ టి యు వెలసింది
భాస్కరునికి పగిదిగా
చికాగో మృతవీరులు
చిందించిన రక్తం
వరవడిగా ఈ సంఘం
వెలసిందిది సత్యం
లాభాలకు యజమానులు
చేసిరెన్నో ఘోరాలు
కష్టజీవి బ్రతికేందుకు
ప్రతిఘటించే నిన్నాళ్లూ
ఆస్తికొరకు సంపన్నులు
భుక్తికొరకు కూలన్నలు
యుగయుగాల సాగించిన
అనవరత సంఘర్షణ
కేతనమే సి ఐ టి యు
శ్రమశక్తిని ధారపోసి
సృష్టించిన సంపదంత
కొంతమంది సంపన్నుల
భుక్తమయ్యే విధానం
"ఇక సాగదు, సాగనీము"
అనేదే నినాదం
అందుకే సి ఐ టి యు
ఉత్పత్తులు, పంపకాలు
జాతిపరం కావాలని
జాతిలోని ప్రతివానికి
అందుబాటు కావాలని
అది యిచ్చే సామ్యవాద
సమాజమే ధ్యేయమని
వెలసింది సి ఐ టి యు
వెలుగొందును సి ఐ టి యు
శ్రమతో ఎదిగిన సంపద
శ్రమజీవులకే చెందు విధము
సాధించగ శ్రమజీవులు
చేయికలిపి పోరాలని
సమతా, మమతల రాజ్యం
సాధించగ ప్రతినబూని
సి ఐ టి యు సాగుతోంది
విప్లవాల దిశగా
ఇంద్రభవన మందిరాలు
భువిమోహన ప్రాజెక్టులు
పట్టణాలు, కట్టడాలు
చుక్క చుక్క చెమటచేర్చి
ప్రాణాలను పణంపెట్టి
రాయి, రాయి పేర్చికట్టి
సౌందర్యం పెంచినోళ్లు
సుఖజీవిత మిచ్చినోళ్ళు
తిండిలేక బండబారి
సూరేడుని "వెన్నెల్లో"
చితికిపోవు
బ్రతుకులోన
నిజం తెలిసి ఒక్కటిగా
కోటి చేతులు లొకటిచేసి
కోటి గొంతులు కలిపి
దోపిడీ వ్యవస్థనంత
కూకటేళ్ళతో తోయగ
కదనరంగ మురకమంటూ
పిలుపిచ్చెను సి ఐ టి యు
శ్రమజీవుల రక్తంతో
తడిసొచ్చిన హక్కులన్ని
ఒక్కొక్కటి కాజేయగ
నియంతృత్వ శక్తుల
నీతిలేని శాసనాలు
ప్రజాతంత్ర హక్కులను
కాలరాయబూని
చేస్తున్న శాసనాల
కాలరాయరేమి ?
కలదు రండు ఎర్రజెండ
కలదు రండు
సి ఐ టి యు
కదనరంగ మురక మనకు
కాలహరణ మెందుకు ?

— గంగాధర్

---

స్వేదం - రుధిరం కలసిన
శ్రమశక్తిని ధారపోసి
ఆస్తిపరుల బొక్కసాల
అత్యధికం చేసి పెంచు
వేతనాల బానిస
ఆకలి, దారిద్ర్యాలతో
అల్లాడే కష్టజీవి
అటు పెరిగే సంపదకు
ఇటు కూలే తన బతుక్కు
మధ్యనున్న రహస్యం
అధికారం పరులచేత
పడివుండడమేనని
సంపన్నుల సంరక్షణ
ఈ రాజ్యం లక్ష్యమని
బండ బ్రతుక్కు
తమను కట్టు
రాజ్యాంగం గుదిబండని
ఆస్తిపరుల విధానాలు
కనిపించని బంధాలని
కన్నుతెరచి సత్యమెరిగి
సహచరులను ప్రోగుచేసి
సంఘశక్తి సమకూర్చుక

ముఖచిత్రం అలంకరణ
నందలాల్

ఈ సమాజ సర్పదష్ట
బాధితులను తోడుగొని
పర్జన్యం పూరిస్తే
దౌర్జన్యం నెదిరిస్తే
ఆ ఐక్యత
ఆ కదలిక
అది అంకెల రాసి కాదు
వాసి పెరిగి ఆయుధమై
ద్విగుణీకృత శక్తినిచ్చు
ప్రతిఒక్కడు మేరునగము
ప్రతి హస్తం వేయింతలు
కదలిన ప్రతి చెయ్యూ
వేయి కరాలుగ వెలయును
ఈ భువిలో
దుర్మార్గం
దౌర్జన్యం
విలయతాండవం చేసే
దోపిడీల, రాపిడీల
సామాజిక వ్యవస్థకు
ఆనాడే ఆనాడే
ఆనాడే యిక అవనిక

# భారత కార్మిక వర్గానికి ప్రణాళిక

భారత కార్మికులారా!

మీ దేశ భవితవ్యాన్ని నిర్ణయించే మీ హక్కును ధృవపరచవలసిన సమయం ఆసన్నమైంది. జాతీయ జీవన ప్రవంతినుండి దూరంగావుండి భారతదేశంలో చరిత్రను సృష్టిస్తున్న సంఘటనలో భాగస్వాములు కాకుండా వుండడానికి వీలులేదు. సామాన్య ప్రజానీకంలో అధిక సంఖ్యాకులు మీరు. రాజకీయ చదరంగంలో ప్రతి కదలిక, మీ దేశ ఆర్థిక, రాజకీయ రంగాలలో వచ్చే ప్రతి మార్పు మిమ్మలను ప్రభావితం చేసినంతగా మరే యితర వర్గాన్ని ప్రభావితం చేయదు. మీ బాధ్యతలను గుర్తెరిగి మీ హక్కులను అర్థం చేసుకోవాలి. మీ భవిష్యత్తును నిర్ణయించుకుంటానికి సమాయత్తం కావాలి.

ఓ భారత కార్మికులారా! మీరు దీనస్థితిలో వున్నారు. ఈ స్థితిని మెరుగు పరుచుకొనడం ఎలా? అస్సాం టీ తోటలలో పని చేస్తున్న బానిసల పరిస్థితి చూడండి. వారిలో తెగింపు వచ్చింది. ప్రభుత్వ చట్టాల ప్రకారమే వారి రోజు కూలి మూడు అణాలకంటె తక్కువ నిర్ణయించబడింది. వారు పశువులవలె చూడబడుచున్నారు. ఈ టీ తోటల యాజమాన్యాలు 20 శాతం నుండి 40 శాతం డివిడెండ్లు చెల్లిస్తుండగా వాటిలో పనిచేసే కార్మికులు మాత్రం పరిమితి లేకుండా ఎక్కువ గంటలు పని చేయవలసి వస్తోంది. కార్మికులను కరువుకు గురిచేసి, మృత్యువుకు బలిచేసి యీ డివిడెండ్లు చెల్లిస్తున్నారు. మీరు, మీ పిల్లలు, మీ భార్యలు యీ దారుణాలకు అమాయకంగా బలియవుతున్నారు. ఈ దోపిడీని అర్థం చేసికొని యీ అర్థ బానిసల తరపున పోరాటం సాగిస్తున్న సి. ఎఫ్. ఆండ్రూస్‌కు మీ యూనియన్ల సభ్యులనుండి మీ శక్తికొలది ప్రత్యేక చందాలు వసూలు చేసి పంపవలసినదిగా కోరుచున్నాము.

ఓ భారత కార్మికులారా! ఈ భూమి ప్రజలందరి వారసత్వం. ఇది రాజకీయ నాయకులకుగాని, సిమ్లాలోని బ్యూరోక్రాట్లకు, ధనిక వర్గానికి చెందిన మిల్లు యజమానులకు రిజర్వు చేయబడలేదు. మీ జాతీయ నాయకులు స్వరాజ్యాన్ని కోరుతున్నారు. స్వరాజ్య సాధనకై సాగే పోరాటంలో మీ పాత్ర గణనీయం కావాలి. ఆర్థిక స్వాతంత్ర్యం లేకుండా రాజకీయ స్వాతంత్ర్యం నిరర్థకం. అందువలన మీరు దేశ స్వాతంత్ర్య ఉద్యమాన్ని నిర్లక్ష్యం చేయడానికి వీలులేదు. మీరు ఈ ఉద్యమంలో ప్రధాన భాగస్వాములే స్వాతంత్ర్య సాధనను నిర్లక్ష్యం చేసినట్లయితే యిక మీకు విముక్తిలేదు.

ఓ భారత కార్మికులారా! మీరు మా యూనియన్లలో సభ్యులుగా వున్నంత మాత్రాన మీరు భారత జాతీయ కాంగ్రెసులో చేరడానికి ఏ విధమైన అభ్యంతరంగాని, అడ్డుగాని లేదు. స్వాతంత్ర్య సాధనపై పోరాటం సాగిస్తున్న మన అస్సాం కామ్రేడ్స్‌వలె మీరు కూడ కష్టాల నెదుర్కొనవలసివుంటుంది. అంత:కలహాలు పెట్టడానికి తనతో సహకరించనందుకు మీ నాయకులను సర్ విలియం విన్సెంట్ బెదిరించినట్లుగా మీ యజమానులుకూడ మీపై అక్రమ చర్యలు తీసుకొనవచ్చు. మీరు భయపడవలసిందేమీ లేదు. పశు ప్రవర్తనకు, అర్థ బానిస పరిస్థితులకు, స్త్రీలు, పిల్లలు ఘోరంగా దోపిడీ చేయబడటానికి వ్యతిరేకతను సృష్టించడం నేరమేమీ కాదు. గత సంవత్సర కాలంగా దేశంలో జరిగిన ప్రతి పెద్ద సమ్మె పోరాటం సందర్భంగానూ యజమానులు ఎంత అడ్డు పడినప్పటికీ మన నాయకుల పలుకుబడి వలన పారిశ్రామిక శాంతి నెలకొల్పడం, ఒప్పందాలు చేసికొనడం మీకు తెలుసు. ఎవరెంత తప్పుగా చిత్రీకరించడానికి ప్రయత్నించినా మీ ప్రయోజనాలే మానవ జాతి ప్రయోజనాలు.

ఓ భారత కార్మికులారా! మీరు ఐక్యతను సాధించడం ఒక ప్రధాన కర్తవ్యం. మీ సంఘాలలో మరింత ఐక్యతను సాధించండి. చట్టాలు మీకు ఐక్యతను సాధించిపెట్టలేవు. కార్మికులలో సోదర భావాన్ని పెంపొందించలేవు. అవి మీరు సాధించుకొనవలసినవి. అందువలన ఫ్యాక్టరీ చట్టాలను గురించి ఆలోచించకండి. పెట్టుబడిదారులు కార్మికులను అనైక్యంగాఉంచడమే ఫ్యాక్టరీలోనూ, బయట కూడ ఏకైక నినాదంగా పెట్టుకున్నారు. ఐక్యత, సోదరభావం మీ నినాదాలు కావాలి. మీ సంఘాల బలం పైననే మీ విముక్తి ఆధారపడి యున్నది. బలహీనతలను విడనాడి స్వాతంత్ర్యం, అధికారం సాధించడానికి ప్రగతి పథాన పయనించండి.

దివాన్ చమన్‌లాల్
ప్రధాన కార్యదర్శి
అఖిల భారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్

---

*(భారతదేశ కార్మికులకు 1920 సంవత్సరంలో అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ప్రకటించిన ప్రణాళిక)*

---

# ట్రేడ్ యూనియన్లు

# నిన్న నేడు రేపు

## కారల్ మార్క్స్

### అ) నిన్న

పెట్టుబడి కేంద్రీకృతమైన సాంఘిక శక్తి. కార్మికులు కేవలం తమ శ్రమశక్తిని అమ్ముకోవలసిన వారే. అందువల్ల పెట్టుబడికి కార్మికులకు మధ్య జరిగే "ఒప్పందం" సమాన స్థాయిలో జరగడం అసాధ్యం. జీవితానికి, శ్రమకు సంబంధించిన భౌతిక వనరులను ఒక వైపు, కీలకమైన శ్రమశక్తులను మరొక వైపున ఎదురు బొదురుగా నిలిపివుంచే సమాజం అంగీకరించే న్యాయ సూత్రాల దృష్ట్యా చూచినా వారి మధ్య న్యాయమైన ఒప్పందం అసాధ్యం. కార్మికుల సంఖ్యే వారి సామాజిక శక్తి. అయితే ఈ సంఖ్యాబలం అనైక్యత మూలంగా బద్దలవుతున్నది. "తమలో తమకుగల అనివార్యమైన పోటీ వల్లనే అనైక్యత తలెత్తి, కొనసాగుతున్నది.

తమ బ్రతుకు పరిస్థితులను బానిసలస్థితికన్నా కొంత మెరుగుగా వుండే విధంగా ఒప్పందం సాధించుకోవాలనే కార్మికుల కాంక్ష, తమ మధ్యగల పోటీని నివారించేందుకు, కనీసం అదుపులో వుంచే కృషికి వారిని యాదృచ్ఛికంగానే ప్రోత్సహించింది. ఈ "యాదృచ్ఛిక" ప్రయత్నాలనుండే ట్రేడ్ యూనియన్లు మొదట తలెత్తాయి. అందువల్ల సహజంగానే వాటి తక్షణ లక్ష్యాలు రోజూవారి అవసరాలకే పరిమితమయినాయి. పెట్టుబడి అహర్నిశలు సాగించే దాడులను అడ్డుకునే తక్షణ అవసరాలకే ముడిపడ్డాయి. ఒక్క ముక్కలో చెప్పాలంటే జీతాలకు, పని గంటలకు పరిమితమైనాయి. ట్రేడ్ యూనియన్ల ఈ కార్యాచరణ న్యాయసమ్మతమే కాదు, అత్యవసరంకూడా. ఈనాటి వుత్పత్తి విధానం కొనసాగినంత కాలం ఈ కార్యక్రమాన్ని వదలి పెట్టలేము సరికదా, అందుకు భిన్నంగా ట్రేడ్ యూనియన్లను ఏర్పరచి, అన్ని దేశాల ట్రేడ్ యూనియన్ల మధ్య సంఘీభావం సాధించడంద్వారా దీనిని సర్వసాధారణ అంశంగా రూపొందించాలి. మరో వైపు బుద్ధి పూర్వకంగా కాకపోయినా ట్రేడ్ యూనియన్లు కార్మిక వర్గ "నిర్మాణ కేంద్రాలుగా రూపొందుతున్నాయి." మధ్య యుగాలలో మధ్య తరగతికి ఆనాడు మునిసిపాలిటీలు, కమ్యూన్లు ఇలాంటి సమీకరణ కేంద్రాలుగానే వుపయోగపడ్డాయి. పెట్టుబడికి, కార్మికులకు మధ్య జరిగే గెరిల్లా పోరాటాలకు ట్రేడ్ యూనియన్లు అవసరమని భావించినపుడు వేతన కార్మికులు-పెట్టుబడిదారులపాలన అనే వ్యవస్థనే రద్దుచేసే నిర్మాణయుత యంత్రంగా వాటికి మరింత ప్రాధాన్యత వుంది.

### అ) నేడు

పెట్టుబడితో సాగించే స్థానిక తక్షణ పోరాటాలలో పూర్తిగా కూరుకొని పోయిన ట్రేడ్ యూనియన్లు వేతన బానిసత్వ విధానాన్ని వ్యతిరేకించడంలో తమ శక్తిని యింకా అవగాహన చేసుకోలేదు. అందువల్లనే సాధారణ సాంఘిక, ఆర్థిక ఉద్యమాలనుండి వారు బాగా దూరంగా వుండిపోయారు. అయితే ఈ మధ్య కాలంలో వారి చారిత్రక మహత్తర కర్తవ్యం పట్ల కొంత ఆలోచనలు తలెత్తుతున్నట్లు కనిపిస్తున్నది. వారు ఇంగ్లండ్‌లో రాజకీయోద్యమంలో ఈమధ్య పాల్గొంటున్నారు. అమెరికాలో తమ కార్యకలాపాలను విస్తృత పరచేందుకు నిర్ణయించుకున్నారు. ఇవి కొన్ని ఉదాహరణలు. షెఫీల్డులో ఈమధ్య జరిగిన కార్మిక ప్రతినిధుల మహాసభ చేసిన తీర్మానం మరొక ఉదాహరణ.

"అన్ని దేశాల కార్మికులను ఒకే సామాన్య సోదరత్వ బంధంతో కలిపేందుకు అంతర్జాతీయ సంస్థ చేస్తున్న కృషిని ఈ మహాసభ సంపూర్ణంగా అభినందిస్తున్నది. ఈ మహాసభలో పాల్గొన్న సంఘాలన్నింటిని, ఆ సంస్థకు అనుబంధం పొందడం అవసరమని హృదయపూర్వకంగా కోరుతున్నది మొత్తం కార్మికజాతి పురోగతికి సౌభాగ్యానికి, ఇదిఎంతో ఉపయుక్తమని విశ్వసిస్తున్నది"

### ఇ) రేపు

తన "సంపూర్ణ విముక్తి" విస్తృత ప్రయోజనాల దృష్ట్యా, తమ ప్రారంభ లక్ష్యాలతో పాటు, కార్మికవర్గ నిర్మాణ కేంద్రాలుగా రూపొందేందుకు బుద్ధిపూర్వకంగా కృషి చేసేందుకుగాను వారు నేర్చుకోవాలిప్పుడు. ఆ విముక్తి వైపు కొనసాగే ప్రతి సాంఘిక, రాజకీయోద్యమాన్ని వారు సమర్థించాలి. మొత్తం శ్రామిక వర్గ ప్రతినిధులుగా, వారి హక్కులకై నిలిచే మొనగాళ్లుగా తమను తాము భావించుకొని, అందుకు తగినట్లు కృషి చేయాలి.

అలా కృషి చేయాలనుకుంటే ట్రేడ్ యూనియన్లలోలేని కష్టజీవులను తమలో కలుపుకోవడంలో విఫలంకారాదు. కొన్ని ప్రత్యేక పరిస్థితుల మూలంగా శక్తి హీనులైన వ్యవసాయ కార్మికులవంటి నికృష్టవేతనాలు పొందేవారి ప్రయోజనాలను వారు అతి జాగ్రత్తగా కాపాడాలి. తమ లక్ష్యాలు స్వార్థపూరితము, హ్రస్వము కాదని, కోట్లాది బడుగు జీవుల విముక్తి తమ లక్ష్యమని మొత్తం ప్రపంచానికి నచ్చచెప్పడం అవసరం.

[మొదటి అంతర్జాతీయ సంస్థ ప్రతినిధులకు ఇచ్చిన సూచనలలో భాగంగా 1866 అగస్టు చివరన రాసిన రచన]

# సి. ఐ. టి. యు. ఆశయాలు-లక్ష్యాలు

3) అ) అన్ని వుత్పత్తి సాధనాలను, పంపిణీ, మార్పిడులను సంఘపరం చేయడం ద్వారానే, సోషలిస్టు సమాజాన్ని స్థాపించడం ద్వారానే కార్మిక వర్గంపై సాగే దోపిడీని అంతం చేయవచ్చని సి. ఐ టి యు. విశ్వసిస్తుంది. సోషలిస్టు ఆశయానికి దృఢంగా కట్టుబడివుంటూ, అన్నిరకాల దోపిడీలనుండి సమాజాన్ని విముక్తి చేసేందుకు పోరాడుతుంది.

ఆ) (1) కార్మికుల ఆర్థిక, సామాజిక హక్కుల హరింపును వ్యతిరేకిస్తూ సమ్మె హక్కుతో సహా వారి హక్కులు, స్వాతంత్ర్యాలు విస్తరింప జేసేందుకు, ప్రజాతంత్ర, ట్రేడ్‌యూనియన్ ఉద్యమాల స్వేచ్ఛను పొందేందుకు, రక్షించుకునేందుకు విస్తరింప జేసుకునేందుకు,

(2) రహస్య ఓటింగ్ ద్వారా ట్రేడ్ యూనియన్ల గుర్తింపునకు,

(3) జీతాల పెరుగుదలకు, పని గంటల తగ్గింపుకు, సౌకర్యమైన ఇండ్లవసతి కల్పించాలని, కార్మికులజీవనపరిస్థితుల మెరుగుదలకు,

(4) సంపూర్ణమైన ఉద్యోగ సాధనకు, పనిచేసే హక్కుకోసం, నిరుద్యోగపు బాధలకు వ్యతిరేకంగా,

(5) జబ్బులనుండి, వృద్ధాప్యం, ప్రమాదాల నుండి కార్మికునికి, అతని కుటుంబానికి రక్షణకై పూర్తి, సరిపోయినంత సాంఘిక భద్రతా చట్టం కోసం, తగినంత ప్రసూతి ఇన్సూరెన్సు, వితంతువులయిన తల్లులకు, వారిపై ఆధారపడిన బిడ్డలకు పెన్షన్లు ఇతర అన్ని విధాలయిన సాంఘిక భద్రతకు, ప్రావిడెంట్ ఫండ్, ఇ. ఎస్. ఐ కార్పొరేషన్లపై చందాదారులైన కార్మికుల శక్తివంతమైన అజమాయిషీకి,

(6) సమాన పనికి సమాన వేతనానికి

(7) అస్పృశ్యతవంటికులం, లింగభేదం, మతపరమైన భేదాల మూలంగా ఉద్యోగం, వేతనం, ప్రమోషన్ అవకాశాలలో వివక్షత రద్దుకు, (8) మైనార్టీల ప్రజాతంత్రహక్కుల పరిరక్షణకు (9) పనిచేసే స్థలాలలోపని పరిస్థితులను అజమాయిషీ చేసే దృష్ట్యా సమిష్టి కార్యకలాపాలు సాగే ఫ్యాక్టరీలు, వర్క్‌షాపులు, వ్యాపార సంస్థలవంటిచోట్ల ఎన్నికలద్వారా కమిటీల ఏర్పాటుకు,

(10) తగిన వృత్తి తర్ఫీదుకు.

(11) నిరక్షరాస్యతా నిర్మూలనకు.

(12) ఏర్పడని చోట యూనియన్లను ఏర్పాటు చేసుకునేందుకు సహాయపడేందుకు, ప్రత్యర్థియూనియన్లను ఐక్యంచేసి ఒకపరిశ్రమలో ఒకే యూనియన్ ఏర్పర్చేందుకు కార్మికులను సమీకరించేందుకు సి ఐ టి.యు. పోరాడుతుంది.

ఇ. (1) కార్మికుల తక్షణ ప్రయోజనాలకై సాగించే పోరాటంలో సి. ఐ. టి. యు. (1) మన కార్మికవర్గాన్ని అమానుషంగా దోచుకునే విదేశీ గుత్త సంస్థలన్నింటినీ జాతీయం చేయాలని (2) కార్మికులను పణముగా పెట్టి విపరీతమైన లాభాలను కాజేసే, ధరలను బాగా పెంచి ప్రజలను దోచుకునే ప్రభుత్వ ప్రజా వ్యతిరేక, కార్మిక వ్యతిరేక విధానాలను నిర్ణయించే భారత గుత్త పెట్టుబడిదారులు, బడా పరిశ్రమలనుజాతీయం చేయాలని డిమాండ్ చేస్తుంది.

(11) ప్రజాతంత్ర ట్రేడ్‌యూనియన్ ఉద్యమాలపై దమనకాండ సాగించే ప్రభుత్వ విధానాలను ఎదిరించి పోరాడుతుంది. సి. ఐ టి. యు. పెట్టుబడిదారుల, భూస్వాముల ప్రయోజనాలను కాపాడే పన్నుల పెంపకం, ద్రవ్యోల్బణం ద్వారా కార్మికవర్గంపైన, సామాన్య ప్రజలపై నభారాలనుమోపే ప్రభుత్వ ఆర్థికవిధానాలకు వ్యతిరేకంగా పోరాడుతుంది. ప్రస్తుత బూర్జువా- భూస్వామ్య పాలనస్థానే ప్రజల ప్రజాతంత్రపాలన స్థాపనకై పోరాడుతుంది.

ఈ) 1. ఇందుకోసం :

అ) ప్రజల్లోని యితర సెక్షన్ల ప్రజాతంత్ర హక్కులను బలపరుస్తూ, ఇతర ప్రజాతంత్ర శక్తుల, సంస్థల సహకారాన్ని ప్రస్తుత బూర్జువా భూస్వామ్య పాలనస్థానే ప్రజలప్రజాతంత్రపాలనస్థాపనను కోరుతుంది

ఆ) అమెరికా, ఇతర విదేశీ గుత్తాధిపతులపై అంతకంతకు ఎక్కువగా ఆధారపడడానికి కార్మికవర్గంపై తీవ్రమైన దోపిడీకి దారితీస్తున్న, జాతీయ స్వాతంత్ర్యానికి ప్రమాదకర పరిస్థితిని సృష్టిస్తున్న దానికి వ్యతిరేకంగా తన గళం విప్పి పోరాడుతుంది.

(2) భూమికోసం, వడ్డీ, కౌలు దోపిడీ అధికపన్నులకు వ్యతిరేకంగా రైతులు, వ్యవసాయ కూలీలు సాగించే పోరాటంతో సౌహార్ద్రతా సంబంధాలను సి.ఐ.టి.యు. పెంపొందిస్తుంది. వ్యవసాయక విప్లవ శక్తులకుఅన్ని విధాలా చేదోడు అందిస్తుంది. వేతనాల పెంపుదలకు, శుభ్రమైన జీవన పరిస్థితులకు వ్యవసాయ కార్మికులు సాగించే పోరాటాన్ని పూర్తిగా బలపరుస్తుంది. ఫ్యూడల్ భూస్వామిక సంబంధాలను రద్దుచేయకుండా భూమిపై భూస్వాముల గుత్తాధిపత్యాన్ని బద్దలు కొట్టకుండా కార్మికవర్గ ఆర్థిక స్థితిగతులలో శాశ్వత ప్రాతిపదికపై అభివృద్ధి సాధించడం అసాధ్యమని సి ఐ.టి.యు. విశ్వసిస్తోంది.

(3) సోషలిజం కోసం సాగే సమష్టి పోరాటంలో ఇతరదేశాల కార్మికులతో అంతర్జాతీయసౌహార్ద్రత, ఐక్యతలను ప్రోద్బల పరుస్తుంది. సోషలిస్టు దేశాల ప్రజలతోను కార్మికులతోనులోతైన సంబంధాలను సౌహార్ద్రతా పూరిత సంబంధాలను పెంపొందిస్తుంది.

(4) సామ్రాజ్యవాదుల ఆధిపత్యానికి, దాడికి వ్యతిరేకంగా పోరాడే ప్రజలకు తోడ్పాటునిస్తుంది. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగే జాతీయ విముక్తి వుద్యమాలకు అన్నివిధాలా సహాయ పడుతుంది.

5) ప్రపంచశాంతి పరిరక్షణకు, ప్రపంచ యుద్ధాన్ని ప్రేరేపించేందుకై సామ్రాజ్యవాదుల కుట్రలకు వ్యతిరేకంగా, అణుయుద్ధానికి వ్యతిరేకంగా, అణు యితర సామూహిక వినాశకరఆయుధాల రద్దుకోసంపోరాడుతుంది.

6) విభిన్న సాంఘిక వ్యవస్థలుగలదేశాల మధ్య శాంతియుతసహజీవనంకోసం పోరాడుతుంది. 7) ఇరుగుపొరుగు దేశాలతో స్నేహ సంబంధాలకు, యుద్ధాన్నివ్యతిరేకించే,శాంతికి మద్దతు తెల్పే జాతీయ విముక్తి వుద్యమాలను బలపరచే విదేశాంగ విధానం కోసం పోరాడుతుంది.

8) ట్రేడ్‌యూనియన్ ఉద్యమ సామాన్య లక్ష్యాలను బలిష్ఠం చేసేందుకు యితర అంతర్జాతీయ ట్రేడ్‌యూనియన్ సంస్థలతో సహకరిస్తుంది.

9) వర్గపోరాటం లేకుండా సాంఘిక పరివర్తన సాధించడం సాధ్యం కాదనే భావానికి సి ఐ.టి.యు. గట్టిగా కట్టుబడివుంటుంది వర్గ సామరస్య మార్గాన కార్మికవర్గాన్ని తీసుకెళ్ళే ప్రయత్నాలను నిరంతరం ప్రతిఘటిస్తుంది.

# సి.ఐ.టి.యు. మహాసభ ముందున్న కర్తవ్యాలు

కాన్పూర్‌లో సి.ఐ.టి.యు. మహాసభ గత మహాసభ నాటికన్నా విభిన్నమైన పరిస్థితులలో జరగబోతోంది. విశేషమేమంటే యుద్ధ ప్రమాదం అవధులు దాటి పెరిగింది. ప్రపంచ కార్మికవర్గం, ప్రపంచ ప్రజలు తమ శక్తినంతా ధారపోసి అణు ఉత్పాతం నివారించవలసివున్నది. సామ్రాజ్య వాద యుద్ధ లక్ష్యం సోవియట్ రష్యా సోషలిజం. విజయాలను, ఒక శతాబ్ద కాలంలో ప్రపంచ కార్మిక వర్గం సాధించిన విజయాలను నాశనం చేయటమే.

ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థను అతి తీవ్రమైన, సుదీర్ఘమైన సంక్షోభం ఆవరించి యున్న సమయంలో మన మహాసభ జరుగుతోంది. యుద్ధ సన్నాహానికి ఈ సంక్షోభం కూడా ఒక కారణం. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీదేశాల్లోని నిరుద్యోగులు 3 కోట్లకు పైగా వున్నారు. మరీ పెద్ద దేశాల్లో మిలటరీ వ్యయం విపరీతంగా పెరుగుతోంది. వేలాది కోట్లాదిరూపాయలు ఆయుధాల కోసం ఖర్చు చేస్తున్నారు.

సంక్షోభానికి పూర్వం, తరువాత సంవత్సరాల్లో కూడా సంక్షోభానికి లోనైన దేశాల ఆర్థిక వ్యవస్థపై బహుళజాతి కంపెనీల పట్టు బాగా బిగిసింది. మూడవ ప్రపంచ దేశాలనేకం సంక్షోభంవలన అతి ప్రమాదకరమైన పరిస్థితి నెదుర్కొంటున్నాయి. విదేశాలకు చెల్లించవలసిన మొత్తాలు వాటికి భారంగా పరిణమించాయి. ఇప్పటికే ఆ దేశాలు శక్తికి మించిన అప్పులు చేశాయి.

అందువలన సామ్రాజ్యవాదులు నయా వలస విధానపు కుట్రలతో ఈ దేశాల ఆర్థిక రంగాలలో చొరబడి తమ ఆధిపత్యం పటిష్టం చేసుకోవడానికి మంచి అవకాశం కలిగింది.

పెట్టుబడిదారీ దేశాలో కార్మికులు తమపై పడే భారాలను తీవ్రంగా ప్రతిఘటించి విస్తృతమైన పోరాటాలు చేస్తున్నారు. కొన్ని సందర్భాల్లో ఈ పోరాట వెల్లువలు జాతీయ సరిహద్దులు దాటి ప్రవహిస్తున్నాయి.

పెరుగుతున్న పోరాటాల స్థాయినిబట్టి పోరాట చైతన్యం కూడా పెంపొందుతోందని చెప్పాలి. పోరాటాలు జాతీయ, అంతర్జాతీయ



స్థాయిలో జరుగుతున్నాయి. శాంతి పరిరక్షణకు, వర్ణవివక్షతకు వ్యతిరేకంగా యువజనులు, మహిళల హక్కులకోసం జరిగే ప్రజాతంత్ర వుద్యమాలలో కార్మికపోరాట వాహినులు విలీనమవుతున్నాయి. సంఘటితమైన కార్మికులు తమ సమ్మె సమస్యలలో కేవలం ఆర్థికపరమైన కోర్కెల పరిధిని కూడా అతిక్రమించి పాలకవర్గాల సాంఘిక - ఆర్థిక విధానాలకు ప్రజాతంత్ర ప్రత్యామ్నాయం సూచిస్తున్నారు.


బి. టి. రణదివె
అధ్యక్షులు
సి. ఐ. టి. యు.


పాలకవర్గాలు కొనసాగించే విధానాలవలన అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాల్లో అస్థిరత నెలకొని గత 10 సంవత్సరాల్లో 80సార్లు ప్రభుత్వాలురద్దయినాయి.రాజ్యాంగం ప్రకారం పదవీకాలమంతా ప్రభుత్వాలు అధికారంతో వుండలేకపోయాయి.

ఈ దేశాల్లో బహుళజాతి సంస్థలకు వ్యతిరేకంగా పోరాటాలు తీవ్రమైనాయి. వివిధ దేశాల్లోని బహుళజాతి సంస్థలలో కార్మికులు సమ్మెలు చేస్తున్నారు.

పశ్చిమదేశాలన్నింటిలోను ట్రేడ్‌యూనియన్ ఐక్యత, అంతర్జాతీయ సంఘీభావం కావాలనే బలమైన కోర్కె వున్నది. బహుళజాతి సంస్థలకు వ్యతిరేకంగా పోరాటాలు తీవ్రం కావటంతో ఐక్యత, అంతర్జాతీయ సంఘీభావం కోసం తపన మరింత బలపడింది.

గుత్తపెట్టుబడులకు వ్యతిరేకంగా ఈ దేశాల్లో జరిగే ట్రేడ్‌యూనియన్ పోరాటాల వలన రాజకీయ పరిణామాలు అనేకం కలుగుతున్నాయి. ప్రజా సందోహం కూడా ఈ ఉద్యమాల్లో ట్రేడ్‌యూనియన్లతోకలసి పోరాటంలో పాల్గొని ప్రభుత్వ గుత్తపెట్టుబడిదారీ పాలనకు, రాజ్యాంగయంత్రంపై గుత్తపెట్టుబడుల పట్టుకు వ్యతిరేకంగా పోరాటం చేస్తున్నారు.

మూడవ ప్రపంచ దేశాల్లో చాలాచోట్ల నియంతలు పరిపాలిస్తున్నారు. అక్కడ ట్రేడ్‌యూనియన్ కార్యకలాపాలపై తీవ్ర నిర్బంధంగాని, నిషేధంగాని వున్నది. కాని విదేశీ ఋణాలు, విషమిస్తున్న ఆర్థిక పరిస్థితులవలన, భారం అధికమవుతున్నందువలన ట్రేడ్‌యూనియన్లు తమ ప్రతిఘటనలో విజయంపొందుతున్నాయి. కార్మికులు సంప్రదాయసిద్ధమైన సమ్మెలు చేయటమే గాక ఫ్యాక్టరీలు స్వాధీనం చేసుకోవటం, ఒక నిర్ణీత పద్ధతిలో పరిశ్రమ వివిధభాగాల్లో పనిని ఆపివేసే "ఎత్తుకు-పై ఎత్తువేసే" సమ్మెలు, నిబంధనల ప్రకారం పని మొదలైన పోరాట రూపాలు కనిపెట్టారు.

మూడవ ప్రపంచ దేశాల్లో కార్మికోద్యమం, తమ దేశాల్లో సామ్రాజ్యవాద కుట్రలను, బహుళజాతి కంపెనీల ప్రవేశాన్ని అరికట్టాలంటే పోరాటం తప్ప వేరే మార్గం లేదు. మూడవ ప్రపంచ దేశాలన్నిటిలోను వలస వేతన విధానం అంతంచేసి కార్మికవర్గం యొక్క జీవనస్థాయిని పెంపొందింపచేయటానికి ట్రేడ్ యూనియన్లు నిరంతర పోరాటాలు చేస్తున్నాయి. తమ దేశాల్లో రైతాంగాన్ని భూస్వామ్య దోపిడీ నుంచి విముక్తం చేయనిదే కార్మిక వర్గం యొక్క జీవన స్థాయిలో సమూలమైన మార్పులు సాధ్యం కావని చాలా ట్రేడ్ యూనియన్లు గుర్తించాయి.

ఈ పరిస్థితుల్లో సి.ఐ.టి.యు. మహాసభ జరుగుతోంది. నేడు సి.ఐ.టి.యు., భారత కార్మికోద్యమం కూడా ఈ సమస్యలనే ఎదుర్కొంటున్నాయి. సమస్యల స్వభావంలో

# యజమానుల దాడిని ఎదుర్కొనేందుకు కొత్త పోరాట పద్ధతులు చేపట్టాలి

వచ్చిన మార్పును గమనించకపోతే సి. ఐ. టి యు. తన బాధ్యతలు నిర్వర్తించలేదు.

మారుతున్న పరిస్థితులను, తలెత్తే క్రొత్త సమస్యలను గమనించి వాటినిబట్టి సి.ఐ.టి.యు. తన పంథా రూపొందిస్తోంది. అయితే వివిధ యూనియన్లు, రాష్ట్ర కమిటీలు నూతన సమస్యలను గమనించి వాటి కనుగుణంగా తమ పోరాటరూపాలు రూపొందిస్తున్నాయని చెప్పలేము.

ఉదాహరణకు దిగజారుతున్న అంతర్జాతీయ పరిస్థితిని, పెరిగే యుద్ధ ప్రమాదాన్ని తీసుకుందాం. సి.ఐ టి.యు. మొదటినుంచి శ్రామిక వర్గ అంతర్జాతీయ సూత్రానికి కట్టుబడి వున్నది. కాని యుద్ధ ప్రమాదం పెరిగే కొలది మనం జాగురూకత వహించటంలో వెనక పడినామని స్పష్టమైంది. అమెరికా యుద్ధ చర్యలగురించి మన యూనియన్లను కార్మిక వర్గాన్ని నిరంతరం హెచ్చరిస్తూనే వున్నాం. కాని యీ పోరాటం కార్మికులదే నని, వారిని చైతన్య ప్రభావితం చేయటానికి తగినంత ప్రచార ప్రయత్నం జరగలేదు సెప్టెంబరు 1వ తేదీ యుద్ధ వ్యతిరేక దినంగా పాటించమని బెంగుళూరు నుంచి పిలుపిచ్చాం. పశ్చిమ బెంగాలు, కేరళ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల్లో ఈ పిలుపుకు బ్రహ్మాండమైన ప్రతిస్పందన కలిగింది. ఆ తరువాత మన కార్యకలాపాలు చాలామటుకు నిలిచిపోయాయి. మనం లాంఛనప్రాయంగా ప్రదర్శన నిర్వహించాం. అంతకుమించి ఏమీ చేయలేదు. ఈ సమస్య గురించిగాని, ప్రచారం విషయంలోగాని మన యూనియన్లు నిరంతర శ్రద్ధ చూపలేదు. మనం సమీకరించిన వారికైనా ఇది సజీవ సమస్య అనే విషయం గుర్తింపజేయకపోతే అసలు పోరాటమే ప్రారంభంకాదు.

మన యూనియన్లను కదిలించటంతోనే మన కర్తవ్యం పూర్తికాదు. ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో నాయకత్వ స్థాయిలో వున్న మన సంస్థ యుద్ధ ప్రమాదానికి,దాన్ని రెచ్చగొట్టే సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాడటానికి మొత్తం కార్మికోద్యమాన్ని సంఘటితం చేయాలి.

ఇక్కడే మనం కష్టాలు ఎదుర్కొంటాం. కనీసం జాతీయ ప్రచార కమిటీలోని యూనియన్లకు కూడా యుద్ధ వ్యతిరేక పోరాటం మీద ఏకాభిప్రాయం లేదు. యుద్ధానికెవరు బాధ్యులనే విషయంపై బి.ఎం.ఎస్.కు వేరే అభిప్రాయాలున్నాయి. వారు రంగంలోకి వస్తే వారి గురి అమెరికాపైకిఎక్కుపెట్టరు. సోవియట్ రష్యాపై ఎగబడతారు. ఎ. ఐ. టి.యు.సి, యు. టి. యు. సి, యూనియన్లు మాత్రం మనతో వున్నాయి. ఐ. ఎన్. టి. యు.సి.నాయకత్వానికి అంతర్జాతీయ దృక్పథం లాంటి విషయాల్లో విశ్వాసం లేదు. యుద్ధం, శాంతివంటి సమస్యలు ట్రేడ్ యూనియన్లకు సంబంధించినవి కావని వారి అభిప్రాయం. పరిస్థితి ఎంత తీవ్రంగా వుందో, మనముందు ఎంతటి బృహత్తర కర్తవ్యం వుందో దీన్నిబట్టి మీకు తెలిసేవుంటుంది. ఏదో చిన్న ప్రచార బృందంగా వ్యవహరించటానికిది సమయం కాదు. సి.ఐ.టి.యు. మహాసభలో ఈ సమస్య చర్చించి, సి ఐ.టి.యు. యూనియన్లను, మొత్తం ట్రేడ్ యూనియన్ వుద్యమాన్ని యుద్ధానికి వ్యతిరేకంగా శాంతికోసం పోరాడేందుకు కార్మికులను సమీకరించే విధంగా మలచటానికి చర్యలు చేపట్టాలి.

పెట్టుబడిదారీ సంక్షోభం భారతదేశాన్ని ఆవహించింది. ప్రభుత్వం ఎంత కాదన్నా భారతదేశం ఆర్థిక మాంద్య బాధతో గిలగిలలాడుతోంది. తాజాగా భారత ప్రభుత్వం వెలువరించిన ఆర్థికసర్వే ప్రకారం 1981_82 పారిశ్రామిక వుత్పత్తి 8.6 శాతం, 1980-81లో 4.0శాతం పెరగగా ఆ సంవత్సరాలతో పోలిస్తే ఈసంవత్సరం పారిశ్రామిక ఉత్పత్తి 4.5 శాతం మాత్రమే పెరుగుతుందని తెలిపింది. సర్వే ప్రకారం "గత సంవత్సరంలో పోలిస్తే ఈ ఏడాది తక్కువ ఉత్పత్తి వుండటానికి కారణం, వివిధ రంగాలలో ఉత్పత్తి స్థాయి క్రిందటేడాది శిఖరాగ్రానికి చేరుకున్నది కాబట్టి, ఈ ఏడాది మందకొడిగా సాగింది." వేలాది మంది కార్మికులను నిరుద్యోగులను చేస్తూ జూట్ మిల్లులను మూసివేయటం, దీర్ఘకాలం లాకౌట్లు, లే ఆఫ్‌లు, సమ్మెలు మన ఆర్థిక వ్యవస్థకు అంటిన జాడ్యానికి నిదర్శనలు.

సర్వేలో అధికోత్పత్తి, వస్తు నిలువల గురించి ఈ విధంగా వివరించారు: "వ్యవసాయానికుపయోగించే ట్రాక్టర్లు, రవాణా వాహనాలు తయారుచేసే పరిశ్రమల్లో సరఫరా ఎక్కువైంది.... అందువలన ఈ సంవత్సరం మొదటి అర్ధభాగంలో అమ్మకంకాని నిలవ వసువుల జాబితా పెరిగింది కాస్టిక్ సోడా, సోడా యాష్ పరిశ్రమల్లో కూడా వస్తుసరఫరా అధికంగా వున్నది. బొంబాయి మిల్లుల్లో సమ్మె ప్రభావం ఖద్దరు, చేనేత పరిశ్రమలపై వున్నట్లు కనిపిస్తోంది_ కాగితం పరిశ్రమలోకూడా నిలవలు పెరిగాయి_ ఎరువులు అధికంగా నిలవ వుండటానికి కారణం రైతులు చెదురుమదురుగా కొనటమే...."

1981 - 82లో ప్రధాన కర్మాగారాల్లో స్టీలు వుత్పత్తి 13 7 శాతం పెరిగినా 1982_83 మొదటి అర్ధభాగంలో స్టీలు అమ్మకం 2.8 శాతం తగ్గిపోయింది. రైల్వే వ్యాగన్లు, రవాణా వాహనాలు, ట్రాక్టర్లు తయారుచేసే పరిశ్రమలనుంచి డిమాండు లేకపోవడంవలన స్టీలు పరిశ్రమ ఇటీవలికాలంలో బాగా దెబ్బతిన్నది.

ఏప్రిల్ నుంచి అగస్టు 82 వరకు గల కాలంలో ఒక్క బొంబాయి టెక్స్‌టైలు మిల్లు సమ్మె వలనే 4,87,000 పనిదినాలు నష్టమైనాయి.

1981లో ఆర్థిక రుగ్మతకు లోనై మూతపడిన పెద్ద పరిశ్రమల సంఖ్య 332 నుంచి 421 కి పెరిగింది. అగస్టు 1981 లో ఎంప్లాయ్‌మెంటు ఎక్స్చేంజీలో నమోదు చేయించుకున్న వారి సంఖ్య 1,72,00,000 అగస్టు 1992లో ఈ సంఖ్య 1,90,00,000కు పెరిగింది. జనవరి_సెప్టెంబరు '82 మధ్య కాలంలో సగటువ నెలవారీ ప్రకటించిన

# ఐక్య కార్యాచరణ సాధనకు సి. ఐ. టి. యు. స్వంత కార్యకలాపాలను పెంచండి

ఉద్యోగాలసంఖ్య 68 9 లక్షలు. ఇది గత సం॥ ఇదేకాలంలో ఏర్పడిన వుద్యోగవసతులకన్నా ఇది 6.4 శాతం తక్కువ.

ఇక రైతులు, వ్యవసాయ కూలీల విషయానికొస్తే, వారు ఈ సంవత్సరం పూర్తిగా నాశనమైపోయారనే చెప్పాలి. లాకౌట్లు, లేఆఫ్‌లు, దీర్ఘ కాల సమ్మెలద్వారా కార్మికులు, ట్రేడ్ యూనియన్ ఉద్యమం సంక్షోభ దుష్ఫలితాలను అనుభవించారు. అయితే ప్రధాన సమస్య వేలాది కార్మికులను నిరుద్యోగులను చేసే లాకౌట్లను కార్మికవర్గం, సి.ఐ.టి.యు. ఎంత పటిష్టంగా ఎదుర్కొని ప్రతిఘటించారనేది. ఈ కార్మికుల కుటుంబాలు సామాన్య ప్రజానీకంలో ఒక భాగం. లాకౌట్ సంఘవ్యతిరేక చర్య అని ప్రజాభిప్రాయం సేకరించటంలో మనం ఎంతవరకు సఫలీకృతులమయినాము? మనం అనుసరించిన పోరాట పద్ధతి వలన యీ సమస్య యజమానికి, కార్మికుడికి మాత్రమే పరిమితమై సమాజము, ప్రజాభిప్రాయము ప్రేక్షక స్థానంలోకి పోలేదా? క్రొత్తగా మొదలయే సంవత్సరంలో వుద్యోగులపై, సంపాదనపై తీవ్రమైన దాడులుజరుగుతాయి. ఆర్థికవ్యవస్థ చాలా ప్రమాదకర పరిస్థితిలో వున్నది. విదేశీ వాణిజ్యంలో లోటు భర్తీ చేసుకొనటానికి ఎగుమతులు అధికం చేయాలి. అయితే ఐ. ఎం. ఎఫ్. అప్పు షరతుల ప్రకారం దిగుమతులు ఎక్కువ కావటంవలన భారతీయ పరిశ్రమ లనేకం దెబ్బతింటున్నాయి. అందువలన ఖర్చులు తగ్గించే మిషతో ఉద్యోగాలపై దాడి ప్రారంభమవుతుంది. యాంత్రీకరణ, ఆధునికీకరణ, ఆటోమేషన్, మిల్లుల మూసివేత, సామూహిక తొలగింపులతో నేడు కారుమబ్బులు అలముకున్నాయి. ఈ దాడుల నెదుర్కొనడానికి ఎటువంటి పోరాట పద్ధతు లనుసరించాలనేది సి ఐ.టి.యు. మహాసభ ముందున్న ప్రధాన సమస్యలలో ఒకటి. పోరాట రూపాల్లో మార్పేమీ అవసరంలేదని, పెట్టుబడిదారులు తమ ఎత్తుగడలు మార్చినపుడు కార్మికవర్గం తమ ఎత్తుగడలు వాటి కనుగుణంగా రూపొందించవవసరం లేదని ఎవరూ చెప్పరు. లాకౌట్లను ఎదిరించి పోరాడే విషయంలో లెనిన్ చెప్పినది గుర్తుకు తెచ్చుకోవటం సముచితంగా వుంటుంది.

"సమ్మె చేసే కార్మికులకు ప్రతిక్రియగా కొంతమంది పెట్టుబడిదారులు లాకౌట్లు (సామూహిక తొలగింపులు) ప్రకటిస్తారు. అందువలన కార్మికులు క్రొత్త సమస్యల నెదుర్కొనాలి. ప్రతి ప్రాంతంలోను, పరిశ్రమలోను, ప్రతి ఒక్క సందర్భంలోను సమ్మె చేసే కార్మికుల ఆర్థిక పరిస్థితులను పరిగణనలోకి తీసుకుని లాకౌట్లు ప్రతిఘటించటానికి క్రొత్త పోరాట రూపాలు (బైఠాయింపు సమ్మెలాటివి) రూపొందించాలి. రాజకీయ సమ్మెకు బదులు విప్లవాత్మక ప్రదర్శనలు జరపాలి." (457 పే. లెనిన్ రచనల సంకలనం. సంపుటి 18).

ఈ సందర్భంలో లెనిన్, సాంఘిక పరిస్థితులు కల్లోలంగా వున్నప్పుడు ఆర్థికపరమైన సమ్మె, రాజకీయ సమ్మె స్వరూపం ఎలా పొందుతుందో వివరించాడు. ఆర్థికపరమైన సమ్మెకు, రాజకీయసమ్మెకు సంబంధం చాలా స్పష్టంగా కనిపిస్తుంది. ఈ రెంటికీ సన్నిహిత సంబంధం లేకపోతే వాస్తవానికి విస్తృతమైన ప్రజావుద్యమం నిర్మించటం సాధ్యం కాదు. ఈ సంబంధం నిర్దుష్టంగా రెండుచోట్ల కనిపిస్తుంది. ఉద్యమ ప్రారంభంలో సమ్మె కేవలం ఆర్థికపరమే అయినప్పటికీ, క్రొత్త వర్గాలు అందులో చేరటం ప్రారంభమవుతుంది. రాజకీయ సమ్మెగా రూపొందినపుడు వెనుకబడిన వర్గాలు కూడా చైతన్యవంతులై వుద్యమంలో చేరటం వలన వుద్యమస్థాయి, విస్తృతి పెరుగుతుంది."

గత అనుభవాలను దృష్టిలో వుంచుకుని ఈ క్రొత్తదాడిని పటిష్టంగా ఎదిరించటానికి క్రొత్త పోరాట రూపాలను సి. ఐ. టి. యు. సమావేశం నిర్ణయించాలి.

సమ్మెలకు ప్రజల మద్దతు కోరే విషయంలో నిర్లిప్తత విడనాడి, వైఫల్యాలను సరిదిద్దుకోవాలి.

సి.ఐ.టి.యు. యూనియన్లతో సహా చేసే నిర్లక్ష్యం వలన మొత్తం ఉద్యమానికే హాని కలిగే ప్రమాదం ఉంది. క్రితం సారి సి.ఐ.టి.యు. మహాసభ జరిగిననాటినుంచి అవ్యవస్థితమైన పరిశ్రమల్లో పనిచేసే కార్మికుల్లో ఒక విధమైన సంచలనం కలిగింది. వీరికి చట్టపరమైన రక్షణలేమీ లేవు. చాలామంది ఏవిధమైన కరువు భత్యం లేకుండా పని చేస్తున్నారు. కనీస వేతన చట్టాల ప్రకారం తప్పనిసరిగా లభిస్తుందని ఆశించిన కనీస నికృష్ట జీతం కూడా, ఆ చట్టాలు ఎవరూ పాటించక పోవటం వలన వారికి అందుబాటులో లేదు. ఈ వర్గాలవారు నిరాశకు లోనైతే అభివృద్ధి నిరోధకులు వారిని తేలికగా ఉపయోగించుకోగలరు. ఇప్పటికే వీరిని సంఘటిత కార్మికోద్యమానికి వ్యతిరేకంగా ఉపయోగించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ట్రేడ్‌యూనియన్లు, సర్వత్రా వున్న యీ వర్గాన్ని పట్టించుకోకపోతే సమరశీలము, వీరోచితము, బలిష్టమైన ఒక వర్గాన్ని దూరం చేసుకుని ఉద్యమానికి హాని కలిగించిన వారవుతారు.

కారల్‌మార్క్స్ శత వర్ధంతి సంవత్సరంలో ఈ విషయం గుర్తుకు తెచ్చుకోవటం చాలా అవసరం. "ప్రత్యేక పరిస్థితుల్లో బలహీనపడి తక్కువ జీతాలు వచ్చే వృత్తులలో పని చేసే వ్యవసాయ కార్మికులవంటి వారి పట్ల ట్రేడ్‌యూనియన్లు జాగ్రత్త వహించి వారి ప్రయోజనాలు కాపాడాలి. తమ కృషి సంకుచిత, స్వార్థ ప్రయోజనాలకోసం కాక, కోట్లాది బడుగు ప్రజల విముక్తి కోసమని ప్రపంచానికి నచ్చచెప్పాలి."

వ్యవసాయ కార్మికులు, రైతాంగంనుంచి దూరంగావుండటం భారత కార్మికోద్యమంలో ప్రమాదకరమైన బలహీనత. మన దేశ ప్రజలలో అత్యధిక భాగం వ్యవసాయ కార్మికులు, రైతులు, అందువలన పరిస్థితి ఈ ఏకాకితనం ప్రమాదభరితంగా తయారవుతుంది.

సి ఐ.టి.యు. యూనియన్లతోసహా అన్ని ట్రేడ్‌యూనియన్లలో ఈ బలహీనత ఏదో కొంత మోతాదులో వున్నది. ఈ బలహీనత అధిగమించటానికి నిజానికి కొన్ని ప్రయత్నాలు జరిగాయి. కాని యీ జాడ్యాన్ని బూర్జువా నాయకులు తొలిరోజుల్లోనే ట్రేడ్

# ఇతర కష్టజీవుల నుండి దూరం కావడం ప్రమాదం

యూనియన్ చైతన్యంలో ప్రవేశపెట్టారు. కార్మికులకు ప్రత్యక్షంగా సంబంధించిన సమస్యలలో తప్ప మిగతా ప్రతివిషయంలో ట్రేడ్‌యూనియన్లు కార్యక్రమాలు నిర్వహించటాన్ని వారు పూర్తిగా వ్యతిరేకించారు. ప్రతివిషయంలోను బూర్జువా నాయకత్వం సమ్మతి లేనిదే వారు ముందుకు పోరాదు.

ఉద్యమాన్ని సాధారణ ప్రజల నుండి దూరంగావుంచే దృక్పథం ట్రేడ్‌యూనియన్ వుద్యమంలో చాలా భాగాన్ని ఇంకా ఆవరించి వున్నది. ఉద్యమంలో నెలకొన్న ఈ రుగ్మతను తొలగించేముందు సి. ఐ. టి. యు. మహాసభ తన ఇల్లు చక్కబెట్టుకోవలసి వున్నది.

మహిళా కార్మికులు, వారి సమస్యల పట్ల పూర్తి నిర్లక్ష్యం వహించటం మన కార్మికోద్యమంలో మరోవైఫల్యం వేలాది మంది మహిళా కార్మికులు పనులలోంచి తొలగించబడినపుడు సి ఐ టి.యు యూనియన్ల నుంచి గాని, తదితర యూనియన్ల నుంచిగాని కనీసం నిరసన తెలియచేసే అలజడి లేకపోవటం చాలా సిగ్గుచెందనలసిన విషయం. ట్రేడ్‌యూనియన్ వుద్యమం కేవలం మగవారి సొత్తుకాదు స్త్రీ కార్మికుల పట్ల నిర్లక్ష్యం గురించి గాని, వారికి వుద్యమంలో చురుకైన పాత్ర కల్పించటంలో వైఫల్యం గురించిగాని చెప్పటానికి అనేక మోసవు సాకులుంటాయి అవి ఫ్యూడల్ మన సత్వంతో కూడినవి. ప్రపంచంలో మిగతాచోట్ల ట్రేడ్‌యూనియన్లు ఈ పొరపాటును దిద్దుకొంటున్నాయి.

కాని భారత ట్రేడ్‌యూనియన్లు ఈ విషయంలో వెనుకబడినాము. భారతదేశంలో సంఘటిత కార్మికోద్యమం నిర్లక్ష్యం చేసిన మహిళా కార్మికులలో అభివృద్ధి నిరోధక శక్తులు ప్రవేశించి చురుకుగా పని చేస్తున్నాయి కాని ఈ సమస్యపై కొన్ని ఉద్యోగుల సంఘాలు శ్రద్ధ చూపించటం ప్రారంభించాయి. ఇది చాలా మంచిది. గత మహాసభలో సి. ఐ. టి. యు. శ్రామిక మహిళా ఉద్యమం ప్రారంభించింది. మన యూనియన్లు ఈ విషయంలో ఎంతో పురోగమించాయో తెలుసుకోవడానికి సమగ్రమైన సమీక్ష అవసరం.

కార్మికులలో సంఘీభావం బద్దలు చేయటానికి యజమానులు, ప్రభుత్వం క్రొత్త పన్నాగాలు వేస్తున్నారు. క్రొత్తగా ఉద్యోగంలో చేరిన యువకులను సంవత్సరాల తరబడి తాత్కాలిక ఉద్యోగులుగా పరిగణించి పక్షపాతంతో వ్యవహరిస్తున్నారు. ఈ వర్గం యొక్క ప్రత్యేక సమస్యలను నిర్లక్ష్యంచేసి ఎక్కువ కాలం ఉద్యోగంలో వున్నవారికి లాభం చేకూర్చే సాధారణ సమస్యలపై ఎక్కువ దృష్టిని కేంద్రీకరించే ధోరణి వున్నది. అందువలన సమరశీలురయిన యువకులు తరచూ నిస్పృహకులోనై, ఐక్య ఉద్యమంలో విశ్వాసం కోల్పోయి వ్యక్తిగత అరాచకదృక్పథానికి బలైపోతారు. ఈ పరిస్థితి సంక్షోభం వలన, ప్రభుత్వ విధానాల వలన ఏర్పడుతోంది యూనియన్‌లలో త్వరగా ఎదిగిపోయే చవకబారు నాయకత్వం చెప్పే సిద్ధాంతాలుకూడా యిందుకు కారణం. సి. ఐ. టి. యు. ఈ పరిణామం దృష్టిలో వుంచుకొని తమ యూనియన్లను క్రొత్తగా చేరే యువకులపట్ల ప్రత్యేక శ్రద్ధ వహించాలని కోరుతోంది.

ట్రేడ్‌యూనియన్ వుద్యమ ఐక్యత కోసం సి. ఐ టి. యు. నిరంతరం కృషి చేసింది. జాతీయ ప్రచార కమిటీ ఏర్పాటు కావటంతో దాని కృషి కొంత ఫలించింది. కమిటీ కార్యకలాపాలు, జనవరి 19 సమ్మె, మూడు రోజులపాటు జరిగిన బొగ్గుగని కార్మికుల సమ్మె ఐక్యతను పెంపొందించటానికి దోహదమైనాయి. ప్రభుత్వ విధానాలను ప్రభావితం చేయటంలోను, దాడులను ప్రతిఘటించటంలోను, కార్యకలాపాలలో పాల్గొనే కార్మికుల చైతన్య స్థాయి పెంపొందించటంలోను ఐక్యకార్యాచరణ ఎంతవరకు దోహదపడిందో తెలుసుకొనటానికి సమగ్ర పరిశీలన అవసరం.

ప్రస్తుతానికి జాతీయ ప్రచారకమిటీ పరిధి చాలా పరిమితం. అందువలన జాతీయప్రచార కమిటీ నిర్మాణం దృష్ట్యా ఐక్యత మరింత పెంపొందించే భారం ఆ కమిటీపై వేయలేము. జాతీయ ప్రచారకమిటీ కార్యక్రమాలను పాటించే వుద్యోగ సంఘాలను, ఫెడరేషన్లను ఈ కర్తవ్యంలో నిమగ్నం చేయాలి. సర్వసాధారణ సమస్యలపై చర్చలకు, సమాలోచనలకు అవకాశం కల్పించేందుకు ట్రేడ్‌యూనియన్ల సమాఖ్యను ఏర్పాటుచేయాలని గత సి. ఐ టి యు. మహాసభలో పిలుపిచ్చాం. జరుగబోయే సి ఐ. టి. యు. మహాసభలో జాతీయ ప్రచార కమిటీ విస్తృతి, సమాఖ్య ఏర్పాటు గురించి చర్చించాలి.

ఆర్థిక సంక్షోభం, నిరుద్యోగం నివారించటానికి, ప్రజాశ్రేయస్సుకై పరిశ్రమలు సమర్థవంతంగా నడపటానికి విధానాలు సూచించే సమష్టి ఆర్థిక ప్రణాళికను రూపొందించితే ప్రజలలో విశ్వాసం కలిగించి ఉద్యమం పటిష్ఠం చేయటానికి సహాయపడుతుంది.

ట్రేడ్‌యూనియన్ ఐక్యత, సంయుక్త కార్యాచరణ విషయంలో సి. ఐ. టి. యు. అనుభవం పరిశీలిస్తే, సి.ఐ టి.యు స్వతంత్రంగా కార్యకలాపాలు కొనసాగిస్తూ,చొరవ తీసుకోకపోతే విజయం సాధించటం కష్టమని తేలింది. ఈ అంశానికి ప్రాముఖ్యతనిచ్చి మహాసభ పరిశీలించాలి.

ఇది చాలా అవసరం. ఎందుకంటే ఐక్య పోరాటాల్లో మిగతావారు వివిధ రాజకీయ పార్టీల సిద్ధాంతాల పరిమితులకు లోబడి వుంటారు. యుద్ధ వ్యతిరేక ఆందోళనలో పీటిని మనం గమనించాం. అందువల్లనే సి.ఐ.టి.యు. స్వతంత్ర కార్యక్రమాలను పెంపొందించుకోకపోతే ట్రేడ్‌యూనియన్ ఉద్యమం ప్రజలకు సంబంధించిన సమస్యలలో జోక్యం చేసుకుని పోరాడటం సాధ్యం కాదు. అధిక ధరల బారినుంచి ప్రజలకు రక్షణ కల్పించటానికి, నియంతృత్వ ప్రమాదాన్ని వ్యతిరేకించి ప్రజాస్వామ్యం కాపాడటానికి స్వతంత్ర కార్యాచరణ పెంపొందించాలి. ప్రజాస్వామ్యం, సోషలిజం కోసం చేసే పోరాటంలో ట్రేడ్‌యూనియన్ అగ్రగామి శక్తిగా రూపొందటానికి ఈ కర్తవ్యాలను నెరవేర్చటానికి బాగా పూనుకోవాలి.

(మిగతా 16వ పేజీలో)

# ట్రేడ్ యూనియన్లు రాజకీయంగా చైతన్యవంతం కావాలి

## సామాజిక మార్పులకు నాయకత్వం వహించేలా నిర్మాణయుతంగా సంఘటితం పడాలి



### శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య

సి.ఐ.టి.యు. ఆంధ్రప్రదేశ్ 4 వ మహాసభ, అఖిలభారత 5 వ మహాసభ ఈ నెలలో జరుగుతున్నాయి.

ఈ సందర్భంగా మనం "సి.ఐ.టి.యు ఆశయాలకు అనుగుణ్యంగా ఎంతవరకు పని చేశాము? ఎలా పనిచేస్తే మన ఆశయానికి త్వరగా చేరుకోగలము?" అని ప్రశ్నించుకోవాలి.

సి.ఐ.టి.యు. ఇతర కార్మిక సంఘాల కన్న భిన్నమైనది. కార్మికులకు ఆర్థిక పోరాటాలు మాత్రమే చాలు అనే సంఘాలు వున్నాయి. వర్గ పోరాటాన్ని నిరాకరించే సంఘాలు వున్నాయి. సిద్ధాంత రీత్యా వర్గ పోరాటాన్ని, కార్మిక వర్గ ఆధిపత్యాన్ని అంగీకరించినా, ఆచరణలో వర్గ సామరస్యాన్ని అనుసరించే సంఘాలు గూడా వున్నాయి.

అలాంటి వర్గ సామరస్య విధానాలను, ప్రజాతంత్ర విరుద్ధ కార్యకలాపాలను ఎదుర్కొని భారత ప్రజాతంత్ర విప్లవంలో భారత కార్మికవర్గం సముచితమైన పాత్ర వహించేలా కార్మికవ్యవస్థను సాధించడానికి కార్మికవర్గ రాజకీయ లక్ష్యాన్ని సాధించడానికి కార్మికవర్గానికి తరిఫీదు యిచ్చేందుకే మనం సి. ఐ. టి. యు. ను ఏర్పర్చుకున్నాము.

అందుకే సి. ఐ. టి. యు. తన నిబంధనావళిలో 'ఆశయాలు-లక్ష్యాలు' అనే అంశాలలో మొదటి అంశాన్ని ఈ క్రింది విధంగా పేర్కొన్నది.

"ఉత్పత్తి సాధనాలను- పంపిణీ, మార్పిడులను సామాజిక మొనర్చడం ద్వారానే, సోషలిస్టు సమాజాన్ని ఏర్పర్చడం ద్వారానే కార్మికవర్గంపై సాగే దోపిడీని అంతం చేయడం సాధ్యమని సి. ఐ. టి. యు. విశ్వసిస్తుంది."

కాబట్టి కార్మికవర్గం తన తక్షణ ఆర్థిక, తదితర హక్కుల కోసం పోరాడుతూనే, దోపిడీ విధానాన్ని తుదముట్టించేందుకు సహితం పోరాడాలి. ఈ తుది పోరాటం అహర్నిశలు తన దృష్టిలో వుంచుకోవాలి.

ఈ ఆశయానికి అంకితం కావడమంటే ఏమిటి?

కేవలం తన ఆర్థిక కోర్కెలకు, పని పరిస్థితులను మెరుగుపర్చుకునేందుకు మాత్రమే కాక సమాజంలో దోపిడీని అంతం చేసే రాజకీయ పోరాటానికి కార్మికవర్గం పోరాడాలి. ఎందుకంటే తమ తక్షణ అర్థికసమస్యలకు కొన్నిటిని తాము సాధించుకున్న వానిని పదిలపరచుకోవాలన్నా రాజకీయాధికారాన్ని పెట్టుబడిదారుల చేతులనుండి తాము స్వాధీనం చేసుకోవాలి. లేకపోతే సాధించిన కోర్కెలు కూడా నిలబెట్టుకోలేము. మౌలిక కోర్కెలను అసలు నిలబెట్టుకోలేము. ఈ పెట్టుబడిదారీ సమాజంలో ఆ రాజకీయ పోరాటానికి త్వరితగతిని చేరుకునే విధంగా తక్షణ సమస్యలను చేపట్టాలి.

ఉత్పత్తిరంగంతో కీలక పాత్ర వహిస్తున్న కార్మిక వర్గం సామాజిక మార్పులకై సాగే పోరాటానికి నాయకత్వం వహించాల్సి వుంటుందని శాస్త్రీయ సోషలిజాన్ని అంగీకరించేవారంతా ఒప్పుకుంటారు.

# కార్మికవర్గ నిర్మాణం ప్రత్యేక బాధ్యత

అందువల్ల కార్మికవర్గాన్ని సంఘటిత పరచడం ఇతర వర్గాలను సంఘటిత పరచే రీతిగా కాక, సమాజంలో విప్లవానికి నాయకత్వం వహించే వర్గాన్ని సంఘటిత పరచడంగా మనం గమనించాలి. అందుకు గల ప్రాధాన్యతను దృష్టిలో వుంచుకోవాలి.

ఈ దృష్ట్యా కార్మికోద్యమ నిర్మాణాన్ని మనం పరిశీలించాలి.

కార్మికులు గాని, మరే కష్టజీవులు గాని ఐక్యమై సంఘటనా శక్తితో తమపై సాగే సాంఘిక దాడులను ఎదుర్కోవాలనీ, ఆర్థిక దోపిడిని అరికట్టుకోవాలని, తమ రాజకీయ హక్కులను కాపాడుకోవాలని నేర్పింది ఆంధ్రదేశంలో కమ్యూనిస్టులే.

1930లలో జరిగిన స్వాతంత్ర్యోద్యమంలో గాంధీజీ అనుసరించిన విధానాలతో విసుగు చెందిన యువకులు సోషలిజం,కమ్యూనిజంల వైపు ఆకర్షితులైనారు. అలాంటి యువకులే కష్టజీవులను సంఘటితపరచడం ప్రారంభించారు. స్వాతంత్ర్యోద్యమానికి వారసులుగా ప్రారంభించి, అంతకుమించిన ఆశయానికి ఆకర్షితులైనవారు వీరు

ఆంధ్రదేశం ఆనాటికి పారిశ్రామికరాష్ట్రం కాదు. అందువల్ల స్వాతంత్ర్యోద్యమంలోగాని, దాని కొనసాగింపుగా తలెత్తిన కమ్యూనిస్టు వుద్యమంలోగాని గ్రామీణప్రాంతాలే ప్రధాన పాత్ర వహించాయి గ్రామీణపూర్వరంగంలో ఆవిర్భవించిన కార్యకర్తలే పట్టణ కష్టజీవులను సమీకరించారు కూలి రక్షణ సంఘాలు ఏర్పరిచారు. ఆనాటికి నికృష్ట జీవితం గడుపుతున్న మునిసిపల్, పొగాకు రంగాలలో పని చేసే కార్మికులను సంఘటితపరిచారు. రాష్ట్రంలో ఆనాటికి పెద్ద పరిశ్రమ అయిన రైల్వే కార్మికులలో పనిచేశారు.

స్వాతంత్ర్యోద్యమం కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలలో ఉవ్వెత్తున సాగింది. ఈ ప్రాంతంలోనే ఆ కవలికలోముందుకు వచ్చిన ప్రజానీకంలో ఉద్యమంకూడ ముందుగా తలెత్తింది. అదేరీతిగా బలీయంగా అభివృద్ధి చెందింది.

అయినా ఆనాటికే సిద్ధాంతపరంగా కార్మిక వర్గంయొక్క అగ్రగామి పాత్రను అవగాహన చేసుకున్నందువల్లనే, స్వాతంత్ర్యోద్యమంలో పై ప్రాంతాలంత పాత్రలేకున్నా కార్మికవర్గం కేంద్రీకరింపబడివున్న దృష్టితో విశాఖకు ఆనాడే మేము ప్రాధాన్యతను యిచ్చాము.

తెలంగాణా రైతాంగపోరాటంతో ఆంధ్ర మహాసభ కమ్యూనిస్టు పార్టీ ముందు నిలబడి పోరాడడంవల్ల అచ్చటకూడా ఆ తర్వాత ప్రాధాన్యత వచ్చింది. కాని ఆనాడు కొత్తగూడెం బొగ్గు కార్మికులను మినహాయిస్తే, హైదరాబాదు, వరంగల్‌లాంటి పట్నాలలో పోలీసు, మిలిటరీ కాంపులవల్ల కార్మిక ఉద్యమము బలహీనంగానే వుండిపోయింది.

ఈనాటి పరిస్థితి అదికాదు. మరికొన్ని రాష్ట్రాలతో పోల్చినప్పుడు పారిశ్రామికంగా మన రాష్ట్రం వెనుకబడేవున్నా, స్వాతంత్ర్యం వచ్చిన నాటితో పోలిస్తే పరిశ్రమలు పెరిగాయి.

ఆధునిక పరిశ్రమలు ఏర్పడ్డాయి విద్యుచ్ఛక్తి వ్యాపించింది. రైల్వే, రోడ్ రవాణా (ప్రయాణీకుల రవాణా, సరుకుల రవాణా సహితం) విస్తరించాయి.

అయితే, ఈ విస్తరణ కొన్ని ప్రాంతాలలోనే కేంద్రీకరింపబడుతున్న విషయాన్ని గూడ మనం పరిగణించాలి.

ఉదాహరణకు అనేక ఆధునిక పరిశ్రమలు హైదరాబాద్ చుట్టూతానే తలెత్తుతున్నాయి. 20 వేల మంది రైల్వేకార్మికులు అక్కడ కేంద్రీకరింపబడి వున్నారు.

అంతేకాకుండా అది రాష్ట్ర రాజధాని గూడా కావడంతో కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వాల, బ్యాంకు, ఎల్.ఇ.సి. వంటి సర్వీసు సంస్థలలో పనిచేసే మధ్యతరగతి వుద్యోగుల సంఖ్య గణనీయంగా వుంది. యూనివర్సిటీలు,అనేక విద్యాసంస్థలు వుండడం వల్ల విద్యార్థి ఉపాధ్యాయ కేంద్రంగా గూడా అది వున్నది.

అలాగే ఆధునిక పరిశ్రమలు, పోర్టువంటి కీలకమైన రంగం, పెద్ద రైల్వే కూడలి, యూనివర్సిటీ, విద్యాసంస్థలు కలిగిన విశాఖ రాష్ట్ర కార్మికోద్యమంలో హైదరాబాద్ తర్వాత ప్రాధాన్యత కలిగివుంది.

రైల్వే కేంద్రంగా కొన్ని ఆధునిక పరిశ్రమలు, విస్తృతంగా అనార్గనైజ్‌డ్ కార్మికులు కలిగిన విజయవాడ – గుంటూరు ప్రాంతం మరొక ప్రధానకేంద్రం అంతేగాక స్వాతంత్ర్యోద్యమ కాలం నుండి రాజకీయంగా సంతరించుకున్న ప్రాధాన్యత, వామపక్ష వుద్యమానికి గల పునాది దృష్ట్యా గూడ ఈ ప్రాంతం ముఖ్యమైనది.

కొత్త పరిశ్రమలు తలెత్తుతూ, ముఖ్యమైన బొగ్గు వుత్పత్తికి కేంద్రంగా వున్న కొత్తగూడెం – రామగుండం – బెల్లంపల్లి ప్రాంతం మరొక ముఖ్యమైన ప్రాంతం.

రాయలసీమ ప్రాంతంలో కర్నూలు, తిరుపతి ప్రాంతాలు క్రమేపీ అభివృద్ధి పొందుతున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో కార్మికోద్యమాన్ని, సి. ఐ. టి. యు. ఆశయాని కనుగుణ్యమైన కార్మికోద్యమాన్ని నిర్మించాలంటే త్వరిత గతిన నిర్మాణం సాధించేందుకు, రాష్ట్ర ప్రజాతంత్ర ఉద్యమంపై తన ప్రభావాన్ని చూపగల చైతన్యాన్ని పెంపొందించేందుకు పెరుగుతున్న ఈ పరిశ్రమలను ఆ పరిశ్రమలు పెరుగుతున్న కేంద్రాలను దృష్టిలో వుంచుకొని మనం కార్య విధానాన్ని రూపొందించుకోవలసివుంటుంది.

అది ఆచరణలోనికి రావాలంటే గ్రామీణ పూర్వరంగం నుండి వచ్చిన కార్యకర్తలు, తమ ఇదివరకటి ఆలోచనలను, ఆచరణను మార్చుకోవలసి వుంటుంది.

ఇతర వర్గాలకన్నా కార్మికవర్గం భిన్నమైనదేగాక, అత్యంత ప్రాధాన్యతగల వర్గమని, దాని చైతన్యం, పోరాట పటిమ, నాయకత్వం వహించగల శక్తి పెంపుదల పైన ప్రజాతంత్ర ఉద్యమ పురోగతి, విజయం ఆధారపడివుంటుందనే విషయం వారి ఆలోచన కార్యాచరణలలో స్పష్టమవ్వాలి. అదో అలవాటుగా మారిపోవాలి.

ఈనాడు మన రాష్ట్ర ట్రేడ్‌యూనియన్ వుద్యమ పురోగమనానికి ఇది కీలకమైన అంశం.

అందువల్ల కార్మికులు కేంద్రీకరింపబడి వున్న ప్రాంతాలలో కార్మికులు అత్యధికంగా ఉండి, ప్రజాతంత్ర ఉద్యమంలో కీలకమైన పాత్ర వహించగల పరిశ్రమలపైన మన కున్న వనరులను శక్తివంతమైన కేడరును కేటాయించి కేంద్రీకరించాలి.

ఆ విధంగా మన రాష్ట్ర ట్రేడ్ యూనియన్ ఉద్యమం దీర్ఘకాలిక ప్రయోజనాల దృష్ట్యా రాష్ట్ర వ్యాపితంగా తన ప్రభావాన్ని నెరవగలిగే విధంగా అభివృద్ధిఅయితే త్వరిత గతిని ఫలితాలు పొందగలుగుతాము.

అయితే ఇప్పటికే ఈ ప్రాంతాలు, ఈ

# కార్మికులు కీలకవర్గమని మరవద్దు

రంగాలు కాకుండా మిగతా రంగాలలో మనం చేస్తున్న కృషిని వదలివేయరాదు. సబ్బణాలలో చెల్లాచెదరుగా వున్న కష్ట జీవులను సమీకరించాల్సిందే. వారిలో రాజకీయ స్థాయిని పెంచవలసిందే. అలాంటి సంబంధాలను నిలబెట్టుకొని, మరింత విస్తృతం చేసుకొని సంఘటిత పరచవలసిందే.

కాని ప్రాధాన్యత యివ్వవలసిన పరిస్థితి ఏర్పడినప్పుడు పైన వివరించిన విధంగా కార్మికవర్గం కేంద్రీకృతమైవున్న ప్రాంతాలకు అలా కేంద్రీకరణ లేనిచోట సహితం పెద్ద పరిశ్రమలకు ప్రాధాన్యత యివ్వాలి.

మనలో కనిపించే మరొక పొరపాటుఏమిటంటే ట్రేడ్‌యూనియన్లు ఏర్పరచిన తరువాత వాటిని కేవలం కార్మికులను సంఘటిత పరచే సంస్థలుగానే ఆలోచించడం, వారి కోర్కెలకు, అవసరాలకు మాత్రమే పోరాడే వారుగా పరిగణించడం—ఇది చాలదు.

ట్రేడ్‌యూనియన్లను రాజకీయంగా చైతన్యవంతం చేయడం, దాని సభ్యులను సామాజికమార్పుకు నాయకత్వం వహించేలా నడిపించడం ముఖ్యం.

కార్మికవర్గానికి సామాజిక మార్పుల సాధనలో నాయకత్వ పాత్ర ఎలా వస్తుంది?

తన హక్కులకోసం పోరాడుకునే సందర్భంలో కార్మికులు ఏకమై సంఘటితపడతారు తమ హక్కులు సాధించుకోడం ద్వారా సంఘటితశక్తి ప్రయోజనాన్ని గ్రహిస్తారు.

ఆ గ్రహింపును ఇతర ప్రజలకు అందించడం ద్వారా కార్మికవర్గం ఇతర కష్టజీవి వర్గాలకు, ప్రజలకు కొత్తమార్గాన్ని చూపుతుంది

తన ఫ్యాక్టరీలు, తాము నివసించే ప్రాంతాల చుట్టూ, వానికి సమీపంలో వ్యవసాయ కార్మికులను, రైతులను సంఘటిత పరచి వారి హక్కులకై వారిని పోరాడేలా సమాయత్తం చేయడం, అలాంటి పోరాటాల సందర్భంలో తమ సంఘటిత శక్తిని వారికి అండగా నిలపడం అవసరం. ఆ విధంగా కార్మికవర్గం ఇతర వర్గాలపట్ల తన కర్తవ్యాన్ని నిర్వహించగలుగుతుంది. అంతేగాక తన పోరాటాల సందర్భంలో ఈ వర్గాల సహాయాన్ని, సానుభూతిని పొందగలుగుతుంది.

ఇందుకు ప్రాథమిక చర్యగా తాను నివసించే ప్రాంతంలో ప్రజలతో సన్నిహిత సంబంధాలు పెంచుకోవాలి. అక్కడ తలెత్తే ప్రతి చిన్న, పెద్ద విషయాలలో తాను పాత్ర వహించాలి. ఉదాహరణకు రేషన్ కార్డులు యిప్పించడం, రేషన్ షాపులు సక్రమంగా నిర్వహించబడేలా ప్రజల అజమాయిషీని ఏర్పరచడం. కో-ఆపరేటివ్ సొసైటీల వంటివి ఏర్పరచి వాటిని సక్రమంగాను, నిజాయితీగాను నిర్వహించడం, నిర్వహించేలా యితరులను ప్రోత్సహించడం, మున్సిపాలిటీలద్వారా జరగవలసిన పనులను సక్రమంగా అందరికీ అందుబాటు అయ్యేలా చూడడం- అవన్నీ చాల చిన్న పనులుగా కనిపించవచ్చు. కాని ప్రజలతో నిత్య సంబంధాలను ఏర్పరచుకునేందుకు వారికి తలలో నాలుకలా, నిస్వార్థ ప్రజాసేవకుడిగా గుర్తింపబడటానికి యివి అత్యవసర విషయాలు.

అలా ప్రజలతో ఏర్పడే నిత్య సంబంధాలద్వారా బస్తీలోగల యువకులను యువజన సంఘాలలోను, విద్యార్థులను విద్యార్థి సంఘాలలోను, స్త్రీలను మహిళా సంఘాలలోను సమీకరించాలి. ఆవిధంగా తాను పనిచేసేచోట సంఘటితపడి తన హక్కులకై పోరాటడమే గాక, తను నివసిస్తున్న ప్రాంత ప్రజలను సహితం సంఘటిత పరచే బాధ్యతను కార్మిక వర్గం తీసుకోవాలి.

అప్పుడే కార్మికవర్గం తనకోసంమాత్రమే తాను పోరాడే-ప్రజలనుండి వేరుపడినవర్గంగా గాక, ప్రజలకు నాయకత్వం వహించే వర్గంగా తయారౌతుంది.

సి.ఐ.టి.యు. యూనియన్‌లో చేరే ప్రతి సభ్యుడిలోనూ ఇలాంటి చైతన్యం తేవడం లక్ష్యంగా మనం పనిచేయాలి. అయితే తక్షణమే అలాంటి బాధ్యతలు నిర్వహించే అవకాశమున్న చురుకైన, వుత్సాహవంతులైన, పట్టుదల గల, తమ చైతన్యాన్ని పెంచుకోవాలనే ఆసక్తి గల, నిస్వార్థపరులు అయిన కార్యకర్తలను ఎన్నుకోవాలి. వారి శక్తి యుక్తులను సరియైన పద్ధతిలో వినియోగించుకునే కార్యక్రమం రూపొందించాలి. వారికి పని అప్పజెప్పాలి. దానిని తనిఖీ చేయాలి. పొరపాట్లను సానుభూతితో పరిశీలించి, వాటిని అధిగమించేందుకు వారికి తోడ్పడాలి.

ఇలా ఒక్కొక్క యూనియన్ ఎంతమంది క్రియాశీలురైన కార్యకర్తలను తీర్చిదిద్దింది, ఎంతమంది కార్మికులతో నిత్య సంబంధాలు కలిగివుండేలా వారిని ప్రోత్సహించింది, తాము నివసించే ప్రాంతాల ప్రజలతో ఎంతో లోతైన సంబంధాలు పెంచుకునేందుకు వారిని తయారుచేసింది- అనే విషయాల ఆధారంగానే ఒకానొక ట్రేడ్ యూనియన్ విజయం, దాని నాయకుల సామర్థ్యం మనం అంచనా వేయాల్సి వుంటుంది.

ఇలా శక్తివంతమైన ట్రేడ్ యూనియన్లను పుంఖానుపుంఖంగా మిలిటెంటు కార్యకర్తలను సృష్టించే కృషికి అంకితం కావడం ద్వారానే సి ఐ టి.యు ఆశయాలలో మొదటి దానిని ముందుకు తీసుకుపోయిన వారమవుతాము.

ఈ మహాసభల సందర్భంగా అలాంటి శక్తిని పుంజుకునేందుకు ప్రతి యూనియన్ నిర్దిష్టమైనలక్ష్యాలనునిర్ణయించుకొనిముందుకు సాగాలని కోరుతున్నాను.

★

## వినిమయధరల సూచి

(1960 లో 100 పాయింట్ల పునాదిపై)

| | 1982 | | 1983 |
|---|---|---|---|
| | నవంబరు | డిశెంబరు | జనవరి |
| ఆలిండియా | 496 | 497 | 495 |
| | | ఫిబ్రవరి | 500 |
| ఆంధ్రప్రదేశ్ | | | |
| గూడూరు | 467 | 476 | 470 |
| గుంటూరు | 527 | 537 | 533 |
| హైదరాబాద్ | 496 | 493 | 492 |
| కొత్తగూడెం | 334 | 331 | |

(1966 లో 100 పాయింట్లపై)

# మహిళల ఉపాధిపై దాడి: విమలారణదివె విమర్శ

35 సంవత్సరాల స్వాతంత్ర్యానంతరం కూడా దేశంలో మహిళల పరిస్థితి దారుణంగానే ఉన్నదని, ఉపాధి లభ్యం కావటమే ఎంతో కష్టంకాగా ప్రస్తుత ప్రభుత్వ విధానాలవల్ల మహిళల ఉపాధిపై పెద్దఎత్తున దాడి జరుగుతోందని అఖిలభారత శ్రామిక మహిళా సమన్వయ కమిటీ నాయకురాలు శ్రీమతి విమలా రణదివె పేర్కొన్నారు.

అఖిల భారత శ్రామిక మహిళా సమన్వయ కమిటీ ఆంధ్రప్రదేశ్ ద్వితీయ సదస్సును ఆమె ఏప్రిల్ 2 న ప్రారంభించారు. శ్రీమతి పుణ్యవతి సదస్సుకు అధ్యక్షత వహించారు.

మహిళల పరిస్థితి నానాటికీ దిగజారుతున్నదృష్ట్యా ఐక్యంగా ఉద్యమాన్ని నిర్మించాల్సిన ఆవశ్యకత నేడెంతైనా వుందని ఆమె ఉద్ఘాటించారు. 1979లో మద్రాసులో సి. ఐ. టి. యు నిర్వహించిన అఖిలభారత శ్రామిక మహిళా సదస్సు ఆతర్వాత ఢిల్లీలో జరిగిన సదస్సు తర్వాత కార్యక్రమాలను శ్రీమతి విమల రణదివె వివరించారు.

పలు రాష్ట్రాల్లో కమిటీలు ఏర్పడ్డాయనీ కేరళ, తమిళనాడు రాష్ట్రాల్లో చురుగ్గా కదలి పనిచేస్తున్నాయని ఆమె చెప్పారు. ఆందోళనల ద్వారా కొన్ని రాయితీలను కూడా రాబట్టగలిగామని వివరించారు.

అయితే ఉద్యమాన్ని ఇంకా పటిష్టవంతం చేయాల్సి వున్నదని పేర్కొంటూ ఐక్య కార్యాచరణ ఆవశ్యకతను వివరించారు.

రాష్ట్ర కమిటీ కన్వీనర్ డాక్టర్ శ్రీమతి హేమలత నివేదిక ప్రవేశపెట్టారు. రాష్ట్రంలో సమన్వయ కమిటీ నిర్వహించిన వివిధ కార్యక్రమాలను పేర్కొన్నారు. కమిటీ నిర్వహణలో లోపాలను ఉదహరించారు. పటిష్టవంతంగా నిర్వహిస్తే ఉద్యమం పెరుగుదలకుగల స్పష్టమైన అవకాశాలను పేర్కొన్నారు. విశాఖజిల్లా కమిటీ నిర్వహించిన కార్యక్రమం మరో పత్రరూపంలో ప్రవేశపెట్టారు.

నివేదికపై జరిగిన చర్చల్లో శ్రీమతులు డి. కమలమ్మ (శ్రీకాకుళంజిల్లా), పద్మజ (విశాఖ), సూర్యవాణి, శారద (విశాఖ జిల్లా కన్వీనర్), సుజాత (హైదరాబాద్), సావిత్రమ్మ (పశ్చిమ గోదావరిజిల్లా), పద్మిని (హైదరాబాద్) పాల్గొంటూ కార్యక్రమాల్లో తమ అనుభవాలను, ఉద్యమ అభివృద్ధికి తమ సూచనలను వివరించారు.

శ్రీమతి పుణ్యవతి కన్వీనర్‌గా ఎనిమిది మందితో నూతన కమిటీ ఏర్పడింది.

సి ఐ టి యు. రాష్ట్రకమిటీ అధ్యక్షుడు శ్రీ వర్మా సత్యనారాయణ మాట్లాడుతూ మహిళా ఉద్యమానికి రాష్ట్రకమిటీ మరింత తోడ్పాటు ఇవ్వగలదని చెప్పారు.



# శ్రామిక మహిళాలోకానికి పిలుపు

శ్రామిక మహిళల ఉద్యోగావకాశాల కోతకు, సదుపాయాల తగ్గింపుకు వ్యతిరేకముగా హక్కులను సాధించడం కోసమూ సమైక్యంగా కదలిరావలసిందిగా కొత్తగూడెంలో జరిగిన ఆంధ్రప్రదేశ్ శ్రామిక మహిళా సదస్సు పిలుపునిచ్చింది-ఆ పిలుపు ఇలా వుంది;

"నేటి సమాజంలో శ్రామిక మహిళల ఉద్యోగావకాశాలునానాటికీక్షీణిస్తూవున్నాయి. సంక్షేమ చట్టాలను అమలు పరచవలసివస్తుందని ఇతర సౌకర్యాలు కల్పించవలసివస్తుందని స్త్రీలకు ఉద్యోగావకాశాలను నిరాకరిస్తున్నారు. యంత్రాలను ప్రవేశపెట్టి వేలకొలది మహిళలను ఉద్యోగాల నుండి తొలగిస్తున్నారు. లే ఆఫ్ లకు రిట్రెంచ్‌మెంటులకు మొదట బలయ్యేది శ్రామిక మహిళలే.

సమాన వేతన చట్టం అమలులో వున్నప్పటికీ, అనేక రకాలుగా సమాన వేతనాల నిరాకరించుట నిరాఘాటంగా సాగిపోతోంది. ప్రసూతి సౌకర్యపు చట్టం చాలా మంది శ్రామిక మహిళలకు కాగితంమీదే కనబడుతుంది. చాలా కొద్ది సంస్థలలోనే శిశుపోషణ సౌకర్యం అమలు పరచబడుతోంది. శిక్షణా అవకాశాలలో; ప్రమోషన్‌లలో స్త్రీలపట్ల వివక్ష చూపబడుతోంది.

తమ పనిచేసేచోట శ్రామిక మహిళలకు భద్రతలేదు. హరిజన, గిరిజన స్త్రీలపైఅత్యాచారాలు నానాటికీ పెరుగుతున్నాయి. నైట్ డ్యూటీలున్న మహిళలకు తమ పని ప్రదేశానికి వెళ్ళివచ్చే త్రోవలో భద్రతలేదు.

వ్యవసాయ కార్మిక స్త్రీలు, క్వారీలలో భవన నిర్మాణ పరిశ్రమలో పనిచేసే లక్షలాదిగా అసంఘటితమైవున్న శ్రామిక మహిళలకు కనీసం చట్టపరమైన రక్షణకూడా లేదు. వారికి 8 గంటల పనిదినం లేదు. సమాన వేతనాలులేవు. కనీసవేతనాలులేవు. ఉద్యోగ భద్రత లేదు. అసలు వారి మాన ప్రాణాలకే రక్షణలేదు.

కాబట్టి శ్రామి కమహిళలారా కదలండి! మన పరిస్థితులను మెరుగుపరచుకొనేందుకు, మన హక్కుల సాధనకు కృషి చేద్దాం.

—పనిచేసే హక్కును రాజ్యాంగంలో ప్రాథమిక హక్కుగా పొందుపరచాలి.

—యంత్రములను ప్రవేశపెట్టుటద్వారా శ్రామిక మహిళలను పనినుండి తొలగించటం ఆపు చేయాలి.

—శ్రామిక మహిళలకు వారు పనిచేయు చోట ఉయ్యాల కేంద్రాలను ఏర్పరచాలి. వ్యవసాయకార్మిక స్త్రీలకు పని తరుణంలో సంచార ఉయ్యాల కేంద్రాలను ఏర్పరచాలి.

—పనిచేసేచోట మరుగుదొడ్డు, విశ్రాంతి గదులు కట్టించాలి.

—అసంఘటిత శ్రామిక మహిళలకు కనీస వేతనం, 8 గంటల పని, ప్రసూతి వైద్య సౌకర్యాలు, ఆ సమయంలో జీతంతో సెలవు, రిటైర్‌మెంటు బెనిఫిట్స్ కల్పించాలి.

—చట్టాలను ఉల్లంఘించిన యజమానులను తీవ్రంగా శిక్షించాలి.

—ప్రతి పట్టణంలో ప్రభుత్వ సబ్సిడీతో వర్కింగ్ వుమెన్ హాస్టల్స్ నిర్మించాలి.



# కాన్పూర్ మహాసభ విశేషాలు

13 ఏండ్ల క్రితం సి.ఐ.టి.యు. ఏర్పడింది. ఎందుకు? "సోషలిస్టు ఆదర్శంకై గట్టిగా నిలబడుతూ, సమాజాన్ని అన్నిరకాల దోపిడీలనుండి విముక్తి చేయుటకు సి.ఐ.టి.యు. నిలబడి ఉన్నది" అని దీని నిబంధనావళిలోని "లక్ష్యాలు" అన్న ప్రథమాధ్యాయంలోనే చెప్పబడింది.

ఈ లక్ష్యాన్ని చేరటానికై అది కార్మిక వర్గాన్ని అంతటినీ ఐక్యం చేస్తుంది ప్రస్తుతమున్న పెట్టుబడిదారీ-భూస్వామ్య ప్రభుత్వ స్థానే ప్రజల ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పర్చటానికి పోరాడుతుంది. ఈ పెట్టుబడిదారీ భూస్వామ్య ప్రభుత్వాన్ని తొలగించటానికై ఇతర ప్రజాతంత్ర శక్తుల పోరాటాలకు తోడ్పడుతుంది. రైతులు, వ్యవసాయ కార్మికులు ఫ్యూడల్ అవశేషాలను సంపూర్ణంగా తొలగించటానికి, భూమి కొరకు జరిపేపోరాటానికి పూర్తి సహాయం అందజేస్తుంది. సామ్రాజ్యవాదులు అంతరాతీయంగా సాగించే కుట్రలకు, కుహకాలకు వ్యతిరేకంగా, మన దేశ స్వాతంత్ర్యానికి ప్రమాదం కలిగించే చర్యలకు వ్యతిరేకంగా పోరాటం సాగిస్తుంది. ఇతర దేశాల కార్మికులు సాగించే పోరాటాలకూ. పీడిత ప్రజల విముక్తి పోరాటాలకూ సంపూర్ణ సహాయం అందజేస్తుంది. సోషలిస్టు దేశాల ప్రజలతో సౌహార్ద్ర సంబంధాలను పెంపొందిస్తుంది. ముఖ్యంగా కార్మికవర్గంయొక్క రాజకీయ చైతన్యాన్ని, సోషలిస్టు చైతన్యాన్ని పెంపొందించి తన లక్ష్య సాధన కొరకై జరిగే పోరాటంలో నాయకత్వ పాత్ర నిర్వహించేటట్లు చేస్తుంది.

ఈ కర్తవ్యాలను ఎంతవరకు ఈపుష్కర కాలంలోనూ సి.ఐ.టి.యు. నిర్వహించిందీ, ముఖ్యంగా అది రాజకీయ చైతన్యాన్ని సోషలిస్టు చైతన్యాన్ని పెంచుటకు ఎంత కృషి చేసిందీ, అంతర్జాతీయ కర్తవ్యాలను నిర్వహించుటకు ఎంతవరకు సమాయత్తం చేసిందీ సమీక్ష చేయవలసిన అవసరం ఏర్పడింది. ఈ చైతన్యాన్ని పెంచనిదే కార్మికోద్యమం ఆర్థిక తత్వపు ఊబిలోనే దిగబడి ఉంటుంది. మరొక ప్రధాన కర్తవ్యం అయిన కార్మికవర్గ ఐక్యత, ఐక్యపోరాటాలుఅన్నది ఎంతవరకు నిర్వహించబడిందీ అనేది కూడా సమీక్షించవలసిన తరుణం ఆసన్నమయింది.

సి.ఐ.టి.యు. 5వ మహాసభ ఈ సమీక్షకే ప్రధానంగా పరిమితమయింది.

ప్రధాన కార్యదర్శి కా॥ పి. రామమూర్తి సమర్పించిన నివేదికలో ఈ కాలంలో జరిగిన కార్మికవర్గ ఐక్యపోరాటాలను గురించి వివరంగా పేర్కొనటం జరిగింది. 1978లో హైదరాబాద్‌లోను, 1979లో బెంగుళూరులోనూ జరిగిన ప్రభుత్వరంగ పరిశ్రమలలోని కార్మికుల సదస్సులు, 1979 సెప్టెంబరు 14న జయప్రదంగా జరిగిన ఒకరోజు నిరసనసమ్మె ఈ ఐక్యపోరాటాలకు ఊపు నిచ్చింది. ఆఖరకు ఐ.ఎన్.టి.యు.సి కూడా ఈ కార్మిక ఐక్యత ప్రభావానికి లొంగి వేరుగానైనా నిరసన సమ్మెకు పిలుపునిచ్చింది. 1981 ఫిబ్రవరి 22న సి.ఐ.టి.యు., ఏ.ఐ.టి.యు.సి., హెచ్.ఎమ్.ఎస్., బి.ఎమ్.ఎస్., కలిసి సదస్సు జరిపి ఫిబ్రవరి 27న ప్రధానమంత్రి ఇంటిముందు ధర్నా జరుపుటకు, మార్చి 3న ఉమ్మడి ప్రదర్శనలు జరుపుటకు, మార్చి 11న ప్రభుత్వరంగ పరిశ్రమలలో ఒకరోజు సమ్మె జరుపుటకు పిలుపు నిచ్చాయి. ఈ కార్యక్రమాలన్నీ జయప్రదమైనాయి. 1981 మార్చి 26న ఢిల్లీలో జరిగిన బ్రహ్మాండమయిన రైతు ప్రదర్శనలో కార్మికులు కూడా కూడా గణనీయమైనసంఖ్యలో పాల్గొనడంతో కార్మిక-కర్షక ఐక్యతకు దోహదం కలిగింది. ఈ విధంగా సాగుతూ వచ్చిన ఐక్య ఉద్యమాలు 1981 జూన్ 4న బొంబాయిలో జరిగిన అఖిలభారత కార్మిక సదస్సులో ఒక నిర్మాణ రూపం తీసున్నాయి. 8 కేంద్ర ట్రేడ్ యూనియన్లు, 40కి పైగా జాతీయ ఫెడరేషన్లు ఈ సదస్సులో పాల్గొన్నాయి భారతదేశం అంతటి నుండి వచ్చిన 3 వేల మంది ప్రతినిధులు దీనిలో పాల్గొన్నారు. నేషనల్ కాంపెయిన్ కమిటీ ఏర్పడింది. ప్రప్రథమంగా రైతుల, వ్యవసాయ కార్మికుల ఉద్యమాలకు ప్రత్యక్షంగా తోడ్పడడానికి ఈ సదస్సు ద్వారా కార్మికవర్గం నిర్ణయించింది.

నేషనల్ కాంపెయిన్ కమిటీ కార్మికోద్యమ నిర్మాణంలో ఒక మైలురాయి.

దీని తరువాత అనేక రాష్ట్రాలలో రాష్ట్ర సదస్సులు జరిగినాయి. ఊహించని విధంగా ఇవన్నీ జయప్రదంగా జరిగినాయి.

23-11-1981న ఢిల్లీలో పార్లమెంటు ముందు జరిగిన అఖిలభారత కార్మిక ప్రదర్శన మరొక అపూర్వమయిన ఘట్టం. ఢిల్లీ పత్రికల కథనం ప్రకారం ఢిల్లీలో జరిగిన అన్ని ప్రజా ప్రదర్శనలలోకి ఇది పెద్దది.

ఎన్. సి. సి. ఇచ్చిన పిలుపునందుకొని 1982 జనవరి 19న జరిగిన అఖిలభారత కార్మిక నిరసన సమ్మె కార్మికోద్యమ చరిత్రలోనే అపూర్వమయినది. 'రెడ్ లెటర్ డే' అని దీనిని అనేక మంది వ్యాఖ్యానించారు. ఈ జనరల్ సమ్మె దేశవ్యాప్త బంద్‌గా పరిణమించింది. పశ్చిమ బెంగాల్, కేరళ, త్రిపురలలో అధికారయుతంగా ఆ బంద్ జరుగగా ఇతర రాష్ట్రాలలో స్వచ్ఛందంగానే జరిగింది. వ్యవసాయ కార్మికులు కూడా అనేక రాష్ట్రాలలో దీనిలో పాల్గొనడం ఒక విశేషం.

ఈ ఐక్య ఉద్యమం పోరాటరూపం తీసుకుంటానికి సన్నాహమయింది. 1982 జూన్ 21, 22 తేదీలలో భోపాల్‌లో బి.హెచ్.ఇ.ఎల్. సదస్సు, జూలై 17, 18 తేదీలలో బొకారోలో జరిగినఉక్కు కార్మికులసదస్సు, ఆగస్టు 21, 22 తేదీలలో ధన్‌బాద్‌లో బొగ్గు కార్మికుల సదస్సు, కార్మికులలో ఉత్సాహాన్ని పోరాటతత్వాన్ని కలిగించింది సెప్టెంబరు 11వ తేదీ అఖిలభారత బొగ్గు కార్మికుల నిరసన దినోత్సవం, నవంబరు 8న అఖిలభారత నిరసనసమ్మె జరిగినవి. 1983 జనవరిలో 17 నుండి 19వ తేదీవరకు మూడురోజుల సమ్మెచేసేందుకు పిలుపు నివ్వడం జరిగింది.

1982 అక్టోబరు 12, 13 తేదీలలో హైదరాబాదులో జరిగిన ప్రభుత్వరంగ పరిశ్రమ కార్మికుల సదస్సులో 300 యూనియన్లు పాల్గొన్నాయి. ఒకరోజు నిరసన సమ్మె జరుపుటకు ఈ సదస్సు పిలుపునిచ్చింది జనవరి 28, 1983 న ఈ అఖిలభారత సమ్మె జరుపుటకు నిర్ణయించబడింది

ఈ పరిస్థితిలోనే ఇందిరా కాంగ్రెసు రాజకీయంగా అనేక అపజయాలను పొందింది. త్రిపురలో తిరిగి వామపక్ష ప్రభుత్వం ఏర్పడటమేగాక కాంగ్రెసుకు కంచుకోటలుగ వున్న ఆంధ్రప్రదేశ్, కర్ణాటకలలో ఇందిరా

కాంగ్రెసు ఘోరపరాజం పొందింది. కార్మిక వర్గం యిందుకు తోడ్పడింది.

ఈ పరిస్థితులలో ఇందిరా కాంగ్రెసు ప్రభుత్వం తలఒగ్గక తప్పలేదు. నేషనల్ కాంపెయిన్ కమిటీతో సంప్రదింపులు ప్రారంభించింది. డి.ఏ. (కరువుభత్యం) ఫార్ములాను నిర్ణయించడానికి ఒక కమిటీని నిర్మించడానికి బి.పి ఇ. గైడ్‌లైన్సును సవరించడానికి అంగీకరించింది.

భారత కార్మికవర్గం యొక్క ఐక్యతకు, ఐక్య పోరాటాలకూ ఇదొక ఘనవిజయం.

వివిధ రాష్ట్రాలనుండీ వచ్చిన ప్రతినిధులు తమ తమ రాష్ట్రాలలో సాగిన ఐక్య పోరాటాలను గురించి కార్మికవర్గ ఐక్యతకై సి.ఐ.టి.యు. జరిపిన కృషిని గురించి వివరమైన నివేదిక లిచ్చారు. అన్ని నివేదికల సారాంశమూ ఒకటే ఐక్యపోరాటాలు వృద్ధి అవుతున్నవి. కాని ఇతర కేంద్ర ట్రేడ్ యూనియన్లు ఈ ఐక్యతను పెంపొందించుటకై చూపవలసిన ఉత్సాహాన్ని, పట్టుదలను చూపడంలేదు. ఒక ప్రధాన భాగస్వామి ఐన ఏ.ఐ టి.యు.సి యే చాలా సందర్భాలలో ఎన్.సి.సి. ఇచ్చిన పిలుపును పాటించలేదు. ఇతర కేంద్ర ట్రేడ్ యూనియన్లు తమ జనాన్ని ఎక్కువగా ఈ ఉద్యమంలో తీసుకు రావడానికి వెనుకాడుతున్నట్లు చెప్పారు. ఏమయినప్పటికీ కార్మిక ఐక్యత ఒక ప్రధాన కర్తవ్యంకాబట్టి ఓపికతో, పట్టుదలతో ఐక్యత కొరకు, ఐక్యపోరాటాల కొరకు సి.ఐ.టి. యు. కృషిచేస్తూనే ఉండాలని సభ్యులు అభిప్రాయాలను వ్యక్తం చేశారు.

మహాసభ విశిష్టత :

సి.ఐ.టి యు. ఏర్పడిన లగాయితూ సోషలిస్టు దేశాలలోని ట్రేడ్‌యూనియన్లు గాని ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్లుగాని దీనినొక విచ్ఛిన్న సంస్థగా పరిగణిస్తూ వచ్చాయి. పదమూడు సంవత్సరాల అనుభవం తరువాతఇప్పుడీదేశాల ట్రేడ్‌యూనియన్లన్నీ సి. ఐ టి. యు ను ఒక ప్రధానమయిన మిలిటెంట్ ట్రేడ్‌యూనియన్ కేంద్రంగా గుర్తించాయి. అందుకే ఈ మహాసభకు మొట్టమొదటిసారిగా సోవియట్‌యూనియన్ ట్రేడ్ యూనియన్ ప్రతినిధి వర్గం, చైనా ట్రేడ్ యూనియన్ ప్రతినిధివర్గం, యుగోస్లోవియా, ట్రేడ్ యూనియన్ ప్రతినిధివర్గం, శ్రీలంకా ఫెడరేషన్‌ఆఫ్‌లేబర్ ప్రతినిధివర్గం, ప్రపంచ ట్రేడ్ యూనియన్‌ల ప్రతినిధి వర్గం ఈ మహాసభకు స్వయంగా హాజరయ్యాయి. ఇదొక అపూర్వమైన విశేషం. శ్రీలంక ప్రతినిధి కా. రాజన్ చెప్పినట్లుగా సోవియట్, చైనా దేశాల ట్రేడ్ యూనియన్లు ప్రతినిధులు ఒకే వేదికపైన కరచాలనం చేయడం సి.ఐ టి.యు. సాధించిన ఒక విజయం. ఈ ప్రతినిధి వర్గాలు తమ ట్రేడ్ యూనియన్ల ఫెడరేషన్ తరపున సౌహార్ద్ర సందేశాల నివ్వడమేగాక సి ఐ.టి.యు కృషిని విశేషంగా ప్రశంసించి ఆ కృషిని ఇంకా ముందుకు తీసుకుపోవాలని అభిలషించాయి.

సి.ఐ టి.యు.తో బాటు నేషనల్ కాంపెయిన్ కమిటీలో ఉన్న ఇతర కేంద్ర ట్రేడ్ యూనియన్లుకూడా సందేశాలు పంపినాయి. ఎ. ఐ. టి. యు. సి. ప్రధాన కార్యదర్శి కా. ఇంద్రజిత్ గుప్తా, బి ఎమ్. ఎస్. తరపున ఓంప్రకాష్ అఘి, ఐ.ఎన్.టి.యు.సి. (దారా) పక్షాన సునీల్ దారా, టి. యు. సి.సి. పక్షాన దిలీప్ శాస్త్రి స్వయంగా హాజరై సందేశాలనిచ్చారు.

రుమేనియన్, ఫ్రెంచ్, కొరియన్ ట్రేడ్ యూనియన్ల ఫెడరేషన్లు సందేశాలు పంపినవి. భారతదేశంలో పెద్ద ఫెడరేషన్లయిన ఆల్ ఇండియా సెంట్రల్ గవర్నమెంటు ఎంప్లాయీస్‌అండ్‌వర్కర్స్‌కాన్‌ఫెడరేషన్, ఆల్ ఇండియా స్టేట్ గవర్నమెంటు ఫెడరేషన్, ఆల్‌ఇండియా రైల్వేమెన్స్ ఫెడరేషన్, ఆల్‌ఇండియా డిఫెన్సు ఎంప్లాయీస్ ఫెడరేషన్ మున్నగునవి పంపిన సందేశాలు చదవబడినవి.

మహాసభకు ఎన్నుకోబడ్డ ప్రతినిధుల సంఖ్య 2,500. హాజరయిన ప్రతినిధులు 2,182 43 మంది సౌహార్ద్ర ప్రతినిధులు కూడాహాజరయ్యారు. పశ్చిమబెంగాల్ వెయ్యి మంది ప్రతినిధులకు 928 మంది. కేరళ 500 మందికి 430 మంది, తమిళనాడు 220కి 202 మంది ఆంధ్ర నుండి 93కు 79 మంది ప్రతినిధులు హాజరయ్యారు. అనేక పోరాటాలలో ఆరితేరిన కార్మికయోధులు, నాయకులు ఈ ప్రతినిధులలో ఉన్నారు.

కాన్పూరులో మహాసభ జరుపుటకు నిర్ణయించడమే ఒక విశేషం. కాన్పూరులో రేయాన్సు, టెక్స్‌టైల్స్, జూట్, ఇంజనీరింగ్ పరిశ్రమలలో సి.ఐ టి.యు. నాయకత్వాన దీర్ఘకాలం అనేక పోరాటాలు జరిపి జయప్రదమయినవి. మొత్తం యు. పి.లో ట్రేడ్ యూనియన్. ఉద్యమం అంతబలం పుంజుకోకపోయినా కాన్పూర్ కార్మికుల యొక్క అండదండలతోనే ఈ మహాసభ నిర్వహించుటకు యు. పి. కామ్రేడ్స్ నిర్ణయించారు. సి.ఐ.టి.యు., జనరల్‌కౌన్సిల్ కాన్పూరును నిర్ణయించడంపట్ల అనేకులు భయసందేహాలను వెళ్ళడించారు. కాని అందరిని ఆశ్చర్యచకితులను చేసేటట్లుగా యు. పి. కామ్రేడ్స్ అద్భుతమైన ఏర్పాట్లు గావించారు కాన్పూర్, లక్నో, ఉన్నావ్ మున్నగు అనేక పట్టణాలన్నీ వీధివీధిన ఎర్రజెండాలు ప్రతిష్ఠించబడినాయి. మహాసభసమావేశానికి, ప్రతినిధుల భోజనాలకు బ్రహ్మాండమయిన హాళ్ళు చాలా అందంగా షామియానాలతో టార్పాలిన్లతో నిర్మించబడినాయి. ఒక్కసారిగా వెయ్యిమంది భోజనం చేసేందుకు వసతులు కల్పించబడినాయి.

మహాసభ ఆవరణలో త్రిపుర, పశ్చిమ బెంగాల్ ప్రదర్శనలు ఏర్పాటు చేయడమేగాక అస్సాంలో నేడు జరుగుతున్న ఘోర కలిని గురించి వివరణాత్మకమైన ప్రదర్శన ఏర్పాటు చేయబడింది. ప్రతిదినం వేలమంది పురజనులు యీ ప్రదర్శనలను తిలకించి అస్సాంలోని నేటి వాస్తవ పరిస్థితులను అర్థం చేసుకోగలిగారు.

మహాసభలో మరో ప్రధానమైన చర్చనీయాంశం కార్మిక వర్గాన్ని ఏ మేరకు రాజకీయ ఉద్యమంలోనికి, ప్రజాతంత్ర ఉద్యమాలలోనికి తీసుకురాగలిగాం అన్న విషయం. అన్ని రాష్ట్రాల ప్రతినిధులు యిచ్చిన నివేదికనుబట్టి ఈ కృషి చాలా స్వల్పంగానే జరిగిందని అర్థం అయింది. దీనిని బట్టి కార్మికోద్యమం యింకా ఆర్థికతత్వపు పరిధిలోనే ఉన్నదని, దీనిని రాజకీయ స్థాయికి తీసుకుపోవలసిన అవసరం ఉన్నదని స్పష్టమైంది.

అధ్యక్షుడు కా. బి టి ఆర్. మహాసభలో అంత్యోపన్యాసం గావించారు. పదేండ్ల తరువాత తిరిగి అంతర్జాతీయ కార్మికోద్యమంలో సి.ఐ టి యు.తన సముచిత స్థానాన్ని పొందగలిగిందని, సి ఐ టి.యు.ను గురించి వెదజల్లబడిన తప్పుడు వార్తలు ఈ విధంగా బట్టబయలయ్యాయని చెప్పారు. కామ్రేడ్ పి. రామమూర్తి పదమూడు సంవత్సరాలు ప్రధాన కార్యదర్శిగా వున్నారు.

కార్మికోద్యమానికీ సి ఐ టి.యు. పెరుగుదలకు ముఖ్యంగా నేషనల్ కాంపెయిన్ కమిటీ బలపడటానికీ వారుగావించిన అమోఘ

## మ హా స భ

మైనసేవలను ప్రస్తుతిస్తూ, తీవ్ర అనారోగ్య కారణాలవల్ల వారు ప్రధానకార్యదర్శి బాధ్యతలనుండి తప్పుకొంటున్నా, కార్మికోద్యమానికి అంకితమై వుండగలరనే ఆశాభావాన్ని వెల్లడించారు. నేషనల్ కాంపెయిన్ కమిటీ ఆధ్వర్యంలో నానాటికీ పెరుగుతున్న ఐక్య పోరాటాలకు తన సంతృప్తిని వెలిబుచ్చుతూ దీనినింకా ముందుకు తీసుకుపోవాలని కోరారు. మధ్య తరహా వుద్యోగుల ప్రాధాన్యత పెరుగుతూ వున్నదనీ, వీరి పోరాటాలు కూడా మిలిటెంటు స్వరూపం తీసుకొంటున్నవనీ వాటికి సి.ఐ.టి.యు సంపూర్ణమైన మద్దతు ఇవ్వగలదని వెల్లడించారు. నేషనల్ కాంపెయిన్ కమిటీలో వీరి సంఘాలకు సముచితస్థానం ఇవ్వటం బావ్యమన్నారు.

కాన్ఫెడరేషన్ ఏర్పాటుపై ఇంద్రజిత్ గుప్తా వెలిబుచ్చిన సందేహాలకు జవాబు యిస్తూ, ఏర్పాటుకు అంగీకరిస్తే వివరాలు మాట్లాడుకోవచ్చునన్నారు.

సి ఐ.టి.యు. స్వతంత్ర కార్యాచరణను పెంపొందించాలనీ ఆ విధంగా అది బలపడుతుందనీ, నేషనల్ కాంపెయిన్ కమిటీ కార్యకలాపాలకు కూడా అది పెద్ద ఊపుగా వుండగలదని చెప్పారు. ఐక్య పోరాటాలనే పేరుతో స్వతంత్ర కార్యాచరణను విస్మరించరాదన్నారు.

రాబోవు కాలం ప్రభుత్వ దాడులు ఉధృతం అయ్యేకాలమనీ, దీనికి వ్యతిరేకంగా కార్మికవర్గం సాగించే ప్రతిఘటన మరింత వుధృతం కాగలదనీ, ఈ చారిత్రాత్మక పోరాటంలో సి. ఐ. టి. యు. ప్రముఖ పాత్ర వహించగలదనీ, పాలసీలను మార్పించటానికీ, ప్రజాతంత్ర ప్రభుత్వ స్థాపనను స్థాపించటానికి ఈ పోరాటాలు జరగాలనీ వారు ఉద్బోధించారు.

17 వ తేదీ సాయంత్రం పూల్‌బాగ్‌లో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగ సభతో సి.ఐ టి.యు. 5 వ మహాసభ జయప్రదంగా ముగిసింది. ★

**అఖిలభారత మహాసభ**
**వివరాలు వచ్చే సంచికలో**

## శ్రామిక మహిళల తీర్మానం
## యాంత్రీకరణకు వ్యతిరేకంగా

ప్రయివేటు రంగంతోబాటు కేంద్ర ప్రభుత్వముకూడా యాంత్రీకరణను ప్రోత్సహిస్తున్నది. ఈ విధంగా ఆసుపత్రులు, బ్యాంకులు, ఎల్ ఐ సి, ఐ ఎల్.టి.డి. తదితర కంపెనీలలో మైక్రో ప్రాసెసర్లు జి యల్ టి వంటి యంత్రాలను ప్రవేశ పెట్టడం జరుగుతున్నది. ఈ విధమైన చర్యల వలన నిరుద్యోగ సమస్య మరింత తీవ్రతర మవుతున్నది. ఈ విధంగా విదేశాలనుండి యంత్రాలను రప్పిస్తూ కార్మికులకు పని లేకుండా చేయడం జరుగుతున్నది. ఈ విధమైన యాంత్రీకరణవలన ముఖ్యంగా స్త్రీలకు నిరుద్యోగం ఎక్కువగుతున్నది.

ప్రభుత్వం యొక్క ఈ కార్మిక వ్యతిరేక చర్యలను శ్రామిక మహిళా సదస్సు ఖండిస్తున్నది.

ఇప్పటికే ప్రవేశపెట్టిన మైక్రో ప్రాసెసర్లను, జి యల్ టి యంత్రాలను తొలగించాలని భవిష్యత్తులో యాంత్రీకరణను అరికట్టాలని డిమాండు చేస్తున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో 2లక్షల మంది పొగాకు కార్మికులలో 1 1/2 లక్షల మంది స్త్రీలు ఐ.ఎల్.టి డి. కంపెనీ మొదలు ప్రతిచిన్న కంపెనీలలో పనిచేస్తున్నారు.

అరవై సంవత్సరాలక్రితం స్థాపించి పని చేస్తున్న ఐ ఎల్.టి.డి కంపెనీ తన పద్ధతులను మార్చి కేంద్ర ప్రభుత్వం ద్వారా తమ పరిశ్రమలలో యంత్రాలు ప్రవేశపెట్టి 15 వేల మంది స్త్రీల ఉద్యోగాలుపోయే ప్రమాదం కల్పించినది. ఇప్పటికే 6000 మంది స్త్రీలను కంపెనీ తొలగించింది.

కేంద్రప్రభుత్వం అనుమతి ఇచ్చిన మరో రెండు యంత్రాలద్వారా యితర కంపెనీలలో కూడా కాడతీసే పనిని యంత్రాల ద్వారా చేయించడం ద్వారా మరో 50,000 మంది స్త్రీలు ఉద్యోగాలు కోల్పోతున్నారు.

దీని మూలంగా గ్రామీణ ఆర్థిక విధానం తారుమారయ్యే ప్రమాదం ఏర్పడినది.

అందువలన ఆంధ్రప్రదేశ్‌లో అనుమతి ఇచ్చిన ఐ ఎల్.టి.డి. అనవరితో సహా 4 జి.ఎల్.టి. యంత్రాల లైసెన్సులను రద్దు చేసి పెద్ద ఎత్తున సాగుతున్న యీ ప్రమాదాన్ని నివారించాలి.

★

## బి. టి. రణదివె వ్యాసం

(9వ పేజీ తరువాయి)

సి. ఐ. టి. యు. తన కార్యక్రమాలను ఈ దృష్టితో పరిశీలించాలి.

ప్రజాస్వామ్య పంథాలో ముందు భాగాన నిలిచిన పశ్చిమ బెంగాల్, త్రిపుర వామపక్ష ప్రభుత్వాలను దుయ్యబట్టటానికి కేంద్ర ట్రేడ్‌యూనియన్ నాయకులు కొందరుపోటీ పడుతున్నారు. కార్మికవర్గం ప్రజాతంత్ర వుద్యమంయొక్క విజయాలే ఈ ప్రభుత్వాలు ఏర్పడటానికి కారణమైనాయి. వామపక్ష శక్తులకు, ఈ ప్రభుత్వాలకు మిగతావర్గాల కార్మికుల నుంచి సి.ఐ.టి యు. మద్దతును సంపాదించాలి. ప్రజాస్వామ్యం కోసం జరిపే పోరాటంలో విజయం సంపాదించటానికిది ఆవశ్యకం.

మూడవ ప్రపంచదేశాల్లో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం సామ్రాజ్యవాద సవాలు నెదుర్కొంటోందని ఇది వరకే చెప్పాము. అయితే భారతదేశంలో పరిస్థితి మాత్రం భిన్నంగావున్నది. అసలు ట్రేడ్‌యూనియన్ వుద్యమంలో చాలా భాగం సామ్రాజ్యవాదం వునికిని, దానివలన మన దేశానికి ఏర్పడే ప్రమాదాన్ని గుర్తించటంలేదు. సామ్రాజ్యవాద శక్తులు మనదేశాన్ని చీల్చటానికి చేసే కుట్రలు, అంతర్జాతీయ ద్రవ్యనిధి ఋణం మొదలైన విషయాలు చాలా యూనియన్లు గుర్తించటంలేదు. సంయుక్త ట్రేడ్‌యూనియన్ వుద్యమంలో సి. ఐ. టి. యు. సామ్రాజ్యవాద ప్రమాదాన్ని కార్మికుల దృష్టికి తీసుకురావాలి.

ఇక చివరి విషయం- గత మహాసభ తరువాత దేశప్రజల భవిష్యత్తుకు, కార్మికోద్యమానికి ముప్పును తెచ్చిపెట్టే విచ్ఛిన్నకర శక్తులు చెలరేగాయి. వీటిని అమెరికన్ సామ్రాజ్యవాదం ప్రోత్సహిస్తోంది. అస్సాం, పంజాబ్ రాష్ట్రాల్లో అమెరికన్ సామ్రాజ్యవాదుల సహాయంతో విచ్ఛిన్నకర శక్తులు పనిచేస్తున్నాయి. సి ఐ.టి.యు ఈ పరిణామాలను తీవ్రంగా పరిగణించి ఈ శక్తులను ప్రతిఘటించేందుకు ట్రేడ్ యూనియన్ వుద్యమం సమీకరించటానికి పద్ధతులు రూపొందించాలి. ★

# కార్మికవర్గ హక్కులకై పార్లమెంటులో పోరాటం



సమర్ ముఖర్జీ
లోక్‌సభలో మార్క్సిస్టు
పార్టీ నాయకులు

పెట్టుబడిదారీ వ్యవస్థలో సంక్షోభం-ద్రవ్యోల్బణం, ఆర్థిక మాంద్యం, విదేశీ రుణాల భారం మొదలైన రూపాల్లో పెరిగింది. అంతర్జాతీయ ద్రవ్యనిధి, ప్రపంచబ్యాంకు విధించిన అవమానకరమైన, ప్రమాదకరమైన షరతులకు తలవొగ్గి, గుత్తపెట్టుబడిదారులు, దోపిడీ వర్గాలు ప్రభుత్వ విధానాలు, యంత్రాంగం సాయంతో కార్మికవర్గంపై అసాధారణ ప్రజలపైన సంక్షోభ భారాలను మోపుతున్నారు. అందువల్లనే కార్మిక వర్గంపైన ప్రజలపైన దాడులు రోజురోజుకూ అధికమవుతున్నాయి. నిరంతరం ధరలు పెంచటంవలన, ముఖ్యంగా పేదప్రజలు వాడే సరుకుల ధరలు పెంచటం వలన, దేశంలో అధిక సంఖ్యాక ప్రజలజీవన స్థాయిపై ప్రత్యక్ష దాడి జరుగుతోంది. ఈ విధానంవలన శ్రామికులు కష్టపడి సంపాదించిన సొమ్ము పెట్టుబడిదారులు, వ్యాపారులు, అక్రమ నిల్వదారులు, ఋణదాతలు అవినీతిపరులైన అధికారుల జేబుల్లోకిపోయి కోట్లాది ప్రజల జీవితాలు నాశనమై, కొనుగోలుశక్తి కోల్పోయి గర్భదరిద్రులైనారు. మన కేంద్రప్రభుత్వ విధానాలు కార్మికులు, రైతులు, వ్యవసాయ కార్మికులు మొదలైన పేదప్రజల శ్రేయస్సు కోసం వుద్దేశించినవి కాదు. దేశవ్యాపితంగా ప్రభుత్వ పంపిణీ వ్యవస్థను ఏర్పాటుచేసి, నిత్యావసర వస్తువుల టోకు వ్యాపారం ప్రయివేటు వ్యాపారుల నుంచి తీసుకుని జాతీయంచేసి ఆ వస్తువులను చౌక ధరలకు పేదప్రజలకు సరఫరాచేయటం గాని, రైతుల వ్యవసాయ వుత్పత్తులకు గిట్టుబాటుధరలులభించేటట్లు చూడటంగాని ప్రభుత్వ విధానం కాదు. కేంద్ర ప్రభుత్వం దోపిడీదారుల ప్రయోజనాలు పరిరక్షించి పెంపొందించే విధానాలను బాహాటంగా అనుసరిస్తోంది. ప్రభుత్వం గుత్తపెట్టుబడులకు వ్యాపార రంగానికి ప్రత్యక్ష పన్నులు (12 శాతం మాత్రమే) పెద్ద మొత్తాలలో తగ్గించి రాయితీలు ఇస్తోంది. దాని కోసం సామాన్య ప్రజలపై వేసే పరోక్ష పన్నులను (దాదాపు 88 శాతం) పెంచి వస్తువుల ధరలు మరింత పెరిగేట్లు చేస్తోంది. పెద్ద వ్యాపారస్తులకు పెద్దమొత్తాలలో రాయితీలివ్వటం వలన సంపద కేంద్రీకరణ జరుగుతోంది. ఇది చాలక పెద్ద మొత్తాలలో పన్నులు ఎగవేసి నల్ల ధనం బాగామూలుగుతూ దానితో సమాంతర ఆర్థిక వ్యవస్థను నడిపి, సరుకులు అక్రమంగా నిలువచేసి ధరలు పెంచి బజారులో కృత్రిమ కొరతలేర్పరచి విశేషలాభమార్జించే వారికి ఈ ప్రభుత్వం దండన నుంచి స్వేచ్ఛనిచ్చింది.

పెట్టుబడిదారుల, లాభార్జన పరుల పట్ల ప్రభుత్వ విధానం సడలింపులు, రాయితీలు. కార్మికులపట్ల ప్రభుత్వ విధానం వేతన స్తంభన, జీతాలు, బోనసుల పెంపుదలతో అధిక ఉత్పత్తి అధిక పని భారం ముడిపెట్టవలసిందే. వీటివలన రిట్రెంచ్‌మెంటు, పగసాధింపుచర్యలు కొనసాగుతాయి. గ్రామాలలో వ్యవసాయ యోగ్యమైన భూమిలో అత్యధిక భాగం కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతమైంది. గ్రామాల్లో 4 శాతంగా వున్న పెద్ద భూస్వాముల చేతుల్లో 40 శాతం భూమి వున్నది. దీనివలన నల్ల బజారు వర్ధిల్లుతోంది. గ్రామీణ ప్రజల దారిద్ర్యం పెరుగుతోంది. దేశంలో పారిశ్రామిక వుత్పత్తులకు మార్కెట్ కుంచించుకు పోతోంది. ఆర్థిక మాంద్యం ప్రబలి పారిశ్రామిక వస్తువుల నిలవలు పెరిగిపోతున్నాయి. దానితో ఫ్యాక్టరీల మూసివేత- మరింత నిరుద్యోగం- మరింత దారిద్ర్యం- చివరకు ఆర్థిక కేంద్రీకరణ- ఇవన్నీ స్వాతంత్ర్యం వచ్చిన నాటినుంచి కాంగ్రెసు పాలకులు అనుసరించిన పెట్టుబడిదారీ పంథావలన కలిగిన అనివార్య దుష్ఫలితాలు. ఇవి నానాటికీ తీవ్రమై కార్మికవర్గం, రైతులు, వుద్యోగులు మొదలైన వివిధ తరగతుల ప్రజానీకంలో తీవ్ర అసంతృప్తి కలుగచేయటంవలన అనేక తగాదాలు, ఘర్షణలు, పోరాటాలు ప్రారంభమవుతున్నాయి.

అసంతృప్తి బాగా ప్రబలి వివిధ తరగతుల ప్రజానీకం, కార్మికవర్గం చేసే పోరాటాలకు భయపడిన కాంగ్రెస్ (ఐ) ప్రభుత్వం కేంద్రంలోను, రాష్ట్రాలలోను కార్మికుల, ప్రజల ట్రేడ్‌యూనియన్ హక్కులపైన, ప్రజాతంత్ర హక్కులపైన దమనకాండ సాగించి, నిరంకుశపు దాడులుచేసి దోపిడీ వర్గాల, పెట్టుబడిదారుల ప్రయోజనాలురక్షించటానికి పూనుకున్నది. సామ్రాజ్యవాదశక్తుల ప్రోత్సాహంతో ప్రాంతీయ దురభిమాన శక్తులు ప్రజలలోవున్న అసంతృప్తిని కుల, మత, ప్రాంతీయ, వేర్పాటు వుద్యమాలలోకి మళ్ళించి కార్మికవర్గం, శ్రమజీవులు ఐక్యంగా చేసే పోరాటాలను విచ్ఛిన్నంచేసి అస్థిర పరిస్థితిని కల్పిస్తున్నాయి.

ప్రస్తుత ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులను దృష్టిలో వుంచుకొని పార్లమెంటు లోపల కార్మికవర్గ హక్కులకోసం జరిపే పోరాటాన్ని పరిశీలించాలి. పార్లమెంటు బయట కార్మిక వర్గం తీవ్రంగా చేసే పోరాటాలు పార్లమెంటులోపల జరిగేపోరాటంతో క్రమంగా ఎలా సమన్వయమవుతున్నాయో గమనించాలి.

## ఈ దాడుల వెనుకగల వర్గ సిద్ధాంత సారాంశం

కార్మిక వర్గం ఎన్నో సంవత్సరాలు పోరాడిసాధించుకున్న హక్కులు, సౌకర్యాలు ఆర్థిక సదుపాయాలు, వుద్యోగ భద్రత మొదలైనవి పరిరక్షించుకోవటానికిపోరాటాలు ప్రారంభించిన కొద్దీ వారు ప్రభుత్వం నుంచి ఒక పద్ధతి ప్రకారం కొనసాగించే హింసాత్మకమైన దాడుల నెదుర్కొంటున్నారు. పెద్ద

# ఆర్థిక సంక్షోభ ఫలితమే కార్మిక వర్గంపై దాడి

విదేశీ బహుళజాతికంపెనీలు, భారతదేశంలో పెద్ద వ్యాపారస్తులు పెట్టుబడులు పెట్టి నిరాటంకంగా లాభాలు సంపాదించటానికి ఆకర్షణీయమైన వాతావరణం కలుగచేయటమే ఈ దాడుల ప్రధాన వుద్దేశ్యం. బహుళజాతి కంపెనీల పెట్టుబడుల ఆహ్వానిస్తూ, అంతర్జాతీయ ద్రవ్యనిధి షరతులను అమలుపరుస్తానని హామీఇచ్చిన ప్రభుత్వం తప్పనిసరిగా కార్మిక వ్యతిరేక విధానం అవలంబించి న్యాయము, సక్రమమైన ట్రేడ్ యూనియన్ వుద్యమాలన్నింటినీ అణచివేసి వారు ఎన్నో సంవత్సరాల దీర్ఘ పోరాటాల ద్వారా సాధించుకున్న ప్రాథమిక ట్రేడ్‌యూనియన్‌హక్కులైన సమష్టి బేర హక్కును,సమ్మెహక్కును తీసివేయటానికి ప్రయత్నిస్తోంది. కార్మిక వర్గాన్ని అణచివేయటంలో తన నిజాయితీని బహుళజాతి కంపెనీలకు నిరూపించటానికి భారతప్రభుత్వం ట్రేడ్‌యూనియన్‌హక్కులను, ప్రజాతంత్ర హక్కులను అణచివేయటానికి, రద్దు చేయటానికి పూనుకున్నది. ఈ దాడుల అంతర్యమైన వర్గ సిద్ధాంత సారాంశం స్పష్టంగా తెలుస్తూనే వున్నది.

### దాడుల స్వభావం

1975 జూన్ నుంచి 1977 సాధారణ ఎన్నికలు జరిగేవరకు, అత్యవసర పరిస్థితి సమయంలో అంతరంగిక భద్రతాచట్టం వుపయోగించి వేలాదిగా రాజకీయ నాయకులను, ట్రేడ్ యూనియన్ నాయకులను విచారణ లేకుండా జైలుపాలు చేశారు. శ్రీమతి గాంధి అధికారంలో కొనసాగటమేగాక ఫ్యాక్టరీల్లో, రైల్వేలో పనిచేసే కార్మికులు, వుద్యోగులు ఏ మాత్రం నిరసన చూపకుండా ఎక్కువ వుత్పత్తిచేసియజమానులలాభాలు పెంచటానికి అనువైన భయానక వాతావరణం సృష్టించారు. జయప్రకాశ్ నారాయణ్, మొరార్జీ దేశాయ్‌లాంటి నాయకులను కూడా ఈ విషయంలో వదలలేదు. శ్రీమతి గాంధీ, ఆమె పార్టీ 1977 సాధారణ ఎన్నికల్లో ఘోర పరాజయం పొంది జనతా పార్టీ విజయం సాధించిన తరువాతగాని అంతరంగిక భద్రతా చట్టం పోలేదు.

1980 లో ఆమె తిరిగి అధికారంలోకి వచ్చాక అంతరంగిక భద్రతా చట్టం మరో పేరుతో, మొదటి ఆర్డినెన్సుగా, తరువాత చట్టరూపంలో వచ్చింది. అంతరంగిక భద్రత అనే చట్టాన్ని జాతీయ భద్రతా చట్టంగా పేరుపెట్టారు. అంతరంగిక భద్రతా చట్టంలో లాగా ఈ చట్టం ప్రకారం కూడా విచారణ లేకుండా వ్యక్తులను నిర్బంధించవచ్చును. 1980 డిసెంబరులో లోక్‌సభలోను, రాజ్యసభలోను బిల్లును ప్రవేశపెట్టినపుడు ప్రభుత్వ ప్రతినిధి వాదనలను మొత్తం ప్రతిపక్షాలన్నీ ఖండించాయి. అయినా బిల్లు ప్రతిపక్ష పార్టీలను, శక్తులను, కార్మికవర్గాన్ని అణచిపెట్టడానికి వుద్దేశించింది కాదని, విదేశీశక్తుల నుంచి దేశాన్ని కాపాడటమేనని చెప్తూ బిల్లు యొక్క ముఖ్యోద్దేశం దాచటానికి ప్రయత్నించాడు. ఇది పూర్తి అబద్ధమని చట్టంఅమలు చేశాకతెలిపోయింది. మొదటగా అరెస్టయింది. ధన్‌బాద్ నుంచి ప్రతిపక్ష పార్లమెంటు సభ్యుడు తరువాత ఒక ఎస్. యఫ్. ఐ. నాయకుడు ఆ పైన చట్టాన్ని విచ్చలవిడిగా ట్రేడ్‌యూనియన్ వుద్యమాలపై, ప్రజాతంత్ర వుద్యమాలపై ప్రయోగించారు. 1981 ఫిబ్రవరి ఆందోళనలో పాల్గొన్న లోకో రన్నింగ్ స్టాఫ్‌ను ఎక్కువ సంఖ్యలో అరెస్టు చేయటం మరో స్పష్టమైన వుదాహరణ, బెంగుళూరు, హైద్రాబాదు పబ్లిక్ రంగ వుద్యోగాలపైన కూడా ఈ చట్టం ప్రయోగించారు.

లోక్‌సభలో శ్రీ సోమనాథ చటర్జీ, రాజ్యసభలో శ్రీ హరికిషన్ సింగ్ సూర్జిత్ ఈ చట్టాన్ని ఒక పాశవికమైన నల్ల చట్టంగా అభివర్ణించారు. ప్రభుత్వం తనకున్న మెజారిటీతో ఈ చట్టాన్ని ఆమోదం పొందేట్లు చేసుకున్నా, పార్లమెంటు బయట అనేక ప్రజాసంఘాలు,ట్రేడ్‌యూనియన్లు బ్రహ్మాండమైన నిరసన ప్రదర్శనలు చేశాయి. రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల సమాఖ్య నిర్వహించిన ప్రదర్శన గురించి ప్రత్యేకంగా చెప్పాలి. వారు ఫిబ్రవరి నాలుగవ తేదీ అఖిలభారత నిరసన దినం పాటించారు : మే 4 న పార్లమెంటు ఎదుట బోట్‌క్లబ్ వద్ద బ్రహ్మాండమైన ప్రదర్శన చేసి లోక్‌సభ స్పీకరుకు లక్షలాది సంతకాలతో ప్రజా వినతి పత్రం సమర్పించారు. లోక్‌సభలో ఈ విషయం సమర్ ముఖర్జీ ప్రస్తావించారు.

### ఎల్. ఐ. సి. ఒప్పందంపై దాడి

1981లో బడ్జెటు సమావేశం రెండు వారాల్లో ప్రారంభం కానున్నదనగా జనవరి 31, 1981న కేంద్ర ప్రభుత్వం జీవితభీమా కార్పొరేషన్ (సవరణ) ఆర్డినెన్సు, 1981లో జారీ చేసింది. పారిశ్రామిక వివాదాలచట్టం, 1947 ప్రకారం 1974జనవరి 24న ఆ సంస్థ యాజమాన్యానికి, వుద్యోగులకు మధ్య జరిగిన ఒప్పందం ప్రకారం నిర్ణయించిన వేతన స్వరూపాన్ని, సర్వీసు నిబంధనలను, ఏకపక్షంగా మార్చటానికి అధికారాలుప్రభుత్వం హస్తగతం చేసుకొనటమే ఆర్డినెన్సు ముఖ్య వుద్దేశం. ఒప్పందాన్ని సమర్థిస్తూ సుప్రీం కోర్టు తీర్పు యిచ్చిన తరువాత ఈ ఆర్డినెన్సు వచ్చింది. ఇది సమష్టి బేరాల హక్కుపై దాడి మాత్రమే కాదు. సుప్రీంకోర్టును అవమానించటం కూడా. దేశమంతటా ఎల్. ఐ. సి. వుద్యోగులు సమ్మెలు మొదలైన పోరాటాల ద్వారా ఈ పైశాచిక చట్టాన్ని ప్రతిఘటించారు. ఈ పోరాటం పార్లమెంటు రెండుసభల్లోను అనేక రూపాల్లో ప్రతిధ్వనించింది.

### ఎస్మాకు వ్యతిరేకంగా పోరాటం

అత్యవసర సర్వీసులకు సంబంధించిన ఆర్డినెన్సును బిల్లు రూపంలో పార్లమెంటు ఆమోదానికి ప్రవేశపెట్టినపుడు పార్లమెంటులో నూతన చరిత్ర సృష్టి జరిగింది. ఈ బిలు స్వభావం ఎంత పైశాచికమైనదంటే దేశంలో కార్మికవర్గమే కాక, ప్రజాతంత్రవాదులు కూడా అత్యంత శక్తివంతంగా తమ నిరసనను వెంటనే తెలియచేశారు. పార్లమెంటు వర్షాకాల సమావేశానికి మూడు వారాల ముందుగా జూలై 26 న ఆర్డినెన్సు జారీ చేశారు. పారిశ్రామిక వాతావరణం ప్రశాంతంగా వుండగా, ప్రభుత్వ సుస్థిరతకు బయటనుంచిగాని, లోపలనుంచిగాని ప్రమాదమేమీ లేనపుడు ఆర్డినెన్సు ఎందుకంత అత్యవసరమైందో సమర్థించుకోవటం ప్రభుత్వానికి కష్టమైంది.

ఈ ఆర్డినెన్సు విడుదల కాకముందు భారతదేశంలో ట్రేడ్‌యూనియన్‌వుద్యమం

(మిగతా 24వ పేజీలో)

# కార్మికోద్యమం - కర్నూలు జిల్లా అనుభవాలు

రాష్ట్రంలో కార్మికోద్యమం సి.ఐ.టి.యు నాయకత్వాన దినదినాభివృద్ధి చెందుతున్న స్థితి నేడున్నది. సి.ఐ.టి.యు ను ఇంకా ఏవిధంగా విస్తృతం చేయాలనేది నేడు రాష్ట్రంలోని కార్యకర్తలందరి ముందున్న ప్రశ్న. ఈ సందర్భంగా కర్నూలు జిల్లాలో గల మా అనుభవాలు తెలపడం అప్రస్తుతంకాదనుకుంటాను

1978సెప్టెంబరు మహాసభనాటికికర్నూలు జిల్లాలో సుమారు 1000 సభ్యత్వం గల యూనియన్‌లు మాత్రమే సి.ఐ.టి.యు.కు అనుబంధంగా వుండేవి.అది ఈనాడు సుమారు 5000 అనుబంధ సభ్యత్వం కలిగివుండడమే గాక మరో 4000 మంది కార్మికుల్లో జిల్లా వ్యాపితంగా ప్రభావం చూపేస్థితికి పెరిగింది. గత 4సం॥లుగా సి.ఐ.టి.యు. సాగించినటువంటి వీరోచిత పోరాటాల ఫలితంగానే ఇది సాధ్యపడింది. సి.ఐ.టి.యు. నాయకత్వాన అనేక సంఘాలలో దీర్ఘకాలిక సమ్మె పోరాటాలు జరిగాయి. కార్మికులు ఆర్థికంగా గణనీయమైన విజయాలు సాధించుకున్నారు. అయితే ఇదే సమయంలో జిల్లాలలోని సి.ఐ.టి.యు. సంఘాలు తమ ఉనికిని కాపాడుకోవడం కొరకు తమ కార్యకర్తలనురక్షించుకొనేందుకు, లారీ యజమానులు పరిశ్రమల యజమానులు కలిసికట్టుగా సంఘవిద్రోహశక్తులద్వారా సాగించినదాడులు, పారిశ్రామిక యజమానుల ఏజెంట్లయిన కాంగ్రెస్ (ఐ) మంత్రుల కనుసన్నలలో పోలీసులు జరిపిన దాడులు ఏకకాలంలో ఎదుర్కొనవలసివచ్చింది. జిల్లాలోనిఅనేకప్రాంతాలలో మనఆఫీసులపై గూండాల దాడులు సాగించారు. లారీ యజమానులే స్వయంగా తుపాకి కాల్పులు జరిపి సి.ఐ.టి.యు. కార్యకర్తలను చంపేందుకు యత్నించిన ఘటన వారి స్వభావాన్ని సూచిస్తుంది పోలీసులు ఇదే సమయంలో యజమానుల పర్యవేక్షణలో కార్మికులపై తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగించారు. జిల్లా వ్యాపితంగా సుమారు 600 మందిపై అనేక సెక్షనతో క్రిమినల్ కేసులు బనాయించి చాలామందిని నెలల తరబడి జైళ్ళపాలు చేశారు. కర్నూలు సిమెంటు నగర్‌లలో సి.ఐ.టి.యు నాయకులు, ముఖ్య కార్యకర్తలందర్ని హత్యకేసులోను, హత్యాప్రయత్నం కేసులలోను ఇరికించారు. కర్నూలులో సి.ఐ.టి.యు. ఆఫీసుపై దాడిచేసి ఆఫీసునుధ్వంసం చేయడమేగాక ఫర్నిచర్‌నంతా దొంగిలించుకుపోయారు. పేపర్ మిల్లు యజమానుల గూండాల పాత్రను నల్లబజారుకు అమ్ముడుపోయిన పోలీసు అధికారులే నిర్వహించారు. పోలీసుల పక్షపాత వైఖరికి పరాకాష్ఠగా 1982 ఏప్రిల్ 12న సిమెంట్‌నగర్ కార్మికులపై అక్రమంగా కాల్పులు జరిపి మన కార్యకర్త గోవిందును పొట్టన పెట్టుకున్నారు.

సి.ఐ.టి.యు రాష్ట్రకమిటీ సలహా సహకారాల ద్వారాను సి.ఐ.టి.యు. అవలంబించిన ఐక్య సంఘటన ఎత్తుగడల ద్వారాను శ్లాఘనీయమైన కార్మికుల ఐక్యత, పోరాటపటిమ వలన ఈ అన్ని పరీక్షలకు తట్టుకొని నిలకడగా నిలబడినచోట పురోగమించటంతో పాటు క్రొత్త సంఘాలకు విస్తరించాము.

## మా అనుభవాల సారం

కేవలము మన అనుబంధ సంఘాలలోనే పని చేయాలనే వైఖరి సరియైనదికాదు అనుబంధముతో నిమిత్తము లేకుండా కార్మికులున్న ప్రతిచోట సంఘాలలో పని చేస్తూ సమస్యలపై సంఘటిత పరుస్తూ పనిచేయడం వల్ల క్రమంగా నాయకత్వ స్థాయికి ఎదగవచ్చు. ఉదా:- పేపర్‌మిల్లులో బి.యం.ఎస్. నాయకత్వం నుంచి మనలను యూనియన్ నాయకులుగా ఎన్నుకోవడము, సిమెంట్ నగర్‌లో హెచ్.యం.యస్.లోను తుంగభద్ర ఇండస్ట్రీస్‌లో ఏ.ఐ.టి.యు.సి తోను పనిచేస్తూ మన కార్యకర్తలు నాయకత్వ స్థానములోనికి వచ్చారు. ఇదే సందర్భంగా బలంతో నిమిత్తం లేకుండా మనకే ప్రత్యేక సంఘంకావాలనే తపనతో ప్రత్యేక సంఘాలు పెట్టినచోట ఒంటరిగా మిగిలిపోయి విచ్ఛిన్నమయిపోయినాము.

2) ఉద్యమాన్ని విస్తరింపచేసే క్రమములో జిల్లా అంతటా వ్యాపించాలన్న తపనతో అనేకచోట్ల కార్మికసంఘాలు నిర్మించి మిలిటెంట్ పోరాటాలు నిర్వహించాము. ఎమ్మిగనూరు, ఆదోని, బేతంచర్ల లాంటి చోట్ల మనపై దాడులుచేస్తే మనకు సానుభూతిచూపే ప్రజానీకం లేకుండా తిరోగమనములో పడ్డాము. కనీసము మన ఆఫీసులను కూడా కాపాడుకొనలేకపోయాము అదే సందర్భములో చుట్టూ ప్రజాతంత్రఉద్యమమున్న సిమెంట్ నగర్ వంటి ప్రాంతములలోకార్మికులండగా రైతాంగము, యువజనులు నిలచిన సందర్భంగా ఎన్ని నిర్బంధములు వచ్చినను మన ఉద్యమాన్ని కాపాడుకొన్నాము.

3) చిన్న చిన్న పరిశ్రమల దార్లతో లారీ యజమానులతో సత్ - సంబంధాలు నెలకొల్పుకోవడము కాకుండా పెద్ద యజమానులతో పోరాడే స్థాయిలోనే వారితో పోరాడటంవలన కొన్ని పరిశ్రమలు మూతబడటం మధ్య తరగతి యజమానులకు కార్మికులకు మధ్య ఘర్షణలు జరగడంవల్ల మన ఉద్యమం నష్టపోయింది. అదే సందర్భంలో చిన్నయజమానులపట్ల పట్టువిడుపువైఖరితీసుకొన్న కర్నూలుపట్టణంలో పురోగమించాం.

4) సంఘీభావం:- మన కార్మికులపై ఒకచోట జరుగుచున్న దాడిని అన్ని సంఘాలలోను ఎప్పటికప్పుడు రిపోర్టుచేసే పద్ధతి వలనను, కార్మికులలో నిరంతర రాజకీయ చైతన్యాన్ని పెంచేందుకై జరిపిన కృషి వల్లను, ఒకరికి సంఘీభావంగా మరొకరు రంగంలోకి రావడం, పెద్దయెత్తున సంఘీభావనిధి అందించడం జరిగింది, లారీ కార్మికులు, పేపర్ మిల్లు కార్మికుల కృషి ప్రత్యేకించి చెప్పుకోదగినది.

సి.ఐ.టి.యు. నిధి:- సి. ఐ. టి. యు. అనుబంధ కార్మిక సంఘాలన్నీ కర్నూలులో సం॥నకు ఒకరోజు జీతం సి. ఐ. టి. యు. నిధికి ఇస్తున్నారు. లారీ కార్మికులు తమ సంఘానికి కట్టే సభ్యత్వ చందాతో పాటు ప్రతినెల రూ 1/- సి.ఐ.టి.యు. ఫండుకు ఇస్తారు.

—యం.ఏ.గఫూర్
కార్యదర్శి
ప్రదేశ్ సి.ఐ.టి.యు. కమిటీ

# రాజకీయ అర్థశాస్త్ర పరిచయం

రచన : ఆర్. పేజ్ ఆర్నాట్

## 3

## విలువ

కొన్ని వస్తువుల ధర అంతే ఎందుకుంటుంది? మరికొన్నిటి ధర వీటి ధరకన్నా తక్కువో ఎక్కువో ఎందుకుంటుంది? వాటి విలువెంత? అసలు విలువంటే ఏమిటి? ధర అంటే ఏమిటి? వీటి మార్పిడికి యిచ్చే డబ్బు అంటే ఏమిటి? అసలు మార్పిడి అంటే ఏమిటి? ప్రతి సమాజపు ఒకానొక అభివృద్ధి దశలో ఈ ప్రశ్నలే తలెత్తుతాయి.

ముందుగా "వస్తువులు" అనే ప్రశ్నను పరిష్కరించి వాటికి సమాధానం చెబుదాము. నూటయాభై సంవత్సరాల క్రితం ఆడంస్మిత్ అనే ఆయన "దేశాల సంపద" అనే పుస్తకం రాశారు సరుకుల సముదాయమే ఆ సంపద. కనుక సరుకులను గురించి ముందుగా తెలుసుకుందాం.

సరుకు అనేది మొదట ఏదో ఒక మానవ కోరికను సంతృప్తి పరచేదిగా వుంటుంది.

మరొక వస్తువుతో మార్పిడి పొందగలగడం రెండవ లక్షణం.

తనకు ఉపయోగం లేని ఒక ఉత్పత్తితో తన ఉత్పత్తిని ఎవరూ మారకం చేసుకోరు. అందువల్ల సరుకు ఉపయోగపడే వస్తువుగా వుండాలి. అందువల్ల దానికి ఉపయోగపు విలువ వుండాలి ఏ కాలంలోనైనా, ఎక్కడైనా ఈ ఉపయోగపు విలువలే సంపద సారం సంపదయొక్క స్థూలిక రూపం వేరు వేరుగా వుండవచ్చు

ఆ ఉపయోగపు విలువలు వస్తువులు లేదా సరుకులుగా మారినప్పుడు, అంటే ఇతర ఉపయోగపు విలువలతో మారకం జరిగినప్పుడు, ఆ మారకానికి ఏదో ఒక నిష్పత్తి వుండటం గమనిస్తాం.

అలా ఒక రకపు వుపయోగపు విలువలు మరికొన్ని రకాల ఉపయోగపు విలువలతో మారకం చెందడాన్ని మనం మారకపు విలువ అంటాము.

వివిధ కాలాల్లో, వివిధ ప్రదేశాల్లో యీ మారకపు నిష్పత్తి వేరువేరుగా వుండవచ్చు. అయితే ఒక సమయంలో ఒక ప్రదేశంలో మాత్రం అది ఒక నిర్దిష్టమైన తీరులోనే మారుతుంది. అంటే నిష్పత్తి ఒకేరకంగా వుంటుంది. ఒక ఉదాహరణ తీసుకుందాం. 20గజాల బట్ట 40 పౌండ్ల కాఫీతో మారకం అవుతుందనుకుందాం. అదే బట్ట ఒకకోటుతో గూడ మారకం అవుతుందనుకుందాం అప్పుడు ఆ కోటుకూడ 40 పౌండ్ల కాఫీతో మారకం చెందుతుంది కదా!

అయితే కోటు వేరు, కాఫీవేరు అయినా అవి ఒకదానికొకటి మారకం అవుతున్నాయి. అలా మారకం చెందాలంటే రెంటికీ మధ్య వాటి రెండిటిలోనూ ఏదో ఒక సారం ఒకటై వుండాలి.

అలాగే మనం అనేక రకాలైన వస్తువులను త్రాసులో వేసితూస్తాం. ప్రత్తి, ఇనుము తూస్తున్నామనుకోండి. అవి రెండు సరితూకం కావాలంటే వాటిమధ్య ఏదో రెంటికిగల సామాన్యలక్షణం వుంటుందని మనకు తెలుసు.

లక్షలాది వస్తువులు ఒకదానితో మరొకటి మారకం జరుగుతుండడం మనం ప్రతిరోజు గమనిస్తాం. యిలా మారే వస్తువులు విభిన్నమైనవి ఒకదాని కొకటి పోలికే వుండదు అయినా ఒకదానితో మరోటి మారకం చెందుతూనే వున్నాయి. ఇలా ఒక దానితో ఒకటి తూచి మారకం వేయబడుతున్న ఈ విభిన్న వస్తువుల మధ్యవుండే సామాన్య లక్షణం ఏమిటి? అవన్నీ మానవ శ్రమ ఫలితాలు కావడమే ఆ సామాన్య లక్షణం.

అన్ని సరుకుల మధ్యగల ఈ సామాన్య లక్షణాన్నే విలువ అంటాము. ఏ వస్తువు యొక్క విలువ అయినా ఆయా వస్తువులలో నిక్షిప్తమైవున్న శ్రమే. అలా శ్రమఅందులో నిక్షిప్తమై వున్నందునే దీనికి విలువ ఏర్పడుతున్నది నిక్షిప్తమైవున్న శ్రమ వివిధ సరుకులలో ఏ నిష్పత్తిలో వుంటుందో అదే నిష్పత్తిలో విభిన్నమైన సరుకులు ఒకదానికొకటి మారకం చెందుతాయి.

సరుకుకు రెండు అంశాలు వుంటాయి అని మనం చెప్పిన విషయం ఇప్పుడు గుర్తుచేసుకుంటే ఉపయోగపు విలువ, విలువ అనేవే ఆ రెండు అంశాలని యిప్పుడు అర్థమవుతుంది.

అలా విలువ కలిగి వుంటాయి గనుక, వస్తువులు శ్రమ జనితాలు. అయితే అది సామాన్య శ్రమే. ప్రత్యేక శ్రమకాదు. (వడ్రంగి, దర్జీ, చేనేత కార్మికుడు శ్రమ చేస్తారు. కానీ వారుచేసే శ్రమ విభిన్నమైనది. దానినే మనం ప్రత్యేక శ్రమ అంటాము-అను) ఈ ప్రత్యేక శ్రమ సరుకులోని భిన్నమైన వుపయోగ విలువను సృష్టిస్తుంది. కాని సరుకులన్నిటికీ గల సామాన్య లక్షణమైన విలువను సాధారణ మానవశ్రమే సృష్టిస్తుంది.

అది ఎలాంటిశ్రమ అనేదానితో సంబంధం లేదు. ఎవరిశ్రమ అనే దానితోనూ నిమిత్తం లేదు. అందువల్లనే మార్క్స్ సరుకులో నిక్షిప్తమై వున్న శ్రమ యొక్క రెండు ముఖాల మధ్య తేడాను స్పష్టంగా పేర్కొంటారు. ఒక వైపు ఒక రకమైన ప్రత్యేక శ్రమ (ఉదాహరణకు వడ్రంగి, దర్జీ) విభిన్న ఉపయోగపు విలువలను సృష్టిస్తుంది. మరోవైపు ఒక జాతి మొత్తం శ్రమలో భాగంగా పరిగణించబడే సాధారణ మానవ శ్రమ సరుకుల విలువను సృష్టిస్తుంది

ఒకానొక సరుకుకు ఉపయోగపు విలువను కలిగించే గుణాన్ని కాసేపు మరచిపోయి, మారకపు విలువగా మాత్రమే పరిగణించడం ప్రారంభిస్తే, సరుకుల రాశితో మనకు సంబంధముంటుంది. అయితే ఇలా దాని గుణాల నుండి వేరుచేసి చూడటమంటే దాని రూప భాగాల నుండి మాత్రమే చూడగలం. అంటే

కొవ్వొత్తిని పరిశీలిస్తున్నామనుకోండి. ఒక్క క్షణంపాటు కొవ్వొత్తిని, దానిని తయారు చేసిన వారిని గూడ మరచిపోతున్నామన్న మాట. ఒక భవనపు ప్రత్యేకతలను దాని, రూపును, దాన్ని నిర్మించిన బేల్దారిని గూడ మరచిపోతామన్నమాట. అప్పుడు మనకు బేల్దారియొక్క ప్రత్యేకశ్రమ గాక, మానవ శ్రమ మాత్రమే గుర్తు వుంటుంది.

శ్రమ నుండి విలువ ఏర్పడుతుంది కనుక దానిని తయారుచేసేందుకు పట్టే శ్రమనుబట్టి దాని విలువను నిర్ధారించగలం. అంటే ఒక వస్తువు తయారు చేసేందుకు పట్టేసమయాన్ని బట్టి వస్తువు విలువను నిర్ణయించగలం. కొందరు మరి కొందరికన్నా త్వరగా పని చేస్తున్నా ఫరవాలేదు. వారు చేసిన వస్తువు లన్నిటికీ ఒకే విలువ వుంటుంది. "ఉనికిలో నున్న సాధారణ వుత్పత్తి పరిస్థితిలో సరాసరి నైపుణ్యంతో మరియు శ్రమ తీవ్రతతో ఒకానొక వుపయోగపు విలువను వుత్పత్తి చేసేందుకు అవసరమైన శ్రమ కాలంతో" మనం వస్తువుల విలువను నిర్ధారించగలం.

దీనిని ఒకానొక వస్తువు వుత్పత్తికి "సాంఘికంగా అవసరమైన శ్రమకాలం" అని సూక్ష్మీకరించిచెప్పవచ్చు.

ఒక వుదాహరణను చూద్దాం. పవర్ లూమ్ రంగంలోకి వచ్చిన తర్వాత గూడ చేమగ్గం దాని సరసనే కొనసాగింది. పవర్ లూమ్ చేమగ్గం కన్నా ఎంతో వేగంగా పని చేస్తుందిగదా! చేమగ్గం కొనసాగినా, పవర్ లూమ్ వచ్చిన తర్వాత బట్టనేతకు, పవర్ లూమ్ నేతకు పట్టేకాలమే "సాంఘికంగా అవసరమైన కాలం"గా పరిగణిస్తారు. చేనేత కార్మికుని 8 గంటల పని విలువను కొలిచే సాధనం కాదు. గతంలో చేనేత కార్మికుడు 8 గంటలలో సృష్టించిన విలువను, ఇప్పుడు ఉదాహరణగా చెప్పుకోవాలంటే 16 గంటలు పని చేస్తేనే వుత్పత్తి చేయగలడు. చేనేతలో గంట పని ఇప్పటి సాంఘిక శ్రమ దృష్ట్యా అరగంట సాంఘిక శ్రమకే ప్రాతినిధ్యం వహిస్తుంది. అందువల్ల ఆ గంట పనివిలువ సగమైంది. అందువల్ల చేనేత రంగం నుండి నిష్క్రమించింది.

## విలువ - సాంఘిక సంబంధాలు

మనిషి ఏదో ఒకరకంగా మరొకరికోసం పనిచేయడం ప్రారంభించిన క్షణం నుండి వారిశ్రమ సాంఘిక రూపం దాలుస్తుంది. అయితే ఈ శ్రమ ఫలితం వివిధ కాలాల్లో విభిన్న రూపాలు ధరించవచ్చు. మనం వస్తూత్పత్తి ఆర్థిక విధానంలో బ్రతుకుతున్నాం. కనుక శ్రమఫలితం వస్తువుల రూపమే పొందడం అనివార్యమైన విషయంగా అతి సహజమైన విషయంగా మనంపరిగణిస్తాము. అయితే ఇది నిజంకాదు. వస్తూత్పత్తి, తత్ఫలితంగా మారకంలేని ఆర్థిక వ్యవస్థ దృక్పథంతో ఒకసారి పరిశీలిద్దాం. ఒక రైతుభూమి దున్ని ఫలితం అనుభవించే విధానం వుండేది. అతనితోటి వారుకొందరు గొర్రెలుకాచేవారు, వున్ని తీసేవారు. ఆ వున్నిదారంగాతయారు చేసేవారు. వారు తమ బట్టలుతామే నేసుకునేవారు, తమ గృహాలు తామే నిర్మించుకునే

వారు. తక్షణ వినియోగానికే తప్ప అమ్మకానికి ఏ వస్తువూ తయారయ్యేదికాదు ఒక జాతిలోని సభ్యునికి తాను జాతి అంతటి కోసం పని చేస్తున్నాననే విషయం స్పష్టమై వుండేది.

పాత భారతీయ గ్రామీణ జీవితం మరొక విధం.అందరూ రైతులుగానేజీవితంప్రారంభిం చారు. కాని వారిమధ్య శ్రమ విభజన క్రమేపీ అభివృద్ధి అయి కమ్మరి, గొర్రెల కాపరి, కుమ్మరి, కంసాలి వంటి వృత్తిపనివారుగా కొందరు తారుమారైనారు. వారందరూ గ్రామ అవసరాలను సృష్టించేవారు; గ్రామం వారిని పోషించేది.

అయితే వస్తువులు ఇతర వస్తువులతో మారకం కావడం ప్రారంభం కాగానే వస్తువులు అమ్మకం కోసం వుత్పత్తి ప్రారంభించగానే అంటే అవి సరుకులుగా తయారు కాగానే మనం ఒకరకమైన సరుకుల వుత్పత్తి సమాజంలో అడుగుపెట్టాము.

అలాంటి సమాజంలో సహితం శ్రమ యొక్క సామాజిక స్వభావం ఉత్పత్తి యొక్క సామాజిక స్వభావం విడనాడడం జరుగదు. అలా విడనాడడం సాధ్యంకాదు. (ఉదాహరణకు ప్రపంచ వ్యాపితంగా జరిగే వుత్పత్తులపై లండన్ ఎలా ఆధారపడివుందో పరిశీలించండి) అయితే సామాజిక స్వభావం ఈనాడు మరుగున పడింది. ప్రతివారు అమ్మకానికి వస్తువులను అంటే సరుకులను ఉత్పత్తి చేస్తారు. తమ వుత్పత్తులను "మార్కెట్లోకి" తోస్తారు. అంతటితో సరి. చైతన్యయుతంగా వుత్పత్తులను సామూహికంగా క్రమబద్ధం చేసే పని ముగుస్తుంది.ఉత్పత్తి సామాజికస్వభావం గుడ్డిగా పనిచేసే "మార్కెట్ సూత్రంగా" కనిపిస్తుంది. ఉత్పత్తిదారుకు అది మారకపు విలువ మాత్రమే.

ఆర్థిక సంక్షోభాల గురించి పరిశీలించేటప్పుడు దీని ప్రాధాన్యతను పరిశీలిద్దాం;

గత శతాబ్దంలో ఈ శ్రమవిలువసిద్ధాంతం స్థానే అనేక సిద్ధాంతాలు వివరించారు. అనే విషయం గమనించండి. అయితే ఈ సిద్ధాంత లన్నీ విలువ స్పష్టమయ్యే సామూహికక్రమాన్ని దాచే ప్రయత్నాలు మాత్రమే. అవి విఫల మైనాయి.



## స్వాహారాయుళ్ళ రాజ్యం

యు పి. ప్రభుత్వం కొన్ని పరిశ్రమలు నడుపుతున్నది. రు. 376.85 కోట్ల పెట్టుబడి వుండే ఈ సంస్థల నుండి డివిడెండ్లు వడ్డీ రూపంలో ప్రభుత్వ ఖజానాకు 1980_81న వచ్చిన ఆదాయం ఒకశాతంకన్నా తక్కువట.

ఇందుకు కారణం ఏమిటో తెలుసా?

ఈ నిధులను దుర్వినియోగం చేశారు. తక్కువ ఖర్చుపెట్టి మురిగిపోనిచ్చారు.కొన్ని సందర్భాలలో అనవసరమైన దుబారా జరిగింది. మొత్తం అసమర్థవంతంగా నిర్వహణ జరిగింది.

ఇలాంటి చర్యలను ఆడిటర్ జనరల్ రిపోర్టు కోకొల్లలుగా పేర్కొంది.

## సమర్ ముఖర్జీ వ్యాసం

(18వ పేజీ తరువాయి)

ఒక క్రొత్త పంథాలో ముందంజ వేసింది ఎనిమిది కేంద్ర ట్రేడ్ యూనియన్లు, ఉద్యోగులకు, కార్మికులకు సంబంధించిన 40 అఖిల భారత ఫెడరేషన్లు కలిసి ఒక సదస్సు నిర్వహించి ఐక్యపోరాటాల వేదికగా జాతీయ ప్రచారకమిటీని ఏర్పాటుచేశాయి పార్లమెంటు సమావేశం ప్రారంభమయ్యే ఆగస్టు 17వ తేదీని అఖిలభారత నిరసన దినంగా చీకటి రోజుగా ఈ కమిటీ ప్రకటించింది. పార్లమెంటు ఎదుట బోట్ క్లబ్ వద్ద ఆ రోజు బ్రహ్మాండమైన ప్రదర్శన జరిగింది. ఈ సమావేశంలో కేంద్ర కార్మికసంఘ నాయకులు ప్రసంగించారు. సమర్ ముఖర్జీ నాయకత్వంలో కేంద్ర ట్రేడ్ యూనియన్ నాయకులు స్పీకరును కలిసి ప్రదర్శనలో ఆమోదించిన తీర్మానం ప్రతిని అందజేశారు. ఈ సమస్యను లోక్‌సభలో కూడా లేవనెత్తారు.

బిల్లు ప్రవేశపెట్టిన క్షణం నుంచి లోక్‌సభలో భీషణమైన పోరాటం జరిగింది. బిల్లు చర్చించే సమయంలో, ఆమోదించే సమయంలోను పార్లమెంటు రెండు సభల్లో సుదీర్ఘమైన పోరాటం జరిగింది. లోక్‌సభలో చర్చ 17 గంటలపాటు వ్యవధిలేకుండా జరిగింది. బిల్లులో ప్రతి క్లాజును పట్టుదలగా ప్రతిఘటించటంవలన రాత్రంతా చర్చ జరిగింది. మరునాడు పొద్దున 5 గంటలకు మొత్తం ప్రతిపక్ష సభ్యులు నిరసనగా వాకౌట్ చేశారు బిల్లుకు 506 సవరణలు ప్రతిపాదించారు మొత్తం 16 క్లాజులలో ప్రతి క్లాజుకు సంబంధించి ఓటింగ్ జరిగింది సి పి ఐ. (ఎం) సభ్యులు 22మంది, సి పి ఐ సభ్యులు 5గురు, ఫార్వర్డు బ్లాకు సభ్యులు ముగ్గురు, జనతా సభ్యులు ఇద్దరు, ఒక ఇండిపెండెంటుసభ్యుడు సవరణలపై ప్రసంగించారు రాజ్యసభలో కూడా ఈ విధంగానే సుదీర్ఘ పోరాటం రాత్రంతా జరిగింది.

ప్రభుత్వం పట్టుదలగా ఎలాగైనా సరే, బిల్లు అంగీకారం కోసం తాపత్రయపడటానికి గల బలమైన కారణాలు తరువాత జరిగిన పరిణామాలు తేటతెల్లం చేశాయి. ఆ బలమైన కారణాలు అంతర్జాతీయ ద్రవ్యనిధి నుంచి అప్పు, దానితో కూడిన హీనమైన షరతులు.

పార్లమెంటు ఎదుట నవంబరు 23 న కార్మిక వర్గం చరిత్రాత్మకమైన ప్రదర్శన జరిపింది కార్మికవర్గం రైతులు, వ్యవసాయ కార్మికులు మొదలైనవారి కీలక సమస్యలైన అధికధరలు, నాసాచట్టం మొదలైనవి ప్రదర్శనలో సమస్యలైనప్పటికీ ప్రధానంగాఅత్యవసర సర్వీసుల నిర్వహణా చట్టం ప్రకారం ప్రభుత్వం సమ్మె హక్కును నిషేధించే విషయంపై ఈ ప్రజా నిరసనప్రదర్శన జరిగింది. సమ్మెహక్కును నిరాకరించిన ఈ నల్ల చట్టానికి తగిన విధంగా ప్రతిఘటన, నిరసన తెలపాలంటే దేశవ్యాప్త సార్వత్రిక సమ్మెచేయటమే సరైనపద్ధతని ప్రదర్శనలో ప్రకటించారు. అందువలన మహత్తరమైన ఈ పిలుపునను సరించే కార్మికవర్గం జనవరి 19న బ్రహ్మాండమైన సమ్మెచేసింది. పశ్చిమ బెంగాల్, బీహార్ మొదలైన రాష్ట్రాలలో ప్రజలు కూడా సమ్మెలో పాల్గొని బంద్‌లు, హర్తాళ్లు నిర్వహించారు: ప్రభుత్వం పెద్ద ఎత్తున దమనకాండ వేధింపుచర్యలు కొనసాగించింది. నేడు ప్రజాతంత్ర ఉద్యమాలను, ట్రేడ్ యూనియన్ ఉద్యమాలను అణచటానికి ఎస్మా చట్టాన్ని తరచుగా ఉపయోగిస్తున్నారు.

వర్గప్రయోజనాలు, వర్గ దృక్పథం వలన ఏర్పడినబలవత్తర పరిస్థితులలో కాంగ్రెసు (ఐ) ప్రభుత్వం పారిశ్రామిక వివాదాలకు, ట్రేడ్ యూనియన్ హక్కులకు సంబంధించిన 4 బిల్లులను ప్రవేశపెట్టినది. చాలాతీవ్రమైన ప్రతిఘటన వున్నప్పటికీ రెండు బిల్లులు పార్లమెంటు ఆమోదం పొందాయి. మిగతా రెండు బిల్లులు ప్రస్తుత పార్లమెంటు సమావేశంలో ఆమోదం పొందటానికి తయారుగా వున్నాయి. పారిశ్రామిక వివాదాల (సవరణ) బిల్లు, వేతనాలు చెల్లింపు (సవరణ) బిల్లు ఆమోదంపొందాయి పారిశ్రామిక సంబంధాల బిల్లులో వున్న కార్మిక వర్గ వ్యతిరేక నిబంధనలన్నీ పారిశ్రామిక వివాదాల (సవరణ) బిల్లులో ఉన్నాయి. ఆ బిల్లుకు వ్యతిరేకంగా నవంబరు 19, 1978న బ్రహ్మాండమైన సదస్సు నిర్వహించి నిరసన తెలిపాము. పారిశ్రామిక వివాదాల (సవరణ) బిల్లు అదివరకు సుప్రీంకోర్టు, ఆస్పత్రులు, విద్యా సంస్థలను 'పరిశ్రమ' నిర్వచనం పరిధిలో చేరుస్తూ ఇచ్చిన తీర్పును ఉల్లంఘిస్తోంది. కాంగ్రెసు ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఈ బిల్లులో మరికొన్ని తరగతుల సంస్థలను కూడా పరిశ్రమనిర్వచనంనుంచితొలగించారు. ఈ బిల్లువల్ల రైల్వే, పోస్టు అండ్ టెలిగ్రాఫ్, రక్షణశాఖ, బ్యాంకులు, ఇన్సూరెన్సు, స్టీలు, బొగ్గు, భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్ మొదలైన సంస్థలలో కార్మికులకు నష్టం కలుగుతుంది. యూనియన్ సభ్యత్వం చెక్-ఆఫ్ పద్ధతి అంటే జీతాల నుంచి యాజమాన్యం వసూలుచేసే పద్ధతిని బిల్లు ద్వారా ప్రవేశపెట్టటం వలన మేనేజిమెంట్ల తొత్తు యూనియన్లను ప్రోత్సహించటానికి వీలవుతుంది.

ట్రేడ్‌యూనియన్ (సవరణ)బిల్లు వలన అధికారులకు యూనియన్లను ఏలే అధికారం లభిస్తుంది. హాస్పిటల్ బిల్లు ప్రకారం ఆస్పత్రులలోను, విద్యా సంస్థలలో, పరిశోధనా సంస్థలలో సమ్మెలు నిషేధించబడినాయి. సమస్యలపరిష్కారానికి యజమానులు నామినేట్ చేసిన సభ్యులతో కూడిన కమిటీనొకదానిని నిర్బంధంగా ఏర్పాటు చేస్తారు. ఈ రెండు బిల్లులు పార్లమెంటులో ఆమోదం పొందబోతున్నాయి.

కార్మిక వ్యతిరేక చట్టాలకు వ్యతిరేకంగా పార్లమెంటులో పోరాటం కొనసాగుతోంది. బయట కూడా నిరసనోద్యమాలు సాగుతున్నాయి.

సమష్టిబేరసూత్రంపునాదిగా బొంబాయిలో రెండున్నర లక్షల మంది మిల్లు కార్మికులు వీరోచితంగాకొనసాగిస్తున్న సుదీర్ఘ పోరాటం గురించి పార్లమెంటులో పదే పదే ఒత్తిడి తెచ్చి చర్చలుచేస్తున్నాం. బ్యూరో ఆఫ్ పబ్లిక్ ఎంటర్‌ప్రైజెస్ ఆదేశాలు ద్వైపాక్షిక సంభాషణలకు చాలా చోట్ల విఘాతం కలిగించి, ద్వైపాక్షిక చర్చల సూత్రాన్నే వ్యతిరేకిస్తున్నాయని పార్లమెంటులో నిరసన తెలియచేస్తున్నాం. అనేక సందర్భాల్లో కార్మికుల హక్కుల రక్షణ గురించి పార్లమెంటులో చర్చలు జరుగుతున్నాయి.

ప్రజాతంత్ర హక్కుల కోసం పార్లమెంటులో జరిగేపోరాటానికి నానాటికీ ప్రాముఖ్యత హెచ్చుతోంది. రాబోయే రోజులలో నిరంకుశత్వ ప్రమాదం పెరుగుతోంది కాబట్టి. ఈపోరాటానికి మరింత ప్రాముఖ్యతవున్నది. నిరంకుశత్వాన్ని ఓడించటానికి పార్లమెంటు లోపల, బయటా జరిగే పోరాటాల సమన్వయం అవసరం. అప్పుడే ప్రజాస్వామ్యం బలపడుతుంది కాని ప్రజాస్వామ్యం కోసం, సాంఘిక, ఆర్థిక మార్పుల కోసం జరిగే ప్రధాన పోరాటం పార్లమెంటు వెలుపలే జరగాలి దానికి కార్మికవర్గం నాయకత్వం వహించాలి

★

# సమైక్యపోరాటాల సాధనంగా రూపొందుతున్న జాతీయ ప్రచార కమిటీ



ఇందిరాగాంధీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత, కార్మికవర్గంమీద, మధ్య తరగతి ఉద్యోగులమీద తీవ్రదాడులు ప్రారంభించిన సందర్భంలో కార్మికసంఘాలజాతీయ ప్రచార కమిటీ ఏర్పడింది. అత్యవసర వస్తువుల ధరలు విపరీతంగా పెరగడం, ద్రవ్యోల్బణం ఏర్పడటంవలన కార్మికవర్గ యొక్క జీవన ప్రమాణాలు పడిపోవడమేగాక వారి జీవన పరిస్థితులు దుర్భరమయిపోయాయి. అందుచేతనే కేంద్ర కార్మిక సంఘాలు, పరిశ్రమల వారీ ఫెడరేషన్లు ప్రభుత్వంయొక్క ఈ విధానాలకు వ్యతిరేకంగా ఉమ్మడి ప్రతిఘటనకు గల అవసరాన్ని గుర్తించాయి. బొంబాయిలో 1981 జూన్ 4 న జరిగిన సదస్సు దేశవ్యాపితంగా కార్మికుల సాధారణ భావాలను ప్రతిబింబిస్తుంది. వివిధ పరిశ్రమలకు చెందిన మూడువేల మందికిపైగా డెలిగేట్లు హాజరయ్యారు. భారతదేశ కార్మిక వుద్యమ చరిత్రలోనే మొట్టమొదటిసారిగా ఒక కోటికి పైగా కార్మిక సంఘ సభ్యత్వానికి ప్రాతినిధ్యం వహిస్తున్న ఎనిమిది కేంద్ర కార్మిక సంఘాలు, నలభై జాతీయ ఫెడరేషన్లు సదస్సులో పాల్గొన్నాయి. ఈ సదస్సులో పాల్గొన్న కార్మిక సంఘాలకు ఈ ఉమ్మడికలయికే ఒకరకమైన విశ్వాసాన్ని కలిగించింది.

ఈ సదస్సుయొక్క ఇంకొక ముఖ్యమైన అంశమేమంటే కార్మికవర్గం యొక్క సాధారణ ఆర్థిక డిమాండ్లను బలపరచటమే కాక కేంద్రప్రభుత్వం యొక్క కార్మికవర్గ వ్యతిరేక పాలసీలను తీవ్రంగా విమర్శిస్తూ ఈ విధానాలనువ్యతిరేకించడానికి దేశవ్యాపితంగా చేయవలసిన పోరాటాలఆవశ్యకతను నొక్కి వక్కాణించింది. కేంద్రప్రభుత్వం యొక్క గుత్తపెట్టుబడిదారీ అనుకూల, భూస్వామ్య అనుకూల విధానాలను ఈ సదస్సు కార్మిక వర్గ వ్యతిరేక, ప్రజావ్యతిరేక విధానాలుగా అభివర్ణిస్తూ వాటిని ప్రత్యేకంగా ఖండించింది. ఈ విధానాలకువ్యతిరేకంగా పోరాడకుండాను వాటిలో మార్పు తీసుకునిరాకుండాను దేశంలోని కార్మికవర్గం ఇతర పీడిత ప్రజానీకం ముఖ్యమైన తమ కొన్ని ఆర్థిక డిమాండ్లను కూడా సాధించుకొనజాలదని సదస్సు నొక్కి వక్కాణించింది ఈ విధానాలకువ్యతిరేకంగా జరిగే పోరాటంలో మొత్తం కార్మికవర్గ ఐక్యత యొక్క ప్రభావం వారి రోజువారీ పోరాటాలమీద ఉండి తీరుతుంది.


**ఎమ్. కె. పాంథే**

కార్యదర్శి

సి. ఐ. టి. యు.


బొంబాయి సదస్సుయొక్క ఇంకొకముఖ్యమైన అంశమేమంటే మొత్తం సంఘటిత కార్మిక ఉద్యమం అంతా కూడా మొట్టమొదటిసారిగా రైతుల సమస్యలను బలపరచడమే కాకుండా రైతుల ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలు ఇవ్వవలసినదిగా డిమాండు చేసింది. అదే కాకుండా పేదరికపుస్థాయికంటే తక్కువగా వేతనం పొందుతున్న వ్యవసాయకార్మికుల కనీస వేతనాన్ని పెంచవలసిందిగా సదస్సు డిమాండు చేసింది అన్ని తరగతుల సాధారణ ప్రజానీకాన్ని దెబ్బతీసే విధంగా ఉన్న కేంద్రప్రభుత్వం యొక్క ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా జరగవలసిన పోరాటం శక్తివంతమైనదిగా ఉండాలంటే ఇతర తరగతుల ప్రజానీకం యొక్క డిమాండ్లను కూడా బలపరచవలసిన అవసరాన్ని అన్ని కేంద్రకార్మిక సంఘాలు గుర్తించాయి.

ఇంతకుముందే చెప్పినట్లుగా ఫ్యాక్టరీ కార్మికులు, రైల్వే కార్మికులు, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వోద్యోగులు, డిఫెన్సు కార్మికులు, గని కార్మికులు, టీ, కాఫీ తోటల కార్మికులు, ఉక్కు, వస్త్ర, ఇంజనీరింగు పరిశ్రమలలోని కార్మికులు, రేవు కార్మికులు మొదలుగా గల అన్ని తరగతుల కార్మికులు సదస్సులో పాల్గొన్నారు. కొన్ని కొన్ని ఆఫీసర్ల సంఘాలు కూడ సదస్సులో పాల్గొని సదస్సులో లేవనెత్తబడిన డిమాండ్లను సమర్థించాయి. బొంబాయి సదస్సు యొక్క నిర్ణయాలు దేశవ్యాపితంగా కార్మిక సంఘ ఉద్యమంలో విస్తృతమైన, విప్లవాత్మకమయిన మార్పును తెచ్చాయి. తరువాత జరిగిన రాష్ట్రస్థాయి సదస్సులలో ఈ నిర్ణయాలను విస్తృతంగా ప్రచారం చేయడం వలన అఖిలభారత ఐక్య ఉద్యమాలకు అది దారి తీసింది.

1981 నవంబరు23న పార్లమెంటుముందు ఉమ్మడి సమస్యలమీద జరిగిన ప్రదర్శన కార్మికవర్గం యొక్క అతి పెద్ద ప్రదర్శన అని చెప్పవచ్చు. ఈ ప్రదర్శన బొంబాయి సదస్సు యొక్క నిర్ణయాలను పునరుద్ఘాటించడమే కాకుండా దేశంలోని అన్ని పరిశ్రమలలోను 1982 జనవరి 19న ఒకరోజు సమ్మెకు పిలుపునిచ్చింది. ఈ సమ్మె విఫలమైందని అధికార యంత్రాంగం ఎంత ప్రచారం చేసినప్పటికీ దేశం మొత్తం మీద ఒక కోటి ఇరవై లక్షల మంది ఉద్యోగులు, కార్మికులు ఈ సమ్మెలో పాల్గొనటాన్నిబట్టి అది ఎంత దిగ్విజయమైందో వెల్లడవుతోంది. అనేక రాష్ట్రాలలో సమ్మెతోపాటుగా బొంబాయి సదస్సు యొక్క నిర్ణయాలకు మద్దతుగా బందులు కూడ నిర్వహించబడ్డాయి. ఈ మొత్తంకార్యక్రమంలో వ్యవసాయ కార్మికులు కూడా పాల్గొనటం ఒక విశేషం. సమ్మెరోజు జరిగిన కాల్పులలో మరణించిన 10మంది కార్మి

కులలో ముగ్గురు వ్యవసాయ కార్మికులు. యాజమాన్యాలు పెద్దఎత్తున కక్ష సాధింపు చర్యలకు పూనుకొన్నప్పటికీ, కార్మిక ఉద్యమం ఈ చర్యలనన్నింటికీ వ్యతిరేకంగా పోరాడి వాటిని విరమించుకొనేటట్లు చేసింది ఈ సమ్మెను ఆర్గనైజ్ చేసినందుకుగాను కోర్టు ఉత్తర్వు ప్రకారం 13 మంది ప్రభుత్వ ఉద్యోగులకు వ్యతిరేకంగా పాండిచేరి ప్రభుత్వము తీసుకొన్న చర్యలు మినహా మిగతా అన్ని కక్ష సాధింపు చర్యలూ రద్దు చేయబడ్డాయి.

భారత దేశంలో సామూహిక బేరసారాల హక్కులు, సంఘటిత హక్కులు కాలరాచి వేయబడుతున్నట్లు జాతీయ ప్రచార కమిటీ అంతర్జాతీయ కార్మికసంఘానికి ఒకనివేదికలో వివరించింది అంతర్జాతీయ కార్మిక సంఘ డైరెక్టరు-జనరల్ భారతదేశం సందర్శించినపుడు జాతీయ ప్రచార కమిటీ తరపున ఒక బృందం ఆయనను కలుసుకొనిభారతదేశంలో కార్మిక వర్గం యొక్క హక్కులపై పెరుగుతున్న దాడులను వివరించింది. ఫిర్యాదులను విన్న తరువాత, అంతర్జాతీయ కార్మికసంఘం అత్యవసర సర్వీసుల నిర్వహణా చట్టాన్ని విమర్శించడమేకాకుండాకార్మికవర్గహక్కులు సరిగా రక్షింపబడాలని అన్నది.

కేంద్ర కార్మిక సంఘాలతో సంప్రదించకుండా భారత ప్రభుత్వం పార్లమెంటులో ప్రవేశపెట్టిన నాలుగు కార్మికవర్గ వ్యతిరేక బిల్లులకు వ్యతిరేకంగా జాతీయ ప్రచారకమిటీ జరుపుతున్నపోరాటానికి కార్మికులలోనిఅన్ని తరగతులనుండి మంచి ప్రోత్సాహం, మద్దతు లభిస్తోంది. ఈ రాక్షస బిల్లులకు వ్యతిరేకంగా కార్మికవర్గతీవ్రనిరసనను తెలపటానికిఢిల్లీలో పార్లమెంటుముందు, వివిధ రాష్ట్ర రాజధానీ నగరాలలో, వివిధ పారిశ్రామిక కేంద్రాలలో గొప్ప ప్రదర్శనలు నిర్వహింపబడ్డాయి. ఈ బిల్లుల విషయంలో భారత ప్రభుత్వం అవి చట్టరూపంపొందేందుకు తదితరచర్యలుతీసుకొనినా, కార్మిక ఉద్యమం కార్మిక వర్గంలో ఈ బిల్లులకు వ్యతిరేకంగా అవగాహనతీసుకురాగల్గింది.

1982 సెప్టెంబరు 17న భారత ప్రభుత్వం కార్మిక చట్టాలకు వివిధ సవరణలు చర్చించేందుకు ఒక జాతీయ త్రైపాక్షిక సదస్సును పిలిచింది. కాని ప్రభుత్వం సరియైన చర్చలు జరగాలని నిజంగా భావించేటట్లయితే ఈ మధ్యనే ప్రవేశపెట్టిన బిల్లులను ఉపసంహరించుకోవాలని జాతీయ ప్రచార కమిటీ డిమాండుచేసింది. ప్రభుత్వం అలా చేయడానికి నిరాకరించినపుడు, జాతీయ ప్రచారకమిటీ ఆ సదస్సును బహిష్కరించడమేకాక దేశ వ్యాపితంగా ప్రభుత్వ కార్మికవర్గ వ్యతిరేక విధానాలకు నిరసనగా ప్రదర్శనలు జరుపవలసిందిగా కార్మికవర్గానికి పిలుపునిచ్చింది. సదస్సు జరుగుతున్న స్థలం దగ్గర ఇరవయి నాలుగు గంటల ధర్నా నిర్వహించబడింది.

రెండున్నర లక్షల మంది పాల్గొన్న బొంబాయి జౌళి కార్మికుల సమ్మె దేశం మొత్తంమీద ఇంతవరకు జరిగిన పారిశ్రామిక పోరాటాలలో అతి దీర్ఘమైనదీ, పెద్దదీ. వేతనాల పెంపుదల కొరకు, ఐ. ఎన్. టి. యు. సి. యూనియన్ అయినటువంటి రాష్ట్రీయ మిల్ మజ్దూర్ సంఘ్‌కు అక్రమంగా గుర్తింపు ఇవ్వడానికి వ్యతిరేకంగా పోరాడుతున్న బొంబాయి జౌళి కార్మికులకు మద్దతుగా దేశంలోని జౌళి కార్మికులందరూ 1982 డిసెంబరు 21న ఒకరోజు సమ్మె చేయవలసిందిగా జాతీయ ప్రచార కమిటీ పిలుపునిచ్చింది. ఇది జౌళి కార్మికులలో మంచి సానుభూతిని సంపాదించింది బీహారు ప్రెస్‌బిల్లుకు వ్యతిరేకంగా పోరాడుతున్న జర్నలిస్టులకు, బొంబాయి పోలీసులు వారి దీర్ఘకాలిక డిమాండ్లకోసంపోరాడుతున్నపుడు, దూరదర్శని ఉద్యోగులమీద ఎస్మా ఉపయోగింపబడినపుడు మరియు అనేక యితర సందర్భాలలో జాతీయ ప్రచార కమిటీ వారికి తన సంపూర్ణ సానుభూతిని, మద్దతును తెలిపింది.

కార్మికవర్గ హక్కులను భక్షించే చట్టాలయిన ఎస్మా, నాసాలకు వ్యతిరేకంగా జాతీయ ప్రచార కమిటీ కార్మికవర్గాన్ని సమీకరించింది. శ్రీమతి ఇందిరాగాంధీ 1982 సం॥రాన్ని ఉత్పాదకతా సంవత్సరంగా ప్రకటించినపుడు జాతీయ ప్రచార కమిటీ అటువంటి ఏకపక్ష నిర్ణయాన్ని వ్యతిరేకించడమే కాక కేంద్ర మంత్రివర్గం పిలిచిన కార్మిక సంఘ సమావేశాలను జాతీయప్రచార కమిటీలోని అన్ని కేంద్ర కార్మిక సంఘాలు బహిష్కరించాయి.

వేతన చర్చలకు సంబంధించి బి.పి.ఇ. ఇచ్చిన ఆదేశిక సూత్రాలకు వ్యతిరేకంగా పోరాడుతున్న 25 లక్షల ప్రభుత్వరంగ పరిశ్రమల కార్మికులకు మద్దతుగా జాతీయ ప్రచార కమిటీ బ్రహ్మాండమైన పాత్రను నిర్వహించింది.

జాతీయ ప్రచార కమిటీ ఆధ్వర్యంలో ఉక్కు, బొగ్గు, భారత్ హెవీఎలక్ట్రికల్స్‌లో సదస్సు నిర్వహించబడ్డాయి. ఇవి బి. పి. ఇ ఆదేశిక సూత్రాలకు వ్యతిరేకంగాదేశవ్యాపిత ఆందోళనకు దారి తీశాయి. 1982 అక్టోబరు 22, 23 తేదీలలో హైదరాబాద్‌లో జరిగిన అఖిల భారత ప్రభుత్వ రంగ పరిశ్రమల కార్మికుల సదస్సు కార్మికుల ఐక్యతను, ప్రభుత్వరంగ పరిశ్రమలలో కేంద్ర కార్మిక సంఘాల దృఢ విశ్వాసాన్ని తెలియజేస్తున్నాయి. ఆ సదస్సు యొక్క పిలుపుననుసరించి బి.పి ఇ. ఆదేశిక సూత్రాల రద్దుకు, 75 పరిశ్రమల్లో కుంటుపడిన వేతన చర్యలు పునరుద్ధరింపబడటం కోసమూ జనవరి 28, 1983న దేశ వ్యాపిత సమ్మె జరగవలసి ఉంది.

జాతీయ ప్రచార కమిటీ మార్గదర్శకత్వం వలన బొగ్గు కార్మికుల ఐక్యపోరాటం ఒక క్రొత్తమలుపు తీసుకొంది. ఏడు లక్షల బొగ్గు కార్మికులు బి.పి ఇ. ఆదేశిక సూత్రాలకు వ్యతిరేకంగానూ, సంయుక్తద్వైపాక్షిక కమిటీని నిరంకుశంగా పునర్ వ్యవస్థీకరించడం పట్ల నిరసనగానూ 1982 నవంబర్ 8న ఒకరోజు సమ్మెకు తలపడ్డారు. బొగ్గు పరిశ్రమలలో జనవరి 17 నుండి 19 వరకు ఇంకొక 72 గంటల సమ్మె నిర్వహించబడింది. ఇది దేశవ్యాపితంగా మంచి సానుభూతిని సంపాదించగలిగింది.

ప్రభుత్వ రంగ పరిశ్రమలలో పెరుగుతున్న కార్మిక ఉద్యమాల ఫలితంగా కేంద్ర ఆర్థిక శాఖామంత్రికి కేంద్ర కార్మిక సంఘాలను చర్చలకు పిలవక తప్పలేదు. చివరకు ప్రభుత్వరంగ పరిశ్రమలలో కార్మికులకు

(మిగతా 32వ పేజీలో)

# కష్టజీవులందరి హక్కులను ఎలుగెత్తిన వేదిక

# బెంగాల్ శ్రామిక మహిళలు

శ్రామిక మహిళలను సమీకరించే విషయంలో మన బలహీనత కనబడుతున్నది. ముఖ్యంగా అసంఘటిత రంగంలో ఈ బలహీనత బాగా కనపడుతున్నది. సంఘటిత పరిశ్రమలైన జనపనార, నూలు, ఇంజనీరింగ్ పరిశ్రమలలో మహిళా కార్మికుల సంఖ్య రిట్రెంచ్‌మెంట్ వంటి వాటి ద్వారా తీవ్రంగా తగ్గించబడుతున్నది. మహిళా కార్మికుల సమస్యలను తీసుకొనడంలో సి.ఐ.టి.యు. యూనియన్లను అవసరమైనంతగా కదిలించలేకపోయాము.

## శ్రామిక మహిళల సమస్యలు

పశ్చిమబెంగాల్‌లో టీ తోటలలో మహిళా కార్మికులు అత్యధికులు పని చేస్తున్నారు. ఇదికాక ఇంజనీరింగ్ పరిశ్రమల్లో వీరు ప్రధానముగా వున్నారు ముఖ్యంగా ఎలక్ట్రానిక్స్ పరిశ్రమలో వీరి సంఖ్య ఎక్కువ. జూట్, టెక్స్‌టైల్స్ పరిశ్రమలలో అతి కొద్ది మందే మిగిలారు.

టీ తోటల్లో సుమారు 50 శాతం మంది మహిళా కార్మికులు, టీ తోటల్లో ట్రేడ్ యూనియన్ ఉద్యమ ఆవిర్భావం నుండి మహిళాకార్మికులు ఎంతో ప్రఖ్యాత పాత్ర వహించారు. ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో పాల్గొన్నందుకు గతంలో అనేకమంది ఉద్యోగాలు పోగొట్టుకున్నారు. కుటుంబాలతో సహా వారిని తోటలనుండి తరిమివేసిన ఉదంతాలు సహితంఉన్నాయి నికృష్టమైన 'హటా బహార్' విధానపు కాటుకు వీరు బలయ్యేవారు. 1955లో డార్జిలింగ్ కొండలంతటా టీ తోటల కార్మికులు సమ్మెచేశారు. మార్గరెట్ హోప్ టీ ఎస్టేట్‌వద్ద పాశవికంగా పోలీసు కాల్పులుజరిగాయి. ఫలితంగా ఇద్దరు మహిళా కార్మికులతోసహా ఆరుగురు మరణించారు. 1973–74 మధ్య సమానపనికి సమానవేతనం సాధనకు పశ్చిమ బెంగాల్ టీ పరిశ్రమలో మహిళాకార్మికులు సుదీర్ఘ పోరాటం సాగించారు. విజయం సాధించినారు.

ఒక్క ముక్కలో చెప్పాలంటే పురుషులతో పాటు మహిళలు సహితం పోరాడిన చరిత్రే, టీ తోటల్లో ట్రేడ్ యూనియన్ ఉద్యమ చరిత్ర. అయితే ట్రేడ్ యూనియన్ల రోజువారి కార్యకలాపాలలో వారి పాత్ర తక్కువగా వుంది. ఇందుకు కారణాలు స్పష్టమే. వారుతమబిడ్డల పరిరక్షణలో పాల్గొనాలి. కుటుంబ నిర్వహణ బాధ్యత వారిదే.

ఈ యిబ్బందులను దృష్టిలో వుంచుకోవాలి. అయినా మహిళా కార్మికులకు ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో సాధ్యమైనన్ని బాధ్యతలు యివ్వాలి నాయకత్వ స్థానాలకు వారిని తీసుకురావాలి.

బొగ్గు గనుల్లో గూడా 10 శాతం మహిళలు ఉన్నారు. వారూ పురుషులతో బాటు ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో పాల్గొంటున్నారు.

సాధారణ ట్రేడ్ యూనియన్ డిమాండ్లు కాక, మహిళా కార్మికులకు వారి ప్రత్యేక డిమాండ్లు వున్నాయి. ఆఫీసుల్లో, కోర్టులలో, హాస్పిటళ్ళలో నర్సులుగా, ఆయాలుగా పనిచేసేవారికి గూడా వారి ప్రత్యేక డిమాండ్లు వున్నాయి. జీతాలు, అలవెన్సులు, మంచి పని పరిస్థితులవంటి సాధారణడిమాండ్లు మాత్రమే కాదు.

వారి ప్రత్యేక డిమాండ్లపై వివరణ అవసరం లేదు. కాని సి.ఐ.టి.యు. యూనియన్లు పనిచేసేచోట మహిళలు వుంటే అక్కడ మహిళా కార్మికుల సబ్ కమిటీని ఏర్పాటు చేయాలి. తద్వారా వారి డిమాండ్లపై ప్రత్యేక శ్రద్ధ కనపర్చాలి, వారిలో వుద్యమం నిర్మించాలి.

ఒకవిషయం స్పష్టంగా చెప్పాలి. మహిళా కార్మికులు వారి వారి యూనియన్లలోనే గాక మహిళా సంఘాల్లోసహితం చేరాలి. మహిళా సంఘపు మద్దత్తుతో తమ హక్కులకై పోరాడాలి. మహిళా కార్మికుల పాత్ర మహిళా సంఘం సభ్యులుగా వారి పాత్రతో వైరుధ్య పడరాదు. అంతేగాక ఇవి పరస్పర సహకారం అందించేవిగా వుండాలి.

-మనోరంజన్ రాయ్



# పోరాటాల మధ్యనున్న శ్రామిక మహిళలు

దేశంలో మహిళా ఉద్యమం, ముఖ్యంగా శ్రామిక మహిళా ఉద్యమం నానాటికీ బల పడుతున్నది. అత్యవసర వస్తువుల అధిక ధరలకు వ్యతిరేకంగా అయితేనేం, వరకట్న దురాచారానికి బలైన యువతుల కొరకయితేనేం, సమాన వేతనాల కయితేనేం తమ పిల్లలను తాము పనిలోకి వెళ్ళేటప్పుడు పెట్టేందుకు అవసరమయిన వసతి కొరకయితేనేం అన్ని వర్గాలలోని శ్రామిక మహిళలు ముందుకివచ్చి పోరాడుతున్నారు. సమాజంలో అట్టడుగునున్న బానిస స్త్రీలు, షెడ్యూల్డుకుల స్త్రీలు సహితం కనీస వేతనంకోసం కేంద్ర ప్రభుత్వ తో సహా యజమానులందరితోనూ పోరాడుతున్నారు గత మూ డే ళ్ళ లో నూ డాక్టర్లుగా, నర్సులుగా, టీచర్లగా, ప్రొఫెసర్లుగా పనిచేస్తున్న మహిళలెందరో గృహ వసతి, ప్రమోషన్లు భద్రత మొదలయిన డిమాండ్లతో వచ్చి ప్రదర్శనలు చేశారు.

ఒక వైపు మహిళా ఉద్యమాలు పెరుగుతున్నాయి. మరోవైపు ప్రజలలో సాంఘిక దురాచారాలను రూపుమాపాలన్న ఆలోచన పెరుగుతున్నది. ఫలితమే వరకట్న బిల్లు, వివాహ చట్టంలో సవరింపులు, శ్రామిక మహిళల శ్రేయస్సుపై బిల్లు మొదలయినవి. బిల్లులను ప్రవేశపెట్టడమే గాక, కమిటీలను నియమించడం, అందులో స్త్రీ పార్లమెంటు సభ్యులను నియమించడం కూడా జరిగింది. అయితే అన్యాయాన్ని ఎదిరించి జరుపుతున్న ఈ పోరాటాల నన్నిటినీ కేవలం సామాజిక సంస్కరణలకోసం జరుపుతున్న పోరాటాలుగా మాత్రమే చూడకూడదు. ఇవి భారత ప్రజలు ప్రజాతంత్రంకోసం, సోషలిజంకోసం చేస్తున్న పోరాటాలలో భాగాలే. అందుకనే వివక్షతకు వ్యతిరేకంగా, అసమానతలకు వ్యతిరేకంగా అర్ధఫ్యూడల్ భావాలకు వ్యతిరేకంగా సాగుతున్న ఈ పోరాటాలను క్రమబద్ధంగా నిర్మించాలి వాటికి ప్రజా పునాదిని సమకూర్చాలి.

## శ్రామిక మహిళలు జరిపిన వీరోచిత పోరాటాలు

గనులు, టెక్స్‌టైల్స్, ప్లాన్‌టేషన్ శ్రామిక మహిళలు యజమానులకు వ్యతిరేకంగా, పోలీసులకు వ్యతిరేకంగా, బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా వీరోచితంగా


శ్రీమతి విమలా రణదివే

అఖిలభారత శ్రామిక మహిళా

కో-ఆర్డినేషన్ కమిటీ

కార్యదర్శి


పోరాడిన ఘటనలు ఎన్నో ఉన్నాయి. 940 సం॥లో టెక్స్‌టైల్స్ పరిశ్రమలో జీతాలు పెంచమని డిమాండుచేస్తూచేసిన సమ్మెలో మహిళా కార్మికులు అతికీలకమయిన పాత్ర వహించారు. శ్రామిక మహిళలు వీధులలోకి వచ్చి ప్రదర్శనలు చేశారు మిల్లు ద్వారాల దగ్గర పికెటింగ్‌లుచేశారు సమ్మె విచ్ఛిన్నకారులను కొట్టారు. అంతేకాదు. అవసరమయినపుడు తుపాకి గుళ్ళను ఎదుర్కొన్నారు. లాఠీ ఛార్జీకి గురయ్యారు కూడా. వాళ్ళు అపారమయిన ధైర్య సాహసాలను ప్రదర్శించారు.



కోయంబత్తూరులో టెక్స్‌టైల్స్ పనివారు, పశ్చిమబెంగాల్‌లోని జనుము పనివారు కూడా ఈ రకమయిన ధైర్యసాహసాలనే ప్రదర్శించారు.

ఈరోజున నానాటికీ పెరుగుతున్న ఆర్థిక సంక్షోభం, మునుపెన్నడూ ఏఉద్యమాలలోనూ పాల్గొనని మహిళలను కూడా ఉద్యమాలలో పాల్గొనేట్లు చేస్తున్నది. 1981 ఫిబ్రవరిలో జమ్‌షెడ్‌పూర్‌లోని టిస్కో కంపెనీలోని 10,000 మంది కాంట్రాక్ట్ పనివారు సమ్మె జరిపారు. అందులో 2500 మంది స్త్రీలు, ఈ పోరాటంలో అత్యంత ధైర్యసాహసాలు ప్రదర్శించారు. అనేక త్యాగాలు చేశారు. తమ పసిపిల్లలను ఎత్తుకుని టిస్కో ప్రహరీలో ప్రొసెషన్‌లో పాల్గొన్నారు. ధర్నాలు చేశారు. అరెస్టయి జైళ్ళకి వెళ్ళారు. పోలీసులు కొంతమందిని కొట్టి ఈడ్చుకు వెళ్ళి అడవులలో, ఎక్కడో వదిలివేశారు.

బీడి పరిశ్రమలో అత్యధిక సంఖ్యాకులు స్త్రీలే ఆ పరిశ్రమలో యంత్రాలను ఉపయోగించడం ప్రారంభించగానే వారు అందుకు వ్యతిరేకంగా అనేక పోరాటాలు జరిపారు. కొందరు తమను నిరుద్యోగులుగా మార్చే ఆ యంత్రాల్ని తమ శత్రువుగా భావించి దానిని నాశనం చేయ బూనారు కూడా. చీరాల, అనపర్తి పొగాకు పరిశ్రమలో యంత్రాల్ని ఉపయోగించ నున్నప్పుడు కూడా ఆ విధంగానే స్త్రీలే అత్యధిక సంఖ్యలో ధర్నాలలోను, ప్రదర్శనల్లోనూ పాల్గొన్నారు. కాన్పూరులోని విక్టోరియా మిల్లులో స్త్రీ కాంట్రాక్టుపనివారు 1981 ఆగస్టు నెలలో సుదీర్ఘ పోరాటం ప్రారంభించారు. తమ ఉద్యోగాలను ఖాయపరచాలని వారి డిమాండ్. 33 నెలలు ఎడతెగని సుదీర్ఘ పోరాటం తర్వాత వారిని శాశ్వతకార్మికులుగా గుర్తించి ఖాయపరిచారు. ఢిల్లీలోని హిందూస్థాన్ కంప్యూటర్ కంపెనీలోని మహిళా కార్మికులు పోరాడారు. బాధాకరంగావున్న తమ పని పరిస్థితులను మెరుగుపరచాలని వారి డిమాండ్. 400 మంది యువతులు పాల్గొన్న ఈ పోరాటం రెండున్నర మాసాలు సాగింది.

1982 సం. జనవరిలో కర్నాటకలోని బీడీ కార్మికులు జరిపిన ఆందోళన ఎంతో గర్వంగా చెప్పుకోదగ్గది. ఈ కార్మికులలో అత్యధిక సంఖ్యాకులు ముస్లిమ్‌స్త్రీలు. వీరు ప్రావిడెంట్ ఫండ్ చట్టం తమకు వర్తింప చేయాలని కోరుతూ పోరాడారు. పికెటింగ్ తోనూ, ధర్నాలతోనూ పరిపాలనా యంత్రాంగాన్ని స్తంభింపజేయగలిగారు. అరెస్టులు జరిగాయి. అయినా చివరికి యజమానులకు బకాయిలతో సహా మొత్తం ప్రావిడెంట్ ఫండ్‌ను ఇవ్వక తప్పలేదు.

ఆ విధంగానే మహారాష్ట్రలోని ఇచాల్ కర్‌మాజీలో బీడీ పరిశ్రమలోనూ, పవర్ లూమ్‌లోనూ పనిచేసే కార్మిక మహిళలు

# శ్రామిక మహిళలను సమీకరించండి!

పోలీసుల అణచివేత చర్యలను ఎదుర్కొంటూనే జీతాల కోసం డిమాండు చేశారు. 198?లో 500 మంది పోలీసుల భార్యలు తమ భర్తల విడుదలను కోరుతూ నవగావ్ పోలీసు స్టేషన్ ముందు ప్రదర్శనలు జరిపారు. తమ న్యాయమైన కోర్కెలకై పోరాడిన పోలీసులను అరెస్టు చేసినప్పుడు యిది సాగింది.

మహిళా కార్మికులు యూనియన్‌ను నిర్మించుకునే తమ హక్కును కాపాడుకునేందుకు కార్యాచరణకు పూనుకున్న ఘటనలు కూడా ఉన్నాయి. ఫరీదాబాద్‌లోని జె. వి. ఎలక్ట్రానిక్స్‌లోని మహిళలు, ఖిలాయ్, రాజ్‌పురాలోని కార్మిక మహిళలు సి. ఐ. టి యు. మనుగడకోసం మేనేజిమెంటు ఐ ఎన్.టి.యు. సి. గూండాలకి వ్యతిరేకంగా పోరాడారు. మొత్తం 4000 మంది పనివారిలోనూ 500 మంది స్త్రీలు. పోలీసువారికి వ్యతిరేకంగా సి ఆర్.పికి వ్యతిరేకంగా పోరాడారు. గత మూడేళ్ళలోను ఆర్గనైజ్, అనార్గనైజ్డ్ పరిశ్రమలలోని ఎంతో వెనుకబడిన తరగతిలోని శ్రామిక మహిళలు సహితం ఐ ఎన్.టి.యు సి గూండాలకు వ్యతిరేకంగా, యాజమాన్యానికి వ్యతిరేకంగా పోరాడిన సంఘటనలెన్నో ఉన్నాయి. అప్పుడప్పుడూ కొన్ని డిమాండ్లను సాధించుకున్నారు కూడా.

అంతేకాదు ఈ మధ్యకాలంలో కేరళ, పశ్చిమ బెంగాల్‌లోని మధ్య తరగతి మహిళలేగాక, మద్రాసు, బొంబాయి, ఢిల్లీలలోని మధ్య తరగతి శ్రామిక మహిళలు సహితం తమ డిమాండ్లను సాధించుకునేందుకు, తమంతతాము, ఇతరులతో కలిసికూడా ఎన్నో పోరాటాలను సాగించారు ఎయిర్‌హోస్టెస్‌లు సాగించిన పోరాటం ఇందుకు తార్కాణం. తమ రిటైర్‌మెంటు వయసు విషయంలోను, సర్వీసు కండిషన్స్‌లోని వివక్షత గురించి పోరాడేందుకు సుప్రీమ్ కోర్టుకు కూడా వెళ్ళారు వీరు.

మొన్న మొన్న జరిగిన 109 రోజుల ఢిల్లీ టీచర్ల సమ్మెలోకూడా మహిళలు ఎంతో ప్రముఖపాత్ర వహించి ప్రమోషన్ గురించి, గృహవసతి గురించి పోరాడారు.

కేరళ, తమిళనాడు, పశ్చిమ బెంగాల్‌లోని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు తమ డిమాండ్లను పూర్తి చేసుకొనేందుకు పోరాడారు. ఎ.ఐ డి డబ్ల్యు ఎ. పిలుపునందుకొని పశ్చిమ బెంగాల్‌లోని అనేకమంది మహిళలు తమకు ఉద్యోగాలు కావాలని కామ్రేడ్ జ్యోతిబసు ముందు ప్రదర్శనలు జరిపారు.

## తీవ్ర ఆర్థిక సంక్షోభమే మహిళలను పోరాటాల్లో పాల్గొనేటట్టు చేస్తున్నది

శ్రామిక మహిళల కో-ఆర్డినేషన్ కమిటీ శ్రామిక మహిళల భద్రత, రక్షణ, తీవ్ర ఆర్థిక సంక్షోభం వలన వస్తున్న అనేక ఆర్థిక దాడులకు వ్యతిరేకంగా తమ డిమాండ్లను పెట్టుకోవడంవలననే శ్రామిక మహిళలు నేడున్న ఫ్యూడల్ బూర్జువా వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడగలుగుతున్నారు ఇంటా, బయటా వారికున్న హీనమైన స్థానాన్ని గురించి చెప్పుకోగలుగుతున్నారు.

సి.ఐ.టి.యు. కో-ఆర్డినేషన్ కమిటీని నిర్మించేందుకు ముందంజ వేసింది. ఫలితంగా ఈరోజు శ్రామిక మహిళలు వివిధ రంగాల్లో వారివారి డిమాండ్ల కొరకు పోరాడగలుగుతున్నారు. అంతేగాక సి.ఐ.టి.యు. ఏ సమస్యనయినా తీసుకున్నప్పుడు మహిళలు కూడా ముందుకు వచ్చి ఆ కార్యక్రమాల్లో పాల్గొనగలుగుతున్నారు. నిజానికి శ్రామిక మహిళలకు కావల్సినంత సహాయాన్ని గైడెన్స్‌ని గాని యూనియన్లు యివ్వలేకపోతున్నాయి.

శ్రామిక మహిళా ఉద్యమాలు కార్మిక వర్గ ఉద్యమాలలోను, ప్రజాతంత్ర ఉద్యమాలలోనూ భాగమే. వారి పూర్తి మద్దతు లేనిదే ఏ ఉద్యమమూ సఫలీకృతం కాదు. బ్రిటన్, జపాన్, ఫ్రాన్స్ మొదలయిన పెట్టుబడిదారీ దేశాలలో సహితం స్త్రీలు సమాన వేతనం కోసం వివక్షతకు వ్యతిరేకంగానూ, వాళ్ళ యూనియన్‌ల స్త్రీల విభాగాలు ఏర్పరచుకొని పోరాడుతున్నారు.

వివిధ దేశాలలో శ్రామికమహిళల సదస్సులు నిర్వహించేందుకు డబ్ల్యు.ఎఫ్.టి.యు. పిలుపునిచ్చింది. అంతర్జాతీయ కార్మికోద్యమంలో శ్రామిక మహిళల సమస్యలకిస్తున్న ప్రాధాన్యతను ఇందుమూలంగా మనంగుర్తించవచ్చు. అందువల్ల సి ఐ.టి.యు.తో సహా అన్ని యూనియన్లు శ్రామిక మహిళలను తమతో పాటు కార్మికోద్యమంలో ముందుకు తీసుకొనిపోవడంలో ప్రధానపాత్ర వహించాలి.



# సోవియట్ యూనియన్‌లో కార్మిక చట్టాలు

ఏ దేశంలోనైనా కార్మిక చట్టాలు ఆ దేశాన్ని పరిపాలిస్తున్న రాజకీయ పార్టీ సిద్ధాంతానికి అనుగుణంగానే వుంటాయి. ఒక రాజకీయ పార్టీ సిద్ధాంతం పెట్టుబడిదారీ విధానమైతే దానికి అనుగుణంగానే కార్మిక చట్టాలు చేయబడతాయి. అలాకాకుండా కమ్యూనిస్టుసిద్ధాంతమైతే సోషలిస్టు దృక్పథంతోనే కార్మిక చట్టాలు చేయబడతాయి.

సోవియట్ రష్యాలో విప్లవానికి ముందు పెట్టుబడిదారీ విధానం అమలులో వుండేది. అందువలన కార్మికులు ఎక్కువగా దోపిడీకి గురిచేయబడేవారు. చాలా తక్కువ జీతమునకు రోజుకు 12 నుండి 14 గంటలు పని చేస్తూ వుండేవారు. కార్మికులకు వైద్య సౌకర్యములుగాని, భీమా సౌకర్యములుగాని, భద్రతా పరిస్థితులుగాని ఏమీ వుండేవికావు. 1917 సం॥లో రష్యాలో విప్లవం విజయవంతం అయినతర్వాత కార్మికుల పరిస్థితులు పూర్తిగా మారిపోయినవి. 1918జూన్ నెలలో కార్మికులకు 8 గంటల పని విధానమును ప్రవేశపెట్టారు. 1918 డిశంబరులో మొదటి లేబర్ కోడ్ పాస్ చేసినారు. ఆ చట్టంలో కార్మికులకు పనిచేయు హక్కు గ్యారంటీ చేశారు. కార్మికునికితనశక్తి సామర్థ్యమునకు అనుగుణంగా అతనికి రష్యాలో ఏ రాష్ట్రంలోనయిననూ వుద్యోగము చేయు హక్కు గలదు. తర్వాత 1922లో రెండవ లేబరు కోడ్‌ను ప్రవేశపెట్టినారు. అందులో కార్మికుల జీవిత భీమా పథకం క్రింద వర్కర్స్ జీతంనుండి కట్టరు. ప్రభుత్వమే కార్మికుని తరపున భీమాకు సంబంధించినడబ్బును చెల్లిస్తుంది. మహిళా కార్మికులకు 55 సంవత్సరముల తర్వాత, పురుష కార్మికులకు 60 సంవత్సరముల తర్వాత పెన్షన్ లభించును. 1970 జూలై 15న మూడవ లేబర్ కోడ్ పాస్ అయినది. ఈ మూడవ లేబర్ కోడ్ ద్వారా కార్మిక సంఘమునకు మరిన్ని విస్తృత అధికారములు లభించినవి. కార్మిక చట్టములు ఏ విధంగా అమలు చేయబడుచున్నవో పరిశీలించి అమలుచేయు అధికారములు కార్మిక సంఘమునకు లభించినవి. అంతేగాక లేబరు కోడ్‌లను తయారుచేయునపుడు ట్రేడ్‌యూనియన్‌ల కేంద్ర కౌన్సిల్‌లేబర్ కోడ్‌చట్టముల చిత్తుప్రతిని తయారుచేసి సుప్రీం సోవియట్ (పార్లమెంటు) అనుమతికి పంపుదురు. ఈ విధముగా కార్మిక చట్టములను ఆ దేశములో కార్మిక సంఘములే తయారుచేస్తున్నవి. కావుననే అక్కడ మన భారత దేశములో కార్మికుడు నమ్మలేని చట్టములు, సౌకర్యాలుఉన్నవి. ఉదాహరణకు ఆర్టికల్ 9 లేబరు చట్టంలో కార్మికులకు పనిచేసే హక్కు గ్యారంటీ చేయబడినది. ఆర్టికల్ 20లో కార్మిక సంఘాలకు (జిల్లా స్థాయి సంఘములకు) మాత్రమే ఒక ఫ్యాక్టరీ మేనేజరును కార్మిక చట్టములను అమలు చేయుటలేదు అనే నేరముపైగాని లేదా నిరంకుశంగా కార్మికులను వేధించుచున్నాడనే నేరముపై కాని అతనిని ఉద్యోగము నుండి తొలగించవచ్చును. అంతేకాకుండా అతడు లేబర్ చట్టములను తీవ్రంగా ఉల్లంఘించి

> **ఎస్. గంగాధరరెడ్డి**
> **కార్యదర్శి**
> **విశాఖ నగర**
> **సి.ఐ.టి.యు. కౌన్సిల్**

నచో జిల్లా స్థాయి యూనియన్‌లు ఫ్యాక్టరీ మేనేజరుపై క్రిమినల్ కేసులుపెట్టి జైలుకు కూడా పంపవచ్చు అంతేకాకుండా ఫ్యాక్టరీ మేనేజరు కార్మికుని అన్యాయముగా పని నుండి తొలగించినచో, కార్మికుడు పనినుండి తొలగింపబడ్డ కాలమునకు ఫ్యాక్టరీ మేనేజరు స్వంతముగా కార్మికునకు జీతము ఇచ్చుకొనవలసివచ్చును. ఆర్టికల్ 93ప్రకారం కార్మికుని పని నుండి తొలగించవలెనన్న యూనియన్ అనుమతి తీసుకొనవలెను.

అచ్చట కార్మికునకు పూర్తి ఉద్యోగ భద్రత కలిగింపబడినది. ఆర్టికల్ 21 కార్మికులకు వారమునకు 41 గంటల పని విధానంను అమలుపరిచినది. 16 సంవత్సరముల నుండి 18 సంవత్సరముల వరకు వయసుగల కార్మికులకు వారమునకు 36 గంటలు మాత్రమే పని. ప్రమాదకరమైన పరిస్థితులలో పని చేయు కార్మికులకు కూడా వారమునకు 36 గంటల పని విధానమే. రష్యాలో ఉపాధ్యాయులకు, డాక్టర్లకు మరికొంత తక్కువ పని గంటల విధానమును అమలుపరిచారు. రష్యాలో కార్మికుడు తనకు అన్యాయము జరిగిన ఏ విషయమైనను ప్రజాకోర్టుకు తన కేసు నేరుగా దాఖలు పరచుకోవచ్చును. అక్కడ సర్వసాధారణముగా కార్మికుల కేసులన్నియూ మూడు మాసముల లోపునే పరిష్కారము కాబడును. ఇంకనూ చిన్న చిన్న కేసులు అయిన యెడల వారం రోజుల లోనే పరిష్కారం కావలెను. అక్కడ కార్మికులకు కోర్టు ఖర్చులంటూ ఏమియూ లేవు.

రష్యాలో కార్మికుడు ఆర్టికల్ 95 ప్రకారంగా ఫ్యాక్టరీలో యూనియన్ పెట్టుకునే హక్కు కలిగియున్నాడు యూనియన్‌ను రిజిస్ట్రేషన్ చేసుకోనవసరం లేదు. ఆర్టికల్ 36 ప్రకారం సమానమైన పనికి సమానమైన జీతము గ్యారంటీ చేయబడినది. అక్కడ మహిళా కార్మికులకు, పురుష కార్మికులకు భేదములేదు. సమానమైన పనికి సమానమైన జీతము దొరుకును. ఈ విధంగా రష్యాలో విప్లవానంతరం కమ్యూనిస్టు పార్టీ నాయకత్వములోగల ప్రభుత్వం మూడు పర్యాయములు లేబరు చట్టములను రూపొందించి కార్మిక హక్కుల మెరుగులుదిద్ది, కార్మికులకు ఎంతో మేలుచేసినది. దీనికికారణం కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంతము సోషలిస్టు దృక్పథముమాత్రమే. భారత దేశమునకు స్వాతంత్ర్యం వచ్చి 35 సంవత్సరము అయినప్పటికీ యీ రోజునకుకూడా కార్మిక చట్టములలో ఎటువంటి మార్పులు తీసుకుని రాలేదు. తెచ్చిన మార్పులన్నీ కార్మికునికి మరింత గుదిబండలుగా తయారవుతున్నాయి. దీనికి కారణము కాంగ్రెసు పార్టీ అవలంభించుచున్న పెట్టుబడిదారీ విధానమే. మనకు 1947 సంవత్సరం ముందు బ్రిటిష్‌వారి పరిపాలనలోను, 1947 సం॥ తర్వాత కాంగ్రెసు వారి పరిపాలనలోను (3 సంవత్సరముల జనతా పాలనలో కూడా) పెట్టుబడిదారీ విధానమే కొనసాగినది. ఈ పెట్టుబడిదారీ వ్యవస్థలో దోపిడీ కొనసాగవలెనన్న బ్రిటిషువారి కాలములోనున్న చట్టములనే అమలుచేయవలెను. వాటిని కార్మికులకు అనుకూలముగా మార్చిన ఎడల పెట్టుబడిదారులకు అన్యాయము జరుగును. కావున వారి అభివృద్ధి కొరకై నేటికీ

## సోవియట్ చట్టాలు

భారతదేశములో కార్మిక చట్టములు బ్రిటిషు వారి కాలంలో తయారు చేసినవే అమలు పర్చబడుచున్నవి.

ఈ నాజున కార్మిక వర్గము రాజకీయ చైతన్యముతో ముందుకుపోవుచున్నది కార్మికుల చైతన్యమును గమనించిన కాంగ్రెసు ప్రభుత్వము కార్మికవర్గముపై రోజురోజుకూ ఎన్నో ఆంక్షలు విధిస్తూ ముందుకుపోకుండా ఆటంకములు కలుగచేయుచున్నది. "నాసా" చట్టములు, "ఎస్మా" చట్టములు, ఎల్.ఐ.సి. విభజనలు, కార్మిక హక్కులను కుదించుచూ కొత్తగా ప్రవేశపెట్టబడుచున్న కార్మికచట్టములు, కార్మికుల సమ్మెపై పోలీసుల దాడులు మొదలైనవన్నీ ప్రభుత్వముయొక్క కార్మిక వ్యతిరేక విధానాలు. యివి కాంగ్రెస్ పార్టీ అవలంభిస్తున్న పెట్టుబడిదారీ విధానమునకు అనుకూలంగా వున్నవి. కార్మిక వర్గమునకు వ్యతిరేకముగా వున్నవి. సోవియట్ రష్యాలో కమ్యూనిస్టు పార్టీ అధికారములో వున్నది సోషలిజము అమలులో వున్నది. కార్మిక చట్టములు కార్మికులకు అనుకూలముగా మార్చబడినవి. భారతదేశములో కూడా కార్మికవర్గం అధికారములోనికివచ్చిన నాడే యీ బూజుపట్టిన కార్మిక చట్టములు పోయి, కార్మికులకు అనుకూలముగా వుండే కొత్త చట్టములు వస్తాయి. అప్పుడుమాత్రమే కార్మికుల పరిస్థితులు పూర్తిగా మెరుగుపడతాయి. యీ గమ్యము చేరుకొనడానికి కార్మిక వర్గము సి.ఐ.టి.యు. నాయకత్వంనకు అండదండలు అందించి విప్లవ పంథాలో ముందుకు పోవటము ఒకటే మార్గము.

## విదేశీపట్టు పెరుగుదల

1982లో విదేశాలతో మిలాఖత్ ఒప్పందాలు ఇప్పటివరకు ఏసంవత్సరంలోను జరగనన్ని జరిగాయి. ఈ సంవత్సరం 593 ఒప్పందాలకు కేంద్ర ప్రభుత్వం అనుమతించింది. అలాగే విదేశీ ఈక్విటీ పెట్టుబడి గతతొమ్మిది సంవత్సరాలలో కలిసి పెట్టినదానికన్నామించి ఈ సంవత్సరం పెట్టుబడి అనుమతించారు. 1973-81 మధ్య విదేశీ ఈక్విటీ పెట్టుబడి రు. 58.8 కోట్లుకాగా, ఈ ఒక్కసంవత్సరమే రు. 62.8 కోట్లకు అనుమతిచ్చారు

## జాతీయోద్యమ కమిటీ

(26 వ పేజీ తరువాయి)

కరువుభత్యం రేటును పెంచడానికి ప్రభుత్వం అంగీకరించక తప్పలేదు. పెరుగుదలను నిర్ణయించడానికి త్రైపాక్షిక కమిటీని నియమించడానికి ఆర్థికమంత్రి అంగీకరించారు. బి.పి.ఇ. యొక్క ఇతర ఆదేశిక సూత్రాలను కూడా పునఃపరిశీలించడానికి ఆయన అంగీకరించారు. ఆ విధంగా 25 లక్షల ప్రభుత్వరంగ పరిశ్రమల కార్మికుల సమ్మె పెద్ద విజయంతో పరిష్కరించబడింది.

ఇక కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు సంబంధించినంతవరకూ వారి సమస్యలను జాతీయ ప్రచార కమిటీ ఎప్పటికప్పుడు పట్టించుకొంటూనే ఉంది సాధారణ కార్మిక వర్గ ఉద్యమంలో భాగంగానే ఈ ఉద్యోగులు కూడ వారి జీవన పరిస్థితుల మీద అనేక రకమైన దాడులను ఎదుర్కొంటున్నారు. గత దశాబ్దం పైగా వారికి వేతన సవరణ జరగకపోవడం వలన వారి జీవన ప్రమాణ స్థాయి పడిపోతోంది. ప్రభుత్వ ఉద్యోగులకు రాజకీయ, కార్మిక సంఘ హక్కులను ఇవ్వాలన్న డిమాండును జాతీయ ప్రచార కమిటీ పూర్తిగా బలపరుస్తోంది.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వోద్యోగులకు దేశంలోని ఇతర సాధారణ కార్మికవర్గానికి మధ్యగల గోడలను జాతీయ ప్రచార కమిటీ బద్దలుకొట్టింది. వారి నెదుర్కొంటున్న సమస్యలు ఒకటే గనుక, వారి న్యాయమైన హక్కులు పరిరక్షింపబడడం కోసం వారందరూ జాతీయ ప్రచారకమిటీ నాయకత్వంలో ఐక్యంగా కదలడం అవసరం.

జాతీయ ప్రచారకమిటీ యొక్క ఐక్యత రోజు రోజూ దృఢపడుతోంది. సామాజిక బేరసారాలను, కార్మికవర్గం యొక్క శక్తిని తీవ్రంగా కుంటుపరుస్తున్న వివిధ రకాలైన కార్మిక సంఘాలున్న స్థితిపోయి, ఉద్యమం విషయంలో ఒక క్రొత్త ఐక్యమార్గం సాధించడానికి దారితీసింది ఐ. ఎన్. టి. యు. సి. నాయకులు బానిస మనస్తత్వం అవలంభిస్తున్న ఈరోజు యజమానులు, ప్రభుత్వం కార్మికవర్గం యొక్క సంయుక్త శక్తిని ఎదుర్కొంటున్నారు.

జాతీయ ప్రచార కమిటీని ఇంకా శక్తి

## వార్తలు

### గని ప్రమాదం

ధన్‌బాద్ నుండి 80 కి లో మీటర్ల దూరంలో దో బీది పర్వతం దగ్గర వుండే బొగ్గుగనిలో ప్రమాదం జరిగి ముగ్గురు కార్మికులు చనిపోయారు.

ఈ ప్రాంతం సెంట్రల్ కోల్ ఫీల్డ్సు నిర్వహించే ప్రాంతంలో వుంది. దానిలో ఎవరో ప్రైవేట్ వ్యక్తి చట్టవిరుద్ధంగా బొగ్గు తీస్తుంటే ఈ ప్రమాదం జరిగింది.

ఇంత దుర్మార్గం జరుగుతున్నా ప్రభుత్వ సంస్థ నోరు మెదపలేదు సరికదా, ప్రమాదం జరిగిన తరువాతనైనా ప్రమాదం గురించి ఎలాంటి ఫిర్యాదూ చేయలేదు.

దీనినిబట్టి కోల్‌ఫీల్డు అధికారుల హస్తం గూడా ఈ చట్టవ్యతిరేక చర్యల వెనుక వుందనుకోవాలా?

### వేతన కార్యదర్శుల సమ్మె ప్రారంభం

రాష్ట్ర సహకార సంఘాల కార్యదర్శుల సంఘం పిలుపుమేరకు రాష్ట్రమంతటా వేతన సంఘ కార్యదర్శులు సమ్మె చేస్తున్నారు.

తమను బ్యాంకు వుద్యోగులుగా గుర్తించమని, ప్రావిడెంట్ ఫండ్, గ్రాట్యుటీ, బోనసులు వంటి సౌకర్యాలు కల్పించాలని వారు కోరుతున్నారు.

### బీడీ కార్మికులకు నాలుగు వైద్య కేంద్రాలు

రాష్ట్రంలో బీడీ కార్మికులకు నెల్లూరు, శ్రీకాళహస్తి, కమలాపురం, సిద్దిపేటలలో వైద్యశాలలు నెలకొల్పేందుకు భారత ప్రభుత్వము నిధులు మంజూరు చేసింది.

నెల్లూరులో బీడీ కార్మికుల కోసం ఏర్పర్చిన సంచార వైద్యశాలకు రాష్ట్ర కార్మిక మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

వంతం చేయడం అనేది దేశం అత్యంత క్లిష్టమైన ఆర్థికసంక్షోభంలో కూరుకుంటున్న దశలో కార్మికవర్గం మీద "పెట్టుబడి" చేసే దాడులకు వ్యతిరేకంగా మరిన్ని పోరాటాలను పెంపొందించడానికి దోహదపడుతుంది.

# భారత రైల్వేలు-ప్రజలు-రైల్వే కార్మికులు

— నృసింగచక్రవర్తి

1853 లో భారత రైల్వేల ప్రవేశం ఆధునిక పారిశ్రామిక రంగంలో ఒక ముఖ్య సంఘటనగా పేర్కొనవచ్చు. అప్పటి వైస్రాయి లార్డు డల్హౌసీ తన ప్రసిద్ధ మినిట్స్ అనే గ్రంధంలో రైలు మార్గాలవల్ల కలిగే గొప్ప సాంఘిక, రాజకీయ, వ్యాపారసంబంధమైన వుపయోగాల గురించి వర్ణించాడు. ఇది బూర్జువాలదృక్పధం. వలసపాలకులు రైల్వేల ద్వారా మనదేశసంపదను కొల్లగొట్టవచ్చనుకున్నారు. ఈ సంఘటనకు మరొక వైపుకూడ ఉంది. కారల్‌మార్క్స్ ఈసంఘటననుగురించి యీవిధంగా వ్యాఖ్యానించాడు "దేశరవాణాలో ఒక సారి ఇనుము బొగ్గులతో పనిచేసే యంత్రాలను ప్రవేశపెట్టడంజరిగితే తరువాత వాటి తయారీని అదుపు చేయడం ఎవరిచేతల్లోనూ వుండదు; భారతదేశంలో రైల్వేల ఆగమనం ఆధునిక పారిశ్రామికీకరణకు ప్రారంభచర్యవంటిదిగాచెప్పవచ్చు."



ఈనాడు భారత రైల్వేలు దేశానికే జీవనాడిగా భావించబడుతున్నాయి. రెండుసంవత్సరాల క్రితం సరిపడినన్ని రైల్వే వాగన్లు అందుబాటులో లేని విషయం గురించిన తీవ్రమైన చర్చ ప్రతిరోజూ పత్రికలలో కనిపిస్తుండేది.

1981 - 82 సంవత్సర ఆర్థిక సర్వేలో "ప్రాతిపదిక రంగంలో తీవ్రమైన ఆటంకాలు ఎదురౌతున్నందుకు" ఆశ్చర్యం వ్యక్తం చేశారు. ప్రపంచంలో ఒకే యాజమాన్యం (ప్రభుత్వం) క్రింద నడిచే పెద్ద రైల్వే విధానంలో మనది రెండవది.

## రైల్వేలు ప్రజలకు సేవ చేయగలిగాయా ?

భారత రైల్వేలు మన ప్రజలకు సేవ చేయగలుగుతున్నాయా? చేస్తే అది ప్రజల కోరికల కనుగుణంగా, సంతృప్తికరంగా వున్నదా? అని మనం ప్రశ్నించుకోవాలి ఈ క్రింది వాస్తవాలను పరిశీలిస్తే యీ ప్రశ్నలకు మనకు జవాబు దొరుకుతుంది.

1) గత 31 సంవత్సరాలలో, అంటే 1950- 51 నుంచీ, కేవలం 7, 646 కిలో మీటర్ల క్రొత్త రైలు మార్గాలు మాత్రం నిర్మించారు. అంటే సంవత్సరానికి 245 కిలో మీటర్ల వంతున నిర్మాణం జరిగింది. దీని వలన మన దేశ ప్రజల అవసరాలు తీర్చే అవకాశం రైల్వేలకు ఎంత మాత్రం లేదని స్పష్టమవుతున్నది.

2) రైల్వేలను వుపయోగించుకునేవారు అంటే ప్రయాణీకుల విషయం తీసుకున్నట్లయితే 1950-51 లో (E. M. U. కోచ్‌ల) సంఖ్య 460 వుండగా, వీటి సంఖ్య 1981-82 లో 2,658 కి (478%) పెరిగింది. ఈ కాలములో సనాతన పెట్టెల సంఖ్య 15, 984 నుంచీ 27,244 కి (70%) మాత్రమే పెరిగింది. అయితే ప్రయాణీకుల కిలో మీటర్ల విషయానికి వస్తే సబర్బన్ సెక్షన్‌లో 6551 నుంచీ 43,965కు (571%) నాన్ సబర్బన్ సెక్షన్‌లో 59,996 నుంచీ 17,66 822 కు (195%) పెరుగుదల ఉంది. ఈ అంకెలవల్ల రైళ్ళలో ప్రయాణీకులు ఎంతగా క్రిక్కిరిసి వుంటున్నారో మనకు అర్థమవుతుంది. ఒక్కొక్క సారి ఒక సీటుకు 500 శాతం, అంతకంటే ఎక్కువమంది కూడా ప్రయాణం చేస్తున్నట్లు అంగీకరించబడింది కూడా.

3) ప్రమాదాల విషయం చూస్తే వీటి సంఖ్య 1973-74లో 782 వుండగా 1981-82కు 1130 కి పెరిగింది. ఒక్క 1981-82 సంవత్సరంలో జరిగిన రైలు ప్రమాదాలలోనే 436 మంది మరణించడం, 652 మంది గాయపడడం జరిగింది.

4) అదేవిధంగా 1965-66 సం॥లో ప్రయాణ అంతరాయాలు 6,640 గంటలు కాగా 1980-81లో వీటి సమయంలో 14,035 గంటలకు, అంటేదేశంలో ఏదోఒకమార్గంలో రైళ్లు రోజుకు 40 గంటలపాటు నిలిచిపోతున్నాయన్నమాట.

ఈ కారణాలన్నిటివల్ల రైల్వేలు ప్రజలు ఆశలకనుగుణంగా అభివృద్ధి సాధించకపోగా రైలు ప్రయాణం రోజురోజుకు క్లిష్టగానూ. ప్రమాద భరితంగానూ తయారయిందని స్పష్టమవుతున్నది.

## ప్రణాళికల వైఫల్యం

సంవత్సరాల తరబడి ప్రభుత్వం అవలంబిస్తున్న పెట్టుబడిదారీ ప్రణాళికల దివాళాకోరు విధానాలవల్ల రైల్వేల పరిస్థితి దిగజారిపోయింది. ప్రయాణీకుల కిలోమీటర్ల సంఖ్య 1988-89 నాటికి 174 మిలియన్లకు చేరుకోగలదని మన ప్రణాళికా నిపుణుల అంచనా. అయితే వాస్తవంలో యీ అంకె 1881-82 నాటికే 176 బిలియన్లకు చేరుకున్నది ఈ అంకెలనుబట్టి మనకు సరిపడినన్ని ప్రయాణీకుల రైలుపెట్టెలు లేవని అర్థమవుతుంది. ఈ కారణంవల్ల కాలంచెల్లిన పాత యంత్రసామాగ్రినే వాడుతుండడంవల్ల ప్రమాదాల సంఖ్య పెచ్చు పెరిగిపోతున్నది.

## రైల్వే కార్మికోద్యమాల వైఫల్యాలు

రైల్వేకార్మికోద్యమం భారత రైల్వేలను మెరుగుపరచి ప్రజలకు అధికంగా సేవచేసే విషయంలో పథకాల, ఆచరణ విషయం పట్టించుకోలేదు. కేవలం ఆలిండియా లోకోరన్నింగ్ స్టాఫ్ అసోసియేషన్, స్టేషన్ మాస్టర్ల అసోసియేషన్‌లు మాత్రమే ప్రభుత్వ ప్రణాళిక లోటు పాట్లను, రైల్వేలు సరిగా పనిచేయక పోవడాన్ని, ప్రభుత్వ కార్మిక వ్యతిరేక విధానాన్ని విమర్శించాయి. అంతేగాని వీటిని నిరం

( మిగతా 35 వ పేజీలో )

( 33 వ పేజీ తరువాయి )

తరం ప్రచారంచేసి ఒక ఉద్యమంగా రూపొందించడం జరగలేదు దీనికి కారణం రైల్వే కార్మికులలో చీలికను ఉద్యమం ఎదుర్కొనవలసిరావడమే.

మొత్తం ఉద్యమం రెండు గ్రూపులుగా విడిపోయినట్లు స్పష్టంగా కనబడుతున్నది. అందులో ఒకరు సంప్రతింపులద్వారా కొన్ని రాయితీలను సాధించుకొంటే సరిపోతుందనుకొంటుండగా రెండవ వారు రైల్వే ఉద్యోగుల, ప్రజల కనీస కోర్కెల సాధనకై పోరాడటానికి సిద్ధంగా వున్నారు.

ప్రభుత్వం ఈ చీలికను ఉపయోగించుకొని ఉద్యోగులతో దౌర్జన్యం- రాయితీలు కలిపి ఆట ఆడుతున్నది. సంస్కరణవాద నాయకులను కొన్ని చిన్న చిన్న రాయితీలనిచ్చి సంతృప్తి పరుస్తూ, పోరాట పటిమగల వర్గాన్ని క్రూరంగా అణచివేస్తున్నది. అసలు ప్రభుత్వం ఎటువంటి రాయితీలకు అంగీకరించనప్పుడే సంస్కరణవాదులు పోరాటం గురించి కబుర్లు ప్రారంభిస్తారు. ఎప్పుడైనా పోరాటం గూడా తలెత్తుతున్నది.

రైల్వే కార్మికోద్యమ చరిత్రను పరిశీలించినట్లయితే 1920లో మొదటి పారిశ్రామిక ఫెడరేషన్ అంటే ఆలిండియా రైల్వే ఫెడరేషన్ స్థాపించబడినప్పటినుంచీ ఇదే పరిస్థితి కొనసాగుతున్నట్లు తెలుస్తుంది. 1960, 1968, 1974 సం॥లలో జరిగినపోరాటాలు సక్కృతుగా వుండే వుదాహరణలు ఈ పోరాటాల్ని ప్రతిసారీ ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా అణచివేసింది.

## రైల్వే కార్మికులు ఐక్యంకావాలి

రైల్వే కార్మికులంతా వెంటనే సమైక్యమై తీరవలసిన పరిస్థితి ఈనాడు పెరుగుతున్నది. రైల్వేకార్మికులు కూడాఇతర కేంద్రప్రభుత్వ ఉద్యోగులతో కలసి, 15వఅఖిలభారత కార్మిక మహాసభ సూచించిన ప్రకారం అవసరాల ప్రాతిపదికగాగల కనీస వేతనం కొరకు పోరాటం జరిపారు. మళ్ళీ 1974లో వారు ఇతర ప్రభుత్వరంగ సంస్థల ఉద్యోగులతో సమానమైన వేతనం కొరకు పోరాడారు ప్రభుత్వం యీ రెండు పోరాటాల్ని నిర్దాక్షిణ్యంగా అణచివేసింది. ఈ పోరాటాల సందర్భంగాఏర్పడిన ఐక్యతను మనం కాపాడుకుని శక్తివంతం చేసుకోలేకపోయాం. ఫలితంగా ప్రభుత్వం అనేక సార్లు న్యాయబద్ధమైన కోర్కెలను కూడా అంగీకరించకుండా "జీతాల వాయిదాల లాగా" కోర్కెలు తీర్చకుండా వాయిదా వేయగలుగుతున్నది.

కక్ష సాధింపు చర్యలవల్ల వెయ్యిమందికి పైగా రైల్వే ఉద్యోగులు పనినుంచి తొలగించబడ్డారు. కొన్ని వేలమంది ఉద్యోగుల సర్వీసులో అంతరాయం కలిగింది. ప్రభుత్వం ఒప్పందాల నుండి వెనక్కు మళ్ళుతున్నది. ప్రభుత్వరంగ సంస్థల ఉద్యోగులతో సమాన వేతనం కావాలన్న రైల్వే ఉద్యోగుల కనీస కోర్కె ఇంకా అపరిష్కృతంగానే ఉండిపోయింది.

ప్రపంచబ్యాంకు అప్పుతో రైల్వేల ఆధునికీకరణ పెద్ద ఎత్తున కొనసాగుతున్నది. 3వ, 4వ జెనరేషన్ కంప్యూటర్లు వుపయోగించి రైల్వేల నిర్వహణను కంప్యూటరైజ్ చేయబోతున్నారు. దీని వల్ల మానవశక్తి వినియోగం తగ్గిపోతుంది. ఫలితంగా కొద్ది రోజుల్లోనే రైల్వేలలో కార్మికుల సంఖ్య తగ్గుతుంది. రైల్వేలలో మానవశక్తి వినియోగం తగ్గిపోతున్నదనడాన్ని యీ క్రింది వివరాలు స్పష్టంచేస్తున్నాయి.

1950-51, 1981-82 మధ్యకాలంలో ప్రయాణీకుల కిలోమీటర్లు 66,517 మిలియన్లనుంచి 2,20,787మిలియన్లకు (232%) పెరిగింది.

టన్ను కిలోమీటర్లు (సరుకుల రవాణా) 37,665 మిలియన్ల నుంచి 164,253 మిలియన్లకు (336%) పెరిగింది అయితే రైల్వే కార్మికుల సంఖ్య మాత్రం కేవలం 913 6 వేల నుంచి 1575 వేలకు (72%) మాత్రం పెరిగింది

పైన యివ్వబడిన వివరాల వల్ల మనకు రైల్వే కార్మికులకు పనిభారం ఎంతగా పెరిగిందో, ఉద్యోగావకాశాలు ఎంతగా తరిగిపోయాయే అర్థమవుతుంది. అంతేగాదు ప్రభుత్వము ఆలిండియా లోకోరన్నింగ్ స్టాఫ్ అసోసియేషన్‌తో చేసుకున్న 10గంటలగరిష్ట డ్యూటీ పరిమితిని కూడా తిరస్కరించడానికి యిదే పునాది. కార్మికులను మరింత తగ్గించేందుకు ప్రభుత్వం పూనుకుంటున్నది. ఇప్పటికి దేశంలో 2 కోట్ల మంది నమోదయిన నిరుద్యోగులున్నారు. ఈ ప్రభుత్వ చర్య వలన ఉద్యోగ అవకాశాలు మరింత మృగ్యమవుతాయి.

## ప్రభుత్వ విధానాలలో మార్పు కొరకు పోరాడాలి

అందువల్ల ప్రభుత్వ విధానాలను తిప్పికొట్టేందుకు రైల్వే కార్మికులందరూఐక్యమై ప్రజల సన్నిహిత సహకారంతో, ఇతర కార్మిక సంఘాలతోకలిసి తమ కనీసకోర్కెల సాధనకు పూనుకోవడం అత్యంత అవసరం. అప్పుడే వారి కనీస కోర్కెలు సాధించబడటానికీ, ప్రజలకు సురక్షితమైన రైలు ప్రయాణంకల్పించడానికీ వీలవుతుంది. వెనుకబడిన ప్రాంతాలన్నింటికీ రైలుమార్గాల్ని విస్తరించగలిగినప్పుడే ప్రజల ఆశలు సఫలీకృతమవడమేగాక, నిరుద్యోగ యువకులకు ఉద్యోగావకాశాలు మెరుగుపడగలవు.

గత ఫిబ్రవరి మాసంలో కొన్ని రైల్వే కార్మిక సంఘాలు సమావేశమై అందరికీ ఆమోదయోగ్యమైన కోర్కెల పత్రం రూపొందించడానికి నిర్ణయించాయి ఈప్రయత్నాలు ఫలిస్తే రైల్వే కార్మికోద్యమం పురోగమించి ఉజ్వల ఫలితాలు సాధించగల అవకాశాలున్నాయి. అందువల్ల ఉద్యమంలో భాగస్వాములందరూ ఐక్యపోరాటాల అభివృద్ధి పట్ల శ్రద్ధచూపాలి. ఇన్ని సంవత్సరాలుగా వూబిలో కూరుకుపోయివున్న రైల్వే కార్మికోద్యమాన్ని పైకి తీసుకురావడానికి యింతకంటే వేరేమార్గంలేదు.

## పెనుబల్లి టైలర్స్ సంఘం

ఖమ్మం జిల్లా కొత్తగూడెం తాలూకా పెనుబల్లిలో ఏప్రిల్ 2 తేదీన కొత్తగా టైలర్స్ యూనియన్ ఏర్పరచుకున్నారు.

దానిని సి.ఐ.టి.యు అనుబంధ సంఘం చేయాలనుకున్నారు.

# పోరాట ఐక్యతను సాధించాలి!

# విప్లవోద్యమంలో కార్మిక-కర్షక మైత్రి ప్రాధాన్యత



**విప్లవ విజయానికి కార్మిక-కర్షక మైత్రి చాల కీలకమైనది. ఆ ప్రాథమిక సత్యాన్ని సూత్రప్రాయంగా అంగీకరిస్తున్నప్పటికీ ఆచరణలో న్యాయం జరగడం లేదు అందుకోసం మహనీయులు మార్క్స్-ఎంగెల్స్‌ల బోధనలనుండి, రష్యా, చైనా విప్లవాల గుణపాఠాలనుండి కార్మిక-కర్షక మైత్రి ప్రాధాన్యతను మరొకసారి గుర్తుచేయడమే ఈ వ్యాసం ప్రధాన లక్ష్యం.**

లావు బాలగంగాధరరావు
పాటూరి రామయ్య

మన యుగానికి, అంటే బూర్జువా శకానికి యీ క్రింది విశిష్ట లక్షణం ఉంది :

"అది వర్గ వైషమ్యాలను సరళంచేసింది మొత్తం సమాజం రెండు శత్రు శిబిరాలుగా, సూటిగా ఒక దాని అభిముఖంగా మరొకటి నిలిచివున్న రెండు గొప్ప వర్గాలుగా అంతకంతకు మరింత చీలిపోతూ ఉంది. ఆ వర్గాలే బూర్జువా వర్గం - శ్రామిక వర్గం"

## శ్రామిక వర్గ నాయకత్వ పాత్ర

శాస్త్రీయ కమ్యూనిజం సిద్ధాంత సృష్టికర్తలైన కారల్ మార్క్స్-ఫ్రెడరిక్ ఎంగెల్స్‌లు నూటముప్పయి అయిదేళ్ళకిందట తమ 'కమ్యూనిస్టు ప్రణాళిక' లో చెప్పిన మాట ఇది. ఆ ప్రణాళిక నేటికీ 'చారిత్రక పత్రం' గా ప్రకాశిస్తోంది. ఆ మహామహులు తమ ప్రణాళికలో ఇంకా ఇలాచెప్పారు.

"తన సొంత ఉత్పత్తి, సొంత మారకం, సొంత ఆస్తి సంబంధాలు కలిగిన ఆధునిక బూర్జువా సమాజం అలాంటి బ్రహ్మాండమైన ఉత్పత్తి, మారకపు సాధనాలను తన మంత్రబలంచే సృష్టించినట్టి సమాజం అట్టడుగున వున్న శక్తులను తన మంత్రజపంతో పైకి రప్పించి తానిక అదుపుచేయలేనట్టి ఇంద్రజాలికుని వలె ఉంది".

"ఇప్పటివరకు గౌరవనీయంగాను భక్తిప్రపూర్వకమైన భయంతోనూ పరిగణించబడిన ప్రతివృత్తి పరివేష్టితాన్ని ఈ బూర్జువా వర్గం పీకిపారేసింది. వైద్యుడినీ కవినీ, శాస్త్రవేత్తనీ డబ్బు తీసుకుని తనకుఊడిగం చేసే కిరాయి కూలీలుగా మార్చివేసింది."

"ఈనాడు బూర్జువా వర్గాన్ని ముఖాముఖి ఎదిరించి నిలబడే వర్గాలన్నిటిలోనూ ఒక్క శ్రామిక వర్గం మాత్రమే అసలైన విప్లవ వర్గం. ఇతర వర్గాలు ఆధునిక పరిశ్రమ సమక్షంలో క్షీణించిపోయి చిట్టచివరకు అదృశ్యమై పోతాయి. దాని యొక్క ప్రత్యేకమైనట్టి, ముఖ్యమైనట్టి ఉత్పాదితం శ్రామిక వర్గమే."

"కమ్యూనిస్టులు తమ దృక్పధాలను, ఆశయాలను దాచడానికి తిరస్కరిస్తారు ప్రస్తుత సామాజిక పరిస్థితులను బలప్రయోగంతో కూలదోస్తేగాని తమ ఆశయాలు సిద్ధించవని బహిరంగంగానే ప్రకటిస్తారు. కమ్యూనిస్టు విప్లవమంటే పాలక వర్గాలను గజగజ వణకనివ్వండి. శ్రామిక వర్గానికి పోయేదేమీలేదు తమ సంకెళ్లు తప్ప వారు ప్రపంచాన్నే జయించవల్సిఉంది.

"ప్రపంచ కార్మికులారా! ఏకంకండు!".

ఎంతటి మహత్తరమైన సూత్రీకరణలివి! ఇవి ఆచరణలో రుజువయ్యాయి వారు తమ విశ్వాసాలను ప్రకటించి ఇప్పటికి నూటముప్పయి అయిదేళ్ళయింది చరిత్రలో ఇది చాల స్వల్పకాలం. ఈ అనతి కాలంలోనే మూడోవంతు ప్రపంచాన్ని శ్రామికవర్గం జయించింది.

అన్ని వర్గాలలోకి శ్రామికవర్గమొక్కటే విప్లవ వర్గమని, సామాజిక విప్లవానికి నాయకత్వ పాత్ర వహించగల సత్తా ఈ వర్గానికి మాత్రమే ఉందని, బూర్జువా వర్గం సమాజాన్ని ముందుకు తీసుకొనిపోయే శక్తిని కోల్పోయి, అభివృద్ధి నిరోధకంగా మారిపోయిందని మార్క్స్, ఎంగెల్స్‌లు స్పష్టీకరించారు. అయితే శ్రామిక వర్గ విప్లవ సిద్ధాంతంలో కార్మిక - కర్షక మైత్రి కీలకమైనదిగా వారు పరిగణించారు. కార్మిక-కర్షక మైత్రిని గురించిన మార్క్సిస్టు సూత్రీకరణలు సరైనవేనని విప్లవ ఆచరణ ధృవీకరించింది.

## పారిస్ కమ్యూన్ గుణపాఠం

కార్మిక- కర్షక మైత్రి ప్రాధాన్యతకు సంబంధించి పారిస్ కమ్యూన్ అందించిన గుణపాఠం చూద్దాం.

ఫ్రాన్సులో పచ్చి కిరాతకమైన థేర్స్ బూర్జువా ప్రభుత్వంపై పారిస్ కార్మికులు వీరోచితంగా పోరాడారు. థేర్స్ కిరాయి సైనికులు పారిపోయారు. ప్రభుత్వ మిలిటరీ జనరల్స్ ఇద్దరుచచ్చారు. 1871 మార్చి 18న పారిస్ మహానగరం శ్రామిక ప్రజల హస్తగతమైంది. పారిస్ పీడిత ప్రజల యుగయుగాల బానిస సంకెళ్ళు ఆ చరిత్రాత్మక దినాన పటాపంచలయ్యాయి. "ఈ పారిస్ ప్రజలది ఎంతటి చారిత్రాత్మకమైన చొరవ, ఎంతటి మహత్తరమైన త్యాగనిరతి" అని మార్క్స్ వేనోళ్ళ ప్రస్తుతించాడు ఈ విప్లవ విజయం తర్వాత అన్ని తరగతులకు చెందిన ప్రజలు సాంఘిక, రాజకీయ కార్యకలాపాల్లో పాల్గొనడం ప్రారంభించారు.

కానీ, "పెట్టుబడిదారీ వ్యవస్థను తొలగించి దాని స్థానంలో స్థాపించవల్సిన నూతన సమాజ ప్రాథమిక రూపం ఏవిధంగా ఉండాలో స్పష్టంచేసిన కమ్యూన్" దెబ్బయి రెండు రోజులు మాత్రమే జీవించగలిగింది.

# "కార్మికవర్గం తాను గ్రామీణ కష్టజీవుల నాయకుడుగా ఆచరణలో రుజువుకావాలి!"

అంతర్యుద్ధంలో చివరి నెత్తుటి బొట్టు ఓడ్చే వరకు కమ్యూనార్డ్స్ ధీరోదాత్తంగా పోరాడారు. అయినా 1871 మే 28న కమ్యూన్ పతనమయింది.

కమ్యూన్ లోని మెజార్టీ నాయకులకు మార్క్సిస్టు అవగాహన లేదు. అనేక ఘన కార్యాలను సాధించినప్పటికీ, కమ్యూన్ నిలదొక్కుకుని విస్తృతమయ్యే విధంగా తగిన ఎత్తుగడలను వారు చేపట్టలేక పోయారు. ఏమైనప్పటికీ కమ్యూన్ భవిష్యత్ విప్లవాలకి అమూల్యమైన గుణపాఠాలను అందజేసింది. అందులో ముఖ్యమైనది రైతాంగ సమస్య.

రెండవ సామ్రాజ్య కాలంలో చిన్న రైతుల ఆర్థిక పరిస్థితి మహా నికృష్టంగా దిగజారి పోయింది. వారి భూమి తనఖా రుణాలు 14 వేల మిలియన్ ఫ్రాంకులకు చేరాయి. ఇందుకు ఏడాదికి వెయ్యి మిలియన్ ఫ్రాంకుల వడ్డీ భారం వారి నెత్తినబడింది. ఇందుకుతోడు ప్రత్యక్ష,పరోక్షపన్నులు విపరీతంగా పెరిగాయి చట్టావ్యాపారం,మూడవనెపోలియన్ యుద్ధాల భారం,నిరంకుశాధికారుల ఉన్మత్తతాండవం- వీటన్నిటి మూలంగా ఫ్రెంచి రైతాంగం మూలుగులు ఎండిపోయాయి. కమ్యూన్‌కు రైతాంగం మద్దతును పొందేందుకు ప్రత్యక్షంగా కనబడుతున్న ఈ అవకాశాన్ని కమ్యూన్ నాయకులు వినియోగించుకోలేక పోయాపు. కమ్యూన్‌లో మెజారిటీగల ప్రౌధానిస్టులు, బ్లాంకిస్టులు "రైతాంగాన్నంతటినీ అభివృద్ధి నిరోధక శక్తి" గా చూశారు. ఈ అవకాశాన్ని థేర్స్ ముఠా చక్కగా వినియోగించుకున్నది. "కమ్యూనార్డ్స్" కొంపలకి నిప్పుపెట్టే గూండాలని, దోపిడీ దొంగలని కల్లిబొల్లి కబుర్లతో గ్రామసీమలంతటా ప్రచారం చేశారు. ఈ విధంగా కమ్యూన్‌కు, రైతాంగానికి మధ్య కృత్రిమ అడ్డుగోడ ఏర్పడింది. దానిని ఛేదించే చర్యలను కమ్యూన్ గైకొనలేకపోయింది. మార్క్సిస్టు అవగాహనవున్న కొద్ది మంది మాత్రమే ఈ కృషి చేశారు. అయినా ఫలించలేదు. మార్క్స్ అనుయాయుడైన అగస్టుపెరైలర్ "రైతాంగం భూమి తనఖా రుణాలను రద్దుచేయాల" ని పదే పదే పట్టుబట్టాడు. ప్రౌధానిస్టు మెజారిటీ ఆయన వాదనను పెడచెవిని బెట్టింది.

రైతాంగం యొక్క నిజమైన ప్రయోజనాలేమిటో, అందులో తక్షణం నెరవేర్చవల్సిన అతి ముఖ్యమైనదేమిటో, వాళ్ళకి ఆచరణలో చూపి కార్మికవర్గ ప్రభుత్వం వాళ్ళకి ఏమి యివ్వగలదో రైతాంగానికి కమ్యూన్ వివరించనే లేదు. ఈ విధంగా రైతాంగానికి దూరమైంది కమ్యూన్. కమ్యూన్ పరాజయానికి గల కారణాలలో రైతాంగాన్ని కలుపుకు రాలేకపోవడమన్నది ముఖ్య కారణమైంది.

ఈ అనుభవాల నుంచి మార్క్స్, ఎంగెల్స్‌లు ఈ క్రింది నిర్ధారణను ప్రకటించారు.

"విప్లవం రైతాంగాన్ని, పెటీ బూర్జువా జీని-జాతి ప్రజనంతా- పెట్టుబడిదారీ వ్యవస్థకు వ్యతిరేకంగా తిరగబడేటట్లు, తమపక్షాన నిలబడి పోరాడే సత్తాగలదిగా కార్మికవర్గాన్ని గుర్తించేటట్లుచేసుకునేవరకుకార్మికులు ఒక్క అడుగు ముందుకువేయలేరు, బూర్జువా వ్యవస్థను వెంట్రుకవాసి కూడా కదపలేరు."

## లెనిన్ సూత్రీకరణలు

మార్క్సిస్టు మహోపాధ్యాయుడు లెనిన్ 'కార్మిక-కర్షక మైత్రి' అనే మార్క్సిస్టు భావనను రివిజనిస్టు, అవకాశవాద వక్రీకరణల నుండి కాపాడి సృజనాత్మకంగా అభివృద్ధి పర్చాడు. ప్రజాతంత్ర, సోషలిస్టు విప్లవ దశలు రెంటిలోనూ కార్మిక-కర్షక మైత్రికి ఆయన గొప్ప ప్రాముఖ్యతనిచ్చాడు. అభేద్యమైన ఈ ఐక్యతను సాధించనిదే, నాయకత్వ పాత్రకు కార్మికవర్గం అభివృద్ధి చెందనిదే కార్మికవర్గంగాని, రైతాంగంగాని విముక్తి పొందలేవని ఆయన వక్కాణించారు.

పారిస్ కమ్యూన్‌ను గురించిన మార్క్స్ రచనలను, కమ్యూన్‌కి సంబంధించిన ప్రతి విషయాన్ని లెనిన్ చదివాడు మళ్ళీ మళ్ళీ చదివాడు. ఏ పరిస్థితుల్లో పారిస్ కార్మికులు అధికారానికొచ్చారు. ఎందుకని అది పతనమై



పోయిందని లెనిన్ లోతయిన అధ్యయనం చేశాడు.

సామ్రాజ్యవాదంయొక్క ప్రత్యేకలక్షణాలను, రష్యా ఆర్థిక, రాజకీయ పరిణామాలను అధ్యయనం చేసి కార్మిక-కర్షక మైత్రికి సంబంధించిన వివిధ దృక్కోణాలను ఆయన వెల్లడించాడు. రష్యాలాంటి వ్యవసాయక దేశంలో శ్రామిక విప్లవ విజయం వ్యవసాయక సమస్యకు యిచ్చే సక్రమ పరిష్కారం మీదనే ఆధారపడి ఉందని ఆయన వక్కాణించాడు. భూమి జాతీయకరణ అనే విప్లవాత్మకమైన వ్యవసాయ కార్యక్రమాన్ని ముందుకు తెచ్చాడు.

అప్పటి రష్యా పరిస్థితుల్లో ఈ కార్యక్రమం సోషలిస్టు విప్లవ దశకు తీసుకువెళ్ళగలదని, గ్రామ సీమల్ని సోషలిస్టు మార్గానికి మార్చగలదని ఆయన అంచనా కట్టగలిగాడు.

వ్యవసాయ సమస్యను గురించి మార్క్సిస్టు దృక్పథంతో లెనిన్ ఒకసిద్ధాంత పత్రాన్ని రచించాడు. అందులో ఆయన పెట్టుబడిదారీ దేశాలన్నిటిలోని గ్రామీణపీడిత ప్రజలను వర్గీకరించాడు.

"పారిశ్రామిక కార్మికులు ఇతర ప్రపంచంతో జోక్యం లేకుండా, ఏదో తమకున్న దాంతో తృప్తిపడి, బూర్జువానిర్మిత సంఘంలో తమ ఆర్థిక పరిస్థితిని నెమ్మదిగా అభివృద్ధి పర్చుకుంటూ కాలం గడుపుదామనుకుంటే

యుద్ధాలనుంచి, పెట్టుబడిదారుల దోపిడీ నుంచి మానవ సమాజాన్ని విముక్తి గావించే తమ చారిత్రక కర్తవ్యాన్ని నెరవేర్చ లేరు..... కార్మిక వర్గమే నిజమైన విప్లవ వర్గం. దోపిడీ దార్లను కూలదోసేందుకు కష్టజీవులైన పీడిత ప్రజలందరూ సాగించే పోరాటంలో కార్మికవర్గంముందుండి నాయకత్వం వహించగలిగినప్పుడే నిజమైన సోషలిస్టు పంథాలో నడుచుకొనగలదు. కాని, ఈ కృషి పూర్తిగా విజయవంతం కావాలంటే వర్గపోరాట సిద్ధాంతాన్ని గ్రామీణ ప్రాంతాలలోని కూడా తీసుకుని పోయి, వ్యవసాయ శ్రామికులనందరినీ పట్టణ కార్మికుల యొక్క కమ్యూనిస్టుపార్టీ చుట్టూ సమీకరించాలి వారికి సరైన శిక్షణ ఇవ్వాలి." అని లెనిను బోధించాడు.

బోల్షివిక్ పార్టీ ఒక్కటే భూస్వాములతో ఎట్టి సంబంధాలు కలిగి ఉండలేదని, రైతుల అవసరాలను నెరవేర్చేందుకై భూస్వాములను అణిచివేసేందుకు సిద్ధంగావుందని వారు ఆచరణలో తెలుసుకున్నారు. ఇది శ్రామిక వర్గం-పేద రైతాంగాల మధ్య మైత్రికి దృఢమైన పునాదిగా పని చేసింది. కార్మికవర్గం - పేద రైతాంగాల మధ్య ఐక్యత చాలకాలం నుండి ఊగిసలాడుతున్న మధ్య తరగతి రైతుల ప్రవర్తనను కూడా నిర్ణయించింది. ఈ మధ్య తరగతి రైతులు అక్టోబరు తిరుగుబాటు సమీపించగానే హృదయ పూర్వకంగా విప్లవం వైపుకు వెళ్ళి పేద రైతాంగంలో కలిశారు.

"ఈ మైత్రి లేనిదే అక్టోబరు విప్లవం విజయవంతమయ్యేది కాదని వేరే చెప్పనవసరం లేదు."

లక్షలకు వృద్ధయింది. రైతులు కూడా ఆత్మరక్షణ దళాలను నిర్మించుకుని కాంటన్, హాంకాంగ్ కార్మిక సమ్మెలకు చాల తోడ్పడ్డారు."

హూనాన్ కార్మికులు సాయుధ దళాలను ఏర్పరచి విప్లవ సైన్యంతో సహకరించారు. రైతులు విప్లవ సైన్యంతో భుజం భుజం కలిపి పోరాడారు. గ్రామసీమలలో రైతు ఉద్యమం తుఫాను వలె వ్యాపించింది. హూనాన్ రాష్ట్రంలో మావో సే-టుంగ్ నాయకత్వాన జరిగిన శక్తివంతమైన రైతు పోరాటం ప్రత్యేకంగా పేర్కొనదగింది. ఈ పోరాటం స్థానిక భూస్వాములను, నిరంకుశ పెత్తందార్లను తీవ్రమైన దెబ్బ తీసింది. భూస్వాముల దుర్మార్గమైన దోపిడీకి భరతవాక్యం చెప్పింది. తద్వారా శతాబ్దాల నుంచి

**"వ్యవసాయ విప్లవం పూర్తికాకుండా ఆహార సమస్యా తీరదు - కార్మికుల కోర్కెలూ నెరవేరవు**

## బోల్షివిక్ పార్టీ అనుభవాలు

లెనిన్ నాయకత్వాన బోల్షివిక్ పార్టీ విప్లవవిజయాన్ని సాధించింది. ఆ విప్లవంలో కార్మిక-కర్షక మైత్రి నిర్వహించిన గొప్ప పాత్రను బోల్షివిక్ పార్టీ చరిత్ర ఇలా వివరించింది.

"రష్యన్ కార్మికవర్గానికి రైతు జనాభాలో అత్యధిక సంఖ్యాకులైన పేద రైతాంగం విప్లవంలో ముఖ్యమైన మిత్రము 'మామూలు' రోజుల్లో అనేక శతాబ్దాలుగా పొందిన అనుభవంతో విప్లవపు 8 నెలల అనుభవాన్ని నిస్సంకోచంగా పోల్చవచ్చు.

"కష్టపడే రైతుజన సామాన్యానికి సంబంధించినంతవరకు ఈ అనుభవం వృధాకాలేదు. ఈ ఎనిమిది నెలల్లో రైతాంగ ప్రజలకు రష్యన్ పార్టీ లన్నిటినీ ఆచరణలో పరీక్షించడానికి అవకాశం లభించింది శాసన బద్ధ ప్రజాతంత్రవాదులు గాని, సోషలిస్టురివల్యూషనరీలు గాని, మెన్షివిక్కులుగాని భూస్వాములతో పట్టుదలతో పోరాడరని, రైతుల ప్రయోజనాల కోసం వారు ఆత్మ బలిదానం గావించరని ఆచరణలో తెలుసుకున్నారు.

## చైనా విప్లవానుభవాలు

పరమ దుర్మార్గమైన సామ్రాజ్య వాద, ఫ్యూడల్ దోపిడీ నుండి, పీడన నుండి పీడిత ప్రజలకు విముక్తి కలిగించింది చైనా మహా విప్లవం. ఆ విప్లవంలో కార్మిక-కర్షకమైత్రి బ్రహ్మాండంగా పెంపొందింది. విప్లవసైన్యానికి కార్మికులతో బాటు రైతాంగం యిచ్చిన మహత్తర తోడ్పాటును గురించి తెలుసుకోడం అవసరం.

చైనా కమ్యూనిస్టు పార్టీ గత విప్లవాల అనుభవాలను అవగాహన చేసుకుంటూ తమ దేశ వాస్తవ పరిస్థితులకు మార్క్సిజం-లెనినిజాన్ను సక్రమంగా అన్వయించడంద్వారా విప్లవ విజయాన్ని సాధించింది. చైనా విప్లవంలో "కార్మికోద్యమంతో బాటు రైతాంగ ఉద్యమం కూడా పెంపొందింది. కార్మికులు రైతులు కలిసి సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక పోరాటంలో, అత్యంత బలీయమైన శక్తిగా రూపొందారు."

"క్వాంగ్‌టుంగ్ రాష్ట్రంలో రైతుసంఘాల పలుకుబడి పెరిగింది. 1926 నాటికే ఆ రాష్ట్రంలో రైతు సంఘాల సభ్యత్వం ఆరు

పేరుకుని వున్న ఫ్యూడల్ పాలనవెన్నెముక విరిగి పోయింది. 1927 నాటికి హూనాన్ లోని రైతు సంఘ సభ్యత్వం ఇరవై లక్షలకు పెరిగింది.

నగరాలలోని కార్మికులు, పల్లె ప్రాంతాలలో రైతులు ఫ్యూడల్ వర్గాలకు వ్యతిరేకంగా పోరాడి తీవ్రంగా దెబ్బతీయడంవల్ల ఉత్తర జైత్రయాత్ర కర్తవ్యాన్ని నిర్వహించడం సులభతరమైంది. అంతకు ముందు గడించిన అనుభవంతోను, లెనిన్ థీసిస్ ఆధారంగానూ, మావో సే టుంగ్ వ్యవసాయక కార్యక్రమాన్ని రూపొందించాడు. వ్యవసాయిక విప్లవ జ్వాలలు విస్తృతంగా వ్యాపించాయి ఈవిప్లవ ఫలితంగా ఆ ప్రాంతాలలో భూస్వాముల పెత్తనం అంతరించింది. కార్మిక-కర్షకులతో ఏర్పడిన ఎర్ర సైన్యం చైనా విప్లవంలో ఒక గొప్ప మూలమలుపైన సుదీర్ఘయాత్రను సాగించి దిగ్విజయం పొందింది

1949 ఆఖరుకల్లా టిబెట్ మినహా చైనా ప్రధాన భూభాగమంతా విముక్తమైంది. మూడవ విప్లవ అంతర్యుద్ధాన్నిచైనాప్రజలు

జయించారు. 1949 అక్టోబరు 1న కేంద్ర ప్రజా ప్రభుత్వం అధికారం స్వీకరించింది. "కార్మికుల–రైతుల ఐక్యతపై ఆధారపడిన కార్మిక వర్గం కమ్యూనిస్టు పార్టీల నాయకత్వాన, ప్రజలయొక్క ప్రజాతంత్ర నియంతృత్వ స్వభావాన్ని చైనా రిపబ్లిక్ కలిగి ఉంటుంద"ని మావో–సే–టుంగ్ ప్రకటించాడు.

## తెలంగాణా పోరాటం

ప్రపంచంలో గత విప్లవాల వలెనే మన తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం మనకు విలువైన గుణపాఠాలనుఅందించింది. భూమికోసం, భుక్తికోసం, వెట్టిచాకిరీ రద్దు కోసం నాలుగు వేలమంది యోధులు ఆత్మ బలిదానం చేసిన మహత్తర పోరాటమది. మూడువేల గ్రామాలకు ఈ పోరాటం విస్తరించింది. గ్రామ రాజ్యాలను నెలకొల్పుకున్నారు. పదిలక్షల ఎకరాలభూమి పంపకం జరిగింది. వెట్టిచాకిరీ రద్దుచేయబడింది, అధిక వడ్డీల బెడద తొలగిపోయింది. వ్యవసాయ కార్మికులకు కనీసవేతనంఅమలు జరిగింది. నిరంకుశ నిజాంపాలనను కూకటి వేళ్ళతో ఈ పోరాటం కుదిపివేసింది. ఏణ్ణర్ధంపాటు గ్రామ రైతుకమిటీలే పరిపాలన సాగించాయి. వ్యవసాయ విప్లవ ప్రాముఖ్యతను దేశంముందుకు తెచ్చిన పోరాటమిది. ప్రస్తుత అంశానికి సంబంధించిన ఒక ముఖ్య విషయాన్ని మనం గమనంలో ఉంచుకోవాలి. ఈ మహత్తర రైతాంగ పోరాటానికి మద్దతుగా కార్మిక వర్గం ముందుకురాలేదు. ఈ పోరాటం పట్ల సంఘీభావంగాకార్మికులుఅందోళనలు, సమ్మెలు చేయనేలేదు. తనకేమి పట్టనట్లు కార్మికవర్గం నిస్తేజంగా ఊరుకున్నది. అందువల్ల యూనియన్ సైన్యాల మొత్తం దాడినంతటినీ ఈ పోరాటం ఒంటరిగానే భరించవల్సి వచ్చింది తత్కారణంగా ఊపిరి పీల్చుకునే అనకాశం కూడా ఈ పోరాటానికి లేకుండా పోయింది,

ఈ పోరాటం మనకిస్తున్న అనుభవాలను, నేర్పుతున్న గుణపాఠాలను నిత్యం అధ్యయనంతో ఆకళింపు చేసుకోవల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఆ పోరాటం మన విప్లవ కార్యాచరణకు వెలలేని సంపదను మనకందించింది. ప్రపంచ విప్లవాల ముఖ్య పాఠాలను తెలంగాణా సాయుధ పోరాట చరిత్ర తనలో ఇముడ్చుకుని ఉంది. ఈ పోరాట వివరాలను సమగ్రంగా తెలుసుకునేందుకు కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య గారు రచించిన "వీర తెలంగాణా విప్లవ పోరాటం–గుణపాఠాలు" అను మహద్గ్రంథాన్ని అధ్యయనం చేయడం అవసరం.

## మన ఉద్యమ అనుభవాలు

ఇటీవలి కాలంలో మన ఉద్యమ అనుభవాలను కూడా మనం గమనంలో ఉంచుకోవాలి. 1969లో పశ్చిమ బెంగాల్ ఐక్యసంఘటన ప్రభుత్వాన్ని కేంద్రం కుట్రతో కూల్చివేసినతరువాత గ్రామ సీమల్లో కౌల్దార్ల మీద (బర్గాదార్ల మీద) భూస్వాముల దాడి ఎక్కువైంది. అయినప్పటికి కౌల్దారు తమ హక్కులను, పంటలను రక్షించుకునేందుకు సన్నద్ధం కావల్సిన తప్పనిసరి పరిస్థితులు ఏర్పడ్డాయి. భూస్వాములు తమకు రక్షణగా పోలీసు బలగాలను గ్రామసీమలకు రప్పించుకుంటారు. ఈ స్థితిలో పట్టణాలలో ముఖ్యంగా కలకత్తా, దుర్గాపూర్ పారిశ్రామిక నగరాలలోని కార్మికులు నిరవధిక సమ్మె నోటీసు లిచ్చి పోరాటానికి సన్నద్ధం కావడంతోపోలీసులుగ్రామ సీమల కెళ్ళటానికివీలులేకుండాపట్టణాలలోనే తిష్టవేయవల్సి వచ్చింది. కౌల్దారు తమ పంటలను సంఘటిత శక్తితో ఇళ్ళకు తెచ్చుకోగలిగారు. కార్మికులు చేబట్టిన ఈ సంఘీభావచర్య కౌలుదార్లకు ఎంతో మేలు చేసింది. వారి పోరాట శక్తిని పెంచింది.

## విప్లవానుభవాలు అధ్యయనం చేయండి

పశ్చిమబెంగాల్ లో అర్థఫాసిస్టు నిర్బంధ కాలంలో కాంగ్రెసు గూండాలు, పోలీసులు ట్రేడ్ యూనియన్ కార్యకర్తల, నాయకులకు చెందిన ఇరవై వేల కుటుంబాలను తమ నివాస ప్రాంతాల నుంచి తరిమివేశారు. అందులో అత్యధిక కుటుంబాలవారు గ్రామసీమలకు వెళ్ళి రైతులను సంఘాల్లోకి సంఘటిత పరుస్తూ రక్షణ తీసుకోగలిగారు. వారికి గ్రామసీమలలో మంచి ఆదరణ లభించింది. ఆ విధంగా రైతు ఉద్యమానికి వీరు ఎంతగానో తోడ్పడ్డారు.

1973 లో నెల్లూరు జిల్లా కోవూరు, నెల్లూరు తాలూకాలలో వ్యవసాయ కార్మికుల కూలి పోరాటం ఉవ్వెత్తున పెల్లుబికింది. పట్టణ కార్మికులు, కార్యకర్తలు వందలాది మంది లారీలలో గ్రామసీమలకు వెళ్ళి ఉద్యమానికి అండగా నిలబడ్డారు వ్యవసాయ కార్మిక కార్యకర్తలతోబాటు వీరు కూడా సమ్మెలకు నాయకత్వం వహించారు. భూస్వాముల పొలాల్లోంచి పోటీ కూలీలను బైటకు తీసుకొచ్చారు. ఈ సంఘీభావ కృషి ద్వారా వ్యవసాయ కార్మికులు తమ కూలి పెంపు పోరాటాన్ని విజయవంతం చేసుకోగలిగారు.

విశాఖ పట్నంపెద్దపారిశ్రామికకేంద్రంగా అభివృద్ధి చెందుతోంది. అక్కడ కార్మికోద్యమం బలపడుతూ విస్తృత మవుతోంది. కాని ఆ మేరకు ఆ చుట్టుపట్ల గ్రామసీమల్లో వ్యవసాయ కార్మిక, రైతు ఉద్యమాలు పెంపొందడం లేదు. సంఘ నిర్మాణం బలపడటం లేదు. పెంపొందుతున్న కార్మికోద్యమం ఇందుకు చొరవ తీసుకోవల్సి ఉంటుంది. ఇలాంటి ఉదాహరణలనేకం గమనించగలం. చుట్టూ వ్యవసాయ కార్మిక, రైతు, తదితర ప్రజాతంత్ర ఉద్యమం పటిష్టంగా లేనిదే కార్మికోద్యమంకూడానిపత్కర పరిస్థితుల్లో బ్రతకలేదు.

రైతాంగం తమకు అభేద్యమైన మిత్రమని కార్మికులకు బోధించేందుకు ప్రతి అవకాశాన్ని వినియోగించుకోవాలి. మనగ్రామీణ ప్రాంతాలలోని దుర్భర పరిస్థితులను గురించి ఆలోచించేట్లు కార్మికుల దృష్టిని మళ్ళించాలి. బూర్జువా–భూస్వామ్య పీడనకు వ్యతిరేకంగా పోరాడేందుకు రైతాంగానికి సహాయపడేట్లు కార్మికులను తేజపర్చాలి. రైతాంగంకష్టాల్లో ఉన్నప్పుడు సంఘీభావాన్ని వ్యక్తంచేయాలి. వ్యవసాయక విప్లవంలేకుండా ఆహారసమస్య పరిష్కారంగాని, కార్మికుల విముక్తి అవకాశం గాని లేదని కార్మికులు గ్రహించేట్లు చేయాలి ఇవి చేయకపోతే కార్మిక – కర్షక మైత్రిని నిర్మించడం సాధ్యంకాదనీ, మనం కార్మికోద్యమ కర్తవ్యాలలో చెప్పుకున్నాం.

## వ్యవసాయక విప్లవ ప్రాధాన్యత

అందుకనుగుణంగానే సి. ఐ. టి. యు. నిబంధనావళిలో ఇలా పేర్కొనబడింది.

"భూమి కోసం, వడ్డీల, కౌళ్ళ, అధిక పన్నుల భారాలకు వ్యతిరేకంగా వ్యవసాయ కార్మికులు, రైతాంగం జరిపే పోరాటానికి సంఘీభావ సంబంధాలను సి ఐ.టి యు. అభివృద్ధి పరుస్తుంది. వ్యవసాయ విప్లవశక్తులకు ప్రతి సహాయాన్ని అందిస్తుంది. కూలి పెంపుదలకోసం, పరిస్థితుల మెరుగుదలకు వ్యవసాయ కార్మికులు జరిపేపోరాటాలకు మద్దతు

# కార్మిక- కర్షక మైత్రి

నిస్తుంది. ఫ్యూడల్ భూసంబంధాలను సంపూర్ణంగా రద్దుచేయనిదే, భూమిపై బడా భూస్వాముల గుత్తాధిపత్యాన్ని తుదముట్టించనిదే ఆర్థిక పరిస్థితులు మెరుగుపడవు అని సి ఐ.టి.యు. విశ్వసిస్తోంది."

ఈ అవగాహనతో మన కార్మికోద్యమాన్ని సమీక్షించుకోవాలి. ఇటీవలకాలంలో అటువంటి మార్పు ప్రారంభమైంది. గిట్టుబాటు ధర విషయంలోనూ, కూలిరేట్ల పెంపు విషయంలోనూ కార్మిక వర్గం లాంఛన ప్రాయంగానే అయినా మద్దతు నివ్వడం మంచి పరిణామం. న్యూఢిల్లీలో అఖిల భారత రైతు ప్రదర్శన జరిపినప్పుడు, వివిధ రాష్ట్రాలలో రైతాంగం ప్రదర్శనలు జరిపినప్పుడు కార్మికులు ఉత్తేజకరమైన స్వాగత సత్కారాలు చేశారు. 1981 జనవరి 19 న జరిగిన కార్మిక సమ్మె డిమాండ్లలో గిట్టుబాటు ధరకు ప్రాధాన్యత నివ్వడం ముదావహం. రైతాంగ చైతన్యాన్ని పెంచేందుకు ట్రేడ్ యూనియన్లు కృషిని ప్రారంభించడం సంతోషకరమైన విషయం. అయితే, మన లక్ష్యాన్ని దృష్టిలో ఉంచుకున్నప్పుడు ఈ కృషితో సంతృప్తి చెందలేము. కార్మిక-కర్షక మైత్రిని సాధించే కృషిలో వ్యవసాయక విప్లవం అవసరాన్ని, ప్రాధాన్యతనుగురించి కార్మికులలో చైతన్యం కలిగిస్తున్నామా లేదా అనేది గీటురాయిగా ఉండాలి.

ఈ సందర్భంలో లెనిన్ బోధించిన ఈ క్రింది విషయాన్ని గుర్తుంచుకుందాం.

"ఎన్ని కార్యక్రమాలైనా సరే, పవిత్ర వాగ్దానాలైనా సరే ఆచరణలో ప్రత్యక్ష కార్యాలు జరగనప్పుడు అవి ఎందుకూ పనికి రాకుండా పోతాయి. అందువల్ల కమ్యూనిస్టు నాయకులు, కార్మిక నాయకులు ప్రపంచంలో అన్నింటి కంటే కార్మికవిప్లవాన్ని వృద్ధిచేయడమే అతీతమైన విధిగా భావించి మహత్తర త్యాగాలు చేయడంవల్లనే ఈ విషయం రుజువు కాగలదు. నాశనం నుంచి, సామ్రాజ్యవాద యుద్ధం నుంచి, దరిద్రం. ఆకలి నుంచి తప్పించుకునేందుకు ఇంతకంటే మరొక విముక్తి మార్గంలేదు."

విప్లవ ప్రాధాన్యతను గురించి లెనిన్ చేసిన బోధ అది. అట్టి విప్లవ సాధనకు కార్మిక-కర్షక మైత్రి కీలకమైనదనే విషయం మనమెన్నడూ మరువరానిది. ఈ మైత్రిని గురించి కొంగ జపం చేసినంత మాత్రాన ప్రయోజనముండదు. కార్యాచరణలో నిగ్గు తేలినప్పుడే దాని శక్తి మనకు తెలుస్తుంది. అప్పుడే కార్మిక-కర్షకోద్యమాలు ముందుకు పోగలవు. ఎటువంటి దాడులు ఎదురైనా తట్టుకుని నిలబడగలం. అందువల్ల కార్మిక-కర్షక మైత్రిని సాధించనంతకాలం మనకు భవిష్యత్తు లేదు. పట్టణాల్లోని కార్మికోద్యమం-గ్రామ సీమలలోని వ్యవసాయ కార్మిక, రైతుఉద్యమాలు ఒకదానినొకటి పెనవేసుకుని ముందుకు పోయినప్పుడే మన లక్ష్యాన్ని చేరుకోగలం. అటువంటి కృషిని సాగిస్తామని మార్క్స్ శతవర్ధంతిసందర్భంగా శపథం చేద్దాం!



# దిగజారుతున్న కార్మిక వర్గస్థితి - పెరుగుతున్న పారిశ్రామికుల సంపద

భారతదేశంలో కార్మికవర్గం ఎంతో సుఖ పడి పోతున్నదని, వారిజీతాలు అంతకంతకు పెరుగుతున్నాయని ఒక వాదన కార్మికవర్గం సంఘటిత పడినందున ఇలా జీతాలు పెంచు కుంటున్నదంటారు.మరింత దుర్భరపరిస్థితిలో వున్న వ్యవసాయ కార్మికులను, అసంఘ టిత కార్మికులను చూపి కార్మికవర్గం ఎంతో సుఖపడుతున్నట్లు బూర్జువావర్గం ప్రచారం చేస్తున్నది.

కాని వారి నిజపరిస్థితి ఏమిటి?

భారతదేశంలో 1854లో మొదటిమిల్లు ప్రారంభమైంది. అదే సమయంలో రైల్వేలు నిర్మించడం ప్రారంభమైంది. అప్పటినుండి ఈనాటివరకు వారివేతనాలలో వచ్చినమార్పు లను పరిశీలిస్తూ అనేక రచనలు వచ్చాయి.

వాటిలో యిచ్చిన సంఖ్యా వివరాలను పాఠకులకు అందిస్తున్నాము.

"1857-1956ల మధ్య భారతదేశ అర్థిక రంగ చరిత్ర" అనేగ్రంథం అనేక వ్యాసాల సంపుటి. అందులో ప్రఖ్యాత కార్మికోద్యమ చరిత్రకారుడు ప్రొఫెసర్ జర్గన్ కుజెనెస్కీ "1880-1850 మధ్య కార్మికుల స్థితిగతులు" అనే వ్యాసం ప్రచురించారు. దాని ప్రకారం

పారిశ్రామిక కార్మికుల డబ్బు రూపంలో వేతనం, జీవన వ్యయ సూచీ, నిజవేతనాలు పరిశీలించారు అంకెలు పరిశీలించండి.

(1900-100)

| సంవత్సరాలు | డబ్బు రూపంలో వేతం | జీవన వ్యయసూచీ | నిజవేతనాలు |
|---|---|---|---|
| 1880-1889 | 78 | 69 | 127 |
| 1890-1899 | 94 | 85 | 112 |
| 1899-1909 | 107 | 97 | 111 |
| 1909-1919 | 135 | 143 | 98 |
| 1920-1929 | 211 | 207 | 103 |
| 1930-1938 | 184 | 143 | 129 |

పై అంకెలను గమనిస్తే అర్థమయ్యేదేమిటి?

1880-1889 మధ్య 10 సంవత్సరాలలో సంపాదించుకున్న వేతనం తరువాతకాలంలో క్రమేపి పడిపోతూ, 98కి దిగజారింది. 1920 నాటికి సంఘటిత కార్మికోద్యమం ప్రారంభ మైంది. అనేక పోరాటాలు సాగించింది ఆ పోరాటాల ఫలితంగా ఆ దశాబ్దంలో పరిస్థితి కొంత మెరుగైంది. అయినా పైన పేర్కొన్న మొదట దశాబ్దపు జీతం పొందలేదు. 1938 నాటికి అంటే మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వం పైన పేర్కొన్న మొదటికాలంలో వున్న జీతాలను తిరిగి పొంది రు. 2/- లు జీతం ఎక్కువ సాధించుకున్నది.

1880తో పోల్చుకుంటే ఈరెండు రూపా యల జీతం పెరిగింది. కాని అదే గ్రంథంలో 1900 సంవత్సరాలలో నూరు రూపాయలని పై వ్యాసంలో తీసుకున్న ప్రాతిపదికనే తీసుకొని 1857 తో జీతాలను పోలుస్తూ శ్రీ కె. ముఖర్జీ మరో వ్యాసం రాశారు. దాని ప్రకారం

పారిశ్రామిక కార్మికుల నిజవేతనాలు

| | | | |
|---|---|---|---|
| 1857 | 167.0 | 1911 | 100.6 |
| 1880 | 107.2 | 1939 | 163.4 |

ఈసంఖ్యా వివరాలను పరిశీలిస్తే1939లో పారిశ్రామిక కార్మికుని నిజవేతనం 1857 కన్నా తక్కువగా వుంది.

తరువాత కాలం పరిశీలిద్దాం.

1939 తర్వాత నెలకు రు 200 ల కన్నా తక్కువ వచ్చే కార్మికుని జీతాల లెక్కలే అందుబాటులో వున్నాయి.

1969లో భారత ప్రభుత్వం నియమించిన జాతీయ కార్మిక కమిషన్ తన రిపోర్టు 188 పేజీలో ఈ విధంగా పేర్కొన్నది.

"14.17"1939-51మధ్య నిజవేతనాలు- డబ్బురూపంలో సరాసరి పెరిగే జీతాలు నిజ వేతనాల గురించి స్పష్టం చేయలేవు. వాటిని బట్టి ఎలాంటి అభిప్రాయానికి రాలేము. ఈ మార్పులను అంచనా కట్టేందుకు ధరల్లో మార్పులను పరిగణలోనికి తీసుకున్నాము. 1939-49 మధ్యకాలంలో పారిశ్రామిక కార్మికుల జీవన ప్రమాణ సూచిక ఏదీ అధి కారయుతంగా అందుబాటులోలేదు. అందువల్ల లేబర్‌బ్యూరో తయారు చేసిన వినిమయ ధరల ప్రమాణాన్ని ( భారతదేశస్థాయి ) ఆధారంగా తీసుకొని డబ్బురూపంలోని ఆదా యాలను సరిచేసి చూస్తే 1940 నుండి నిజ వేతనాలు తరిగిపోవడం ప్రారంభమైందని చెప్పవచ్చు. ఆ తరుగుదల 1943 వచ్చేసరికి 1939తో పోలిస్తే 33 శాతం తగ్గింది. 1945 నాటికి మరలా కొంత పెరగడం ప్రారంభ మైంది. క్రిందయిచ్చిన 14.2 టేబుల్‌ను పరి శీలిస్తే స్వాతంత్ర్యం తరువాత నిజవేతనాలు క్రమేణ పెరుగుతున్నట్లు కనిపిస్తుంది. ఈ పెరుగుదల 1947 పారిశ్రామిక వివాదాల చట్ట ప్రకారం నియమించిన పారిశ్రామిక ట్రిబ్యునల్సు యిచ్చిన పెరుగుదల తీర్పులతో ఖచ్చితంగా ముడిపెట్టవచ్చు. అయితే యుద్ధ

14. 2 నిజవేతనాల సూచీ టేబిల్

| సం॥ | జీతాల సూచీ | సం॥ | జీతాలసూచీ |
|---|---|---|---|
| 1939 | 100.0 | 1945 | 74.9 |
| 1940 | 108.6 | 1946 | 73.2 |
| 1941 | 103.7 | 1947 | 78.4 |
| 1942 | 89.0 | 1948 | 84.4 |
| 1943 | 67.0 | 1949 | 91.7 |
| 1944 | 75.1 | 1950 | 90.1 |
| | | 1951 | 92.2 |

# ప్రభుత్వ వర్గ విధానాలకు వ్యతిరేకంగా

కాలంలో (1939-45) నిజవేతనాలలోవచ్చిన నష్టం 1950నాటికికూడా పూడలేదు. దేశంలో ప్రణాళికలు ఆవిర్భవించేసమయానికి 1939తో పోలిస్తే నిజవేతనాలు 10 శాతం తక్కువగా వున్నాయి."

1857 కన్నా 1939లో జీతాలు తరిగాయి. 1951 నాటికి 1939 కన్నా 10 శాతం జీతాలు తక్కువ వస్తున్నాయని అధికార కమిషన్ పేర్కొన్నది.

స్వాతంత్ర్యానంతరం జీతాల పెరుగుదలకు ట్రిబునల్ తీర్పులు కారణమని కమిషన్ అభిప్రాయం వెలిబుచ్చింది. కాని యుద్ధానంతరం కార్మికులలో వచ్చిన పోరాట వెల్లువ, భారతదేశం మొత్తం మీద ప్రజాతంత్ర వుద్యమం - ముఖ్యంగా రైతాంగ వుద్యమం-తీవ్రస్థాయికి చేరుకొనడం దీనికి ప్రధాన కారణం.

## ప్రణాళికాబద్ధ ఆర్థిక విధానంలో

పైన వివరించినట్లు 1951 నాటికి 1939 నాటికన్నా 10 శాతం జీతాలు తక్కువగా వున్నాయి, అనేది కమీషన్ అంగీకరించింది. 1951 తర్వాత జీతాల పరిస్థితి ఎలా వుందో చూడండి.

| సం॥ | డబ్బురూపంలో వేతనాలు | వినిమయ ధరలసూచీ | నిజ వేతనాలు |
|---|---|---|---|
| 1951 | 100.0 | 100.0 | 100 0 |
| 1952 | 107.1 | 98.1 | 109 2 |
| 1953 | 107.7 | 101.0 | 106.6 |
| 1954 | 107.7 | 96.2 | 112 0 |
| 1955 | 113.1 | 91.4 | 123.7 |
| 1956 | 115.4 | 100.0 | 115.4 |
| 1957 | 120.8 | 105.7 | 114.3 |
| 1958 | 122.3 | 110.5 | 110.6 |
| 1959 | 126.4 | 115.2 | 109.7 |
| 1960 | 134.4 | 118.1 | 113.8 |
| 1961 | 138.6 | 120.0 | 115.5 |
| 1962 | 144.0 | 123.8 | 116.3 |
| 1963 | 145.2 | 127.6 | 113.8 |
| 1964 | 151.4 | 144.8 | 104;6 |

కమిషన్ రిపోర్టు 189 పేజీలో యిచ్చిన సమాచారం.

1951లో వున్న జీతం92.2. కాని దానిని సూచీలో యిచ్చేటప్పుడు 100 గా మార్చారు. దానితో పోలిస్తే 1964 నాటికి 104.6 అంటే 4 6 శాతం జీతాలు పెరిగినట్లు లెక్క.

1961 నుండి మరలా కొత్త పద్ధతిన లెక్కలువచ్చాయి. 200 వందల లోపు జీతాల వారినికాక 400 లోపు జీతాల వారిని ఒకటిగా లెక్క కట్టడం ప్రారంభించారు. అంతేగాక 1961 లో వచ్చే జీతం 100 గా లెక్కవేసి ప్రాతిపదిక సంవత్సరంగా రూపొందించారు.

వారి జీతాల లెక్కలు పరిశీలించండి.

| నెలకు 400 కు తక్కువ వచ్చే కార్మికుల సంవత్సర ఆదాయాలు | |
|---|---|
| 1961 | 100 |
| 1966 | 95 |
| 1971 | 101 |
| 1975 | 66 |

ప్రణాళికా సంఘంచే "ఈమధ్య కాలపు జీతాల ధోరణులు" అనే అధ్యాయంలో పేర్కొన్న వివరాలు.

అంతేకాదు, 1978 లేబర్ ఇయర్ బుక్‌లో ప్రచురించిన ప్రకారం నాలుగు వందల లోపు నెలకు జీతం తీసుకునే వారి నిజవేతనాలు 1962-1975ల మధ్య 34.95 శాతం పడిపోయాయి.

దీనినిబట్టి 1857 నుండి 1939 వరకు జీతాలు తగ్గాయి. 1939 నుండి 1951 నాటికి 10 శాతం తక్కువ వున్నాయి. 1951-1964 మధ్య 4. 6 శాతం పెరిగాయి. కాని 1962-1975ల మధ్య 34.95 శాతం తగ్గింది. అంటే పెరుగుదల నామమాత్రం కాగా, తరుగుదల విపరీతంగా వుంది దీనినిబట్టి అటు బ్రిటిష్ ప్రభుత్వ హయాంలోను, ఇటు కాంగ్రెస్ హయాంలోను కూడా కార్మికుడు వేతనాలు కోల్పోవడమేతప్ప మరొకటి లేదు. ఈనాటికీ కార్మికుడు పొందుతున్నది 1857 నాటికన్నా పెరిగిన ధరలతో పోలిస్తే ఎక్కువకాదు.

యింకా వివరాలు పరిశీలించండి.

ఫ్యాక్టరీ కార్మికుల సరాసరి డబ్బు నిజ వేతనాలు

| సం॥ | ఫ్యాక్టరీ కా॥ సరాసరి వార్షిక ఆదాయం | వినిమయ ధరలసూచీ | సరాసరి వార్షిక నిజవేతనాలు |
|---|---|---|---|
| 1968 | 2446 | 177 | 1384 |
| 1969 | 2558 | 175 | 1479 |
| 1970 | 2726 | 184 | 1482 |
| 1971 | 2821 | 190 | 1485 |
| 1972 | 3000 | 202 | 1485 |
| 1973 | 3214 | 236 | 1362 |
| 1974 | 3119 | 304 | 1026 |
| 1975 | 3158 | 321 | 984 |

1982 ఏప్రిల్ 27న పార్లమెంటరీసలహా సంఘ సమావేశంలో నెలకు 400కు తక్కువ ఆదాయం వచ్చేవారి నిజవేతనాలు 1960-100 కాగా, 1973-92 కు, 1976లో 67కు తరిగిపోయాయని కేంద్ర కార్మిక మంత్రి ఆమోదించారు.

పైన వివరించిన లెక్కలన్నీ వినిమయ ధరలసూచీ సరియైనది అనుకున్నప్పుడే. వినిమయ ధరల సూచీ తయారీయే పెద్దదగాఅని కార్మిక వర్గం, నిర్మాణయుతకార్మిక సంఘాలు స్పష్టీకరిస్తున్నవి. ఎంతో ఆందోళన తర్వాత భారత ప్రభుత్వం రాత్ కమిటీని నియమించింది. వినిమయ ధరల సూచీని సవరించాలని ఆ ప్రభుత్వమే నియమించిన ఆ కమిటి సహితం సిఫార్సు చేసింది.

ఈ సిఫార్సును ఆమోదిస్తేకమిటీ సూచించిన సవరణల ప్రకారం లెక్కవేస్తే ఈ నిజవేతనాలు యింకా తగ్గుతాయి.

ఈ తరుగుదల అంతా రు 400 లోపు వచ్చేవారి లెక్కలేగదా అని ఎవరైనా అనవచ్చు. కాని మొత్తం కార్మికుల వేతనాలు పరిశీలించినా ఇదే స్థితి.

1981 మే 'రిజర్వు బ్యాంక్ బులిటన్'లో మూడు సంవత్సరాలలో వివిధ పరిశ్రమలలో ఉత్పత్తి విలువలలో ఎంత శాతం కార్మికునికి వస్తున్నదో కొన్ని లెక్కలువేశారు అత్యధిక పరిశ్రమలలో మొత్తం మీద ఈ శాతం తరుగుతున్నదని దానినిబట్టి గమనించ వచ్చు.

# పోరాడడమే కార్మికవర్గ కర్తవ్యం

## 1011 ఎన్నుకున్న మధ్యరకం, భారీ పరిశ్రమలలో (ప్రైవేట్ రంగం) జీతాల శాతం

| పరిశ్రమ | పరిశ్రమ గ్రూపు | ఉద్యోగులకిచ్చే ప్రతిఫలం ఉత్పత్తి విలువలో శాతంగా | | |
|---|---|---|---|---|
| | | 1975-76 | 1976-77 | 1977-78 |
| 1. | టీ తోటలు | 33.8 | 32.7 | 31 4 |
| 2. | ఖనిజగని పరిశ్రమలు | 10.4 | 10.3 | 11.1 |
| 3. | ధాన్యం, పప్పులు | 2 5 | 2.6 | 2.4 |
| 4. | వంట నూనెలు | 3.2 | 2 6 | 1 9 |
| 5. | పంచదార | 12.5 | 13 6 | 12 9 |
| 6. | ఇతర అహార వుత్పత్తులు | 9.8 | 8.7 | 9 8 |
| 7 | నూలు వస్త్రాల పరిశ్రమ | 17 8 | 16 3 | 15 5 |
| 8. | సిల్కు, రేయన్ వస్త్రాలు | 10.1 | 10.9 | 12.2 |
| 9. | ఉన్ని పరిశ్రమ | 11.2 | 11.2 | 13.5 |
| 10. | ఇంజనీరింగ్ | 13 5 | 13.0 | 13.6 |
| | 1) రవాణా యంత్రాలు | 15.7 | 15 6 | 15 8 |
| | (వాటిలో మోటారు వాహనాలు) | 16 3 | 16 0 | 16 8 |
| | 2) విద్యుత్ యంత్రాలు, పరికరాలు | 9 5 | 8 1 | 8 7 |
| | 3) రవాణా. విద్యుత్‌కాని యంత్ర పరిశ్రమ | 15.6 | 17.2 | 18 6 |
| | 4) ఫౌండ్రీలు, వర్క్‌షాపులు | 11 1 | 1..3 | 11 7 |
| | 5) ఖనిజ పరిశ్రమ | 15 6 | 14.7 | 15 1 |
| 11. | రసాయనాలు | 9 1 | 8.1 | 7.0 |
| | 1) మౌలిక పారిశ్రామిక రసాయనాలు | 6 3 | 5.6 | 6 6 |
| | 2) మందులు, ఫార్మస్యూటికల్ తయారీ | 13.2 | 12.5 | 12 2 |
| | 3) రంగులు, వార్నిష్‌లవంటి వుత్పత్తులు | 10.0 | 9 5 | 11 4 |
| | 4) ఇతర రసాయన పదార్థాలు | 7.1 | 6.0 | 4 5 |
| 12. | రబ్బరు, రబ్బరు వుత్పత్తులు | 9.9 | 12.4 | 12.4 |
| 13. | కాగితం. కాగితం వుత్పత్తులు | 9.9 | 10 5 | 9 7 |
| 14. | గాజు, గాజుపాత్రలు | 17 9 | 16 3 | 16 5 |
| 15. | నిర్మాణం | 19 7 | 20 2 | 24.4 |
| 16. | వ్యాపారం | 3 8 | 3 3 | 3.7 |
| 17 | నౌకా రవాణా | 19 4 | 18 5 | 15 5 |
| 18. | హోటళ్ళు, రెస్టారెంట్లు మొదలైనవి | 18 5 | 17 2 | 16 9 |
| | మొత్తం | 10.6 | 10.2 | 10 5 |

పై లెక్కల వివరాలు పరిశీలించినా వాటి కెవరికైనా మొత్తంపైన కార్మికవర్గం పూర్తిగా తన జీతాల్లో కోత ననుభవిస్తున్న విషయం అర్థం చేసుకోగలరు.

వర్కర్లు ఉత్పాదన పెంచాలని భారత ప్రభుత్వం ముఖ్యంగా ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ చెప్తూ వుంటారు. కార్మికులు శక్తికి తగినట్లు పనిచేయడం లేదనే బూర్జువా వర్గ ప్రచారం సహితం అమాయకులను మోసగిస్తున్నది.

వివిధ పరిశ్రమలలో 1960-77 మధ్య ఉత్పదనా శాతం ఎలా పెరిగిందో, దానితో పోలిస్తే విజవేతనాల పెరుగుదల శాతం ఎలా వుందో పరిశీలించండి.

| | ఉత్పాదన పెరుగుదల | విజవేతనాల పెరుగుల |
|---|---|---|
| | శాతం | శాతం |
| 1. మౌలిక పరిశ్రమలు | 19.91 | 18.90 |
| 2. యంత్రపరికరాల పరిశ్రమ | 77.57 | 37.60 |
| 3. మధ్యంతర వస్తు పరిశ్రమ | 16.11 | 9.77 |
| 4. వినిమయ వస్తూత్పత్తి పరిశ్రమలు | 22.36 | 4.46 |

కాబట్టి వుత్పాదనతో పోల్చినా కార్మికుల జీతాలు బాగా వెనుకబడే వున్నాయి.

లేబర్ బ్యూరో మాజీ డైరెక్టర్ ఈ సందర్భంగా తన పరిశీలనను "ఇండియన్ లేబర్ జర్నల్" 1980 సెప్టెంబరు సంచికలో ప్రకటించారు.

దాని ప్రకారం 1960-1977-78ల మధ్య కార్మికుల సరాసరి వార్షికజీతాలు 22 3 శాతం పెరిగాయి. అదేకాలంలో కార్మికుని వార్షిక ఉత్పాదన సరాసరి 50 3 శాతం పెరిగింది.

అయితే కార్మికుని కొల్లగొడుతున్న ఈ సంపద ఎక్కడ చేరుతున్నదీ మనం ఒకసారి పరిశీలించాలి.

భారతదేశంలో పెట్టుబడిదారీ విధానం అవలంబింపబడుతున్నది. ఈ విధానం మూలంగా కార్మికులు, ఇతర కష్టజీవులు కొల్లగొట్టబడుతుంటే టాటా - బిర్లాలవంటి సంపన్నులు మరింత సంపన్నులు అవుతున్నారు.

ఉదాహరణకు టాటా - బిర్లాలకు కలసి వున్న ఆస్తుల పెరుగుదలను గమనించండి.

(కోట్ల రూపాయల్లో)

| సంవత్సరం | ఆస్తి |
|---|---|
| 1951 | 107 |
| 1956 | 412 |
| 1964 | 710 |
| 1966 | 963 |
| 1968 | 1160 |
| 1972 | 1231.35 |
| 1978 | 2221 |
| 1979 | 2620 |

1978–1980ల మధ్య బిర్లాల లాభాలు 110 03కోట్లకు పెరిగింది. వాం కంపెనీలలో చెల్లించిన పెట్టుబడి 188.55కోట్లు పెరిగింది. బిర్లాలలాభం 121 15కోట్లు చెల్లించిన పెట్టుబడి 167.11కోట్లు పెరిగింది.

ఇతర కంపెనీల ఆస్తుల పెరుగుదలను సహితం గమనించండి.

| కంపెనీ పేరు | 1958 | 1970 |
|---|---|---|
| మార్టిన్ బర్న్స్ | 74 | 176 |
| మఫత్‌లాల్ | 46 | 156 |
| బంగూర్ | 36 | 140 |
| శ్రీరాం | 21 | 108 |
| సూరజ్‌మల్ | 57 | 103 |
| | (1964) | |
| ఏ. పి. పి. | 77 | 121 |
| థాపర్ | 23 | 115 |
| వాల్‌చంద్ | 48 | 101 |

గత సంవత్సరమే కొన్ని పారిశ్రామిక సంస్థల ఆస్తులు ఎంత శాతం పెరిగాయో గమనించండి. ఇవన్నీ ఈ మధ్యనే 'ఎకనామిక్ టైమ్స్' పత్రిక ప్రకటించింది.

| కంపెనీ పేరు | గత సంవత్సరం కన్నా పెరిగిన ఆస్తి శాతం |
|---|---|
| 1) ఫెర్రో అల్లాయీస్ కార్పొరేషన్ | 111.9 |
| 2) స్టార్ ప్రోడక్ట్స్ | 108.6 |
| 3) ప్రైమన్ కార్ట్స్ | 61.6 |
| 4) కిర్లోస్కర్ కమ్మిన్స్ | 57.2 |
| 5) ఇండియన్ రేయాన్స్ | 53.2 |
| 6) అశోక్ లేలాండ్ | 51.6 |
| 7) బజాజ్ ఆటో | 50.1 |
| 8) ఆంధ్రా వాలీ | 46.4 |
| 9) తాతా పవర్ | 44.5 |
| 10) రేమాండ్ వులన్స్ | 44.0 |

# కార్మికవర్గ పరిస్థితి

అలాగే లాభాల పెరుగుదల ఎంత శాతమో చూడండి.

| కంపెనీ పేరు | పెరిగిన లాభాల శాతం |
|---|---|
| 1) జె. కె. ఇండస్ట్రీస్ | 478.9 |
| 2) ఇండియన్ ఎక్స్‌ప్లోజీవ్స్ | 350.0 |
| 3) శ్రీ రాయలసీమ పేపర్ | 324 4 |
| 4) హిందూస్తాన్ కన్‌స్ట్రక్షన్ | 319 5 |
| 5) మంగళూర్ కెమికల్స్ | 221.5 |
| 6) భద్రాచలం పేపరు | 183.7 |
| 7) బరోడా రేయాన్ | 153.4 |
| 8) హిందూస్థాన్ మోటార్స్ | 132 4 |
| 9) ఢిల్లీ క్లాత్ అండ్ జనరల్ మిల్స్ | 123 0 |
| 10) తాతా పవర్ | 122.0 |

దీనిని బట్టి మనం అర్థం చేసుకోవలసింది ఏమిటి?

ఎన్నో త్యాగాలు చేసి, ఎంతో రక్తం ధారపోసి, వృత్తులు కోల్పోయి సాగించిన పోరాటాలు మన జీతాలను, జీవన ప్రమాణాలను నిలబెట్టుకునేందుకు మాత్రమే వుపయోగించాయి.

ఈపోరాటాలు జరగకపోయివుంటే యజమానులు మనలను మరింత దోచుకునేవారు.

జీతాలనైతే పెంచుకుంటున్నాము. వాటి ఫలితాలు మనకు దక్కకుండా ధరలు పెంచే విధానాన్ని ప్రభుత్వం అనుసరిస్తున్నది. ఈ విధానం అటు నిర్మాణయుత కార్మికవర్గాన్నే కాదు కావి తిని బ్రతికే ప్రజలందరినీ కొల్లగొడుతున్నది. సంపన్నులను మరింత కుబేరులను చేస్తున్నది.

ఈ ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా పోరాడకుండా, తనకు అనుకూలమైన రాజకీయ వ్యవస్థను సాధించుకోకుండా కార్మికవర్గం తనను తానుగాని, మొత్తం సమాజాన్ని గాని విముక్తి చేసుకోలేదు.

అందుకే సి.ఐ టి యు. ప్రస్తుత ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా పోరాడమని కార్మికవర్గాన్ని కోరుతున్నది. ★

* బీడీ కార్మికులకు ఇండ్లు కట్టించే పథకానికి ఇంటికి అయ్యే ఖర్చులో 50 శాతంగాని రు 3000 లు గాని ఏది ఎక్కువ అయితే అది యిస్తామని కేంద్ర ప్రభుత్వం బీడీ కార్మికుల గృహవసతి పథకాన్ని సవరించింది.

# విప్లవం సాధించినచోట

సోవియట్ యూనియన్‌లో కార్మికవర్గం రాజ్యాధికారాన్ని సంపాదించుకున్నది. తన జీవనపరిస్థితులను మెరుగుపరుచుకుంటున్నది. ప్రపంచపీడిత ప్రజలకు అండగా నిలుస్తున్నది.

ఆ దేశపు కార్మికవర్గ జీవన ప్రమాణం ఎలా పెరుగుతున్నదో గమనించండి.

| సంవత్సరం | మొత్తం ఆదాయం (రూబుళ్లు) | కనీస ఆదాయం (రూబుళ్లు) |
|---|---|---|
| 1940 | 40 6 | 33 1 |
| 1960 | 107.7 | 80 6 |
| 1965 | 129.2 | 96.5 |
| 1970 | 164 5 | 122.0 |
| 1975 | 198.9 | 145.8 |
| 1976 | 206 7 | 151.4 |
| 1977 | 212.2 | 155.2 |
| 1978 | 219.1 | 159.9 |
| 1979 | 224.6 | 163.3 |
| 1980 | 232.7 | 168 9 |
| 1981 | 238 0 | 172.5 |

గమనిక: ఒక రూబుల్ ప్రస్తుతమారకం రేటు ప్రకారం రు. 13 లు.

# దారిద్ర్యరేఖకు దిగువన

1977–78 లో దేశంలో 30 కోట్ల 46 లక్షలమంది దారిద్ర్యరేఖకు దిగువన బ్రతుకుతున్నారు.

గ్రామీణప్రాంతాలలో నెలకు రు 65లు, పట్టణ ప్రాంతాలలో నెలకు రు 75/–లు కన్నా తక్కువ తలసరి ఖర్చువుంటే అలా తక్కువ ఖర్చుపెట్టే ప్రజలను దారిద్ర్యరేఖకు దిగువన వున్నవారుగా పరిగణిస్తారు. ఈ లెక్క 1977–78 ధర వరలను అనుసరించి వేసిన అంచనా.

ఈ నికృష్టపు దారిద్ర్యంలో 25 కోట్ల 28 లక్షల మంది గ్రామీణ ప్రాంతంలో నివసిస్తున్నారు.

# కంప్యూటర్లొస్తున్నాయ్ జాగ్రత్త!

## కథానిక

ఈ యంత్ర యుగంలో ఏ రాష్ట్ర ప్రభుత్వమయినా 'కంప్యూటర్ల' మంత్రి పదవికి ప్రత్యేకంగా ఎవరినయినా ఎన్నుకోదలిస్తే సులభంగా దొరకగలిగేది అణుశాస్త్రి అనిమనవి చేస్తున్నాను. అణుశాస్త్రి అసలు పేరు పదేళ్ళగతంలో అణాశాస్త్రి అని పిలవబడేవాడు. అదేమిటి? అనే ఆశ్చర్యం కించిత్తు కలగవచ్చు. అనాడు అంటే పాతనాణాల విలువ క్రొత్త నాణాల కాలానికి పరకాయ ప్రవేశం చేసేదశలో, సదరు అణా శాస్త్రి, కామేశం అనే ఒక వ్యక్తికి పుత్రరత్నంగా జన్మఎత్తాడు, కామేశానికి కాస్త ఆధ్యాత్మిక చింతనతోపాటు సెంటిమెంట్లువుమ్మెత్తకాయ పరిమాణంలో టంకం వేసినట్టు వుండటమువల్లను, అంతక్రితం పుట్టిన బిడ్డలు సీరియల్‌గా చనిపోవటం చేతను, ప్రబంధాలు దండిగా చదివిన పదబ్రహ్మ శాస్త్రి 'అణా శాస్త్రి' అనిపేరు బియ్యంలో వ్రాసిపారేశాడు. భవదీయుడయిన అణాశాస్త్రిని చాలా మంది 'అణా' అంటే ఏమిటి, అని ప్రశ్నిస్తే పీఠిక లగాయితు ముగింపు వరకు వెరసి పది నిమిషాలు పాతనాణాల గురించి చెప్పవలసి వచ్చేది. ఆ కాలం మీద బొత్తిగా నమ్మకం లేని అణాశాస్త్రి, పరమాణుశక్తి ప్రకోపపరమావధిని బట్టీయంచేసి, తర్క సహజమైన తత్వంతో 'అణు శాస్త్రి' అని పేరు దిన పత్రికల్లో డిక్లేర్ చేసి పారేశాడు.

యీ అణుయుగంలో యంత్రాల లోకోపకార సౌందర్యం గురించి, నవసృష్టిలో కంప్యూటర్ల గురించి ఏ బోగట్టా కావలసినా మన అణుశాస్త్రి శబ్దార్థ చంద్రిక లేదా వస్తుగుణదీపిక లాంటివాడు.

అణుశాస్త్రి ఒక పెద్ద ఆఫీసులో చిన్న ఎకౌంటెంట్. చూపులకు చిల్లరప్రాణిలా కనిపిస్తాడు. పాలిస్టర్ పాంటు, దేశవాళిఖద్దరు చొక్కా ధరిస్తాడు. అతనిది చిన్నసంసారం. కాని 'చింతలేని సంసారం' అని మాత్రం అనలేం. ఎందుచేతంటే భార్య, యిద్దరు పిల్లలతోపాటు తండ్రి, తల్లి బాధ్యతకూడా అతనే స్వీకరించాలి.

ఆరోజు—

చిన్నముల్లు నిదానంగా ఐదు మీదకు వచ్చేసరికి, పెద్దముల్లుహడావుడిగా పన్నెండు మీదకు రావటంతో గడియారం ఐదుగంటలు వాయించేసింది!

అణుశాస్త్రి కాల్యుకిలేటర్‌ని సొరుగులో దాచే ప్రయత్నంలో ఒకసారి దాన్ని నింపాదిగా చూసుకున్నాడు. తననెవరు చూడని స్థితిలో దాన్ని ముద్దుపెట్టుకున్న సందర్భాలు వున్నాయ్.

ఎంచేతంటే?

తన బుర్రలో శ్రమ శక్తిని తగ్గించిన అపురూప పరికరం అది. లక్షలు గాని, కోట్లు గాని, కూడికలు తీసివేతలు వగైరాలన్నిటినీ టపీ టపీమని వేలుతో నొక్కి ఆన్సర్ అడిగి ఆనందపడిపోతాడు. చాలాసార్లు అది జీవుడయితే 'థాంక్స్' అని 'నీవు ఏజన్మబంధంతో నాతో సంబంధం పెట్టుకొని సేవ చేస్తున్నావ్ అనేవాడు' అంత మాత్రమే కాకుండా తన అర్ధాంగి అరుంధతికంటే అపురూపంగా ప్రేమించేవాడు. అసలు ఆ కాలిక్యులేటర్ ఆఫీసుకు వచ్చిన కొత్తలో దాన్ని చేత ధరించి ఓపిగ్గా డ్యూయెట్ కూడా పాడిన సందర్భాలున్నాయ్.

అలాంటి కాలిక్యులేటర్‌ని సొరుగులో వుంచి ప్రియురాలికి దూరమవుతున్నంత బాధగా ఓ నిట్టూర్పు వదిలి బయట పడ్డాడు.

కాళ్ళీడ్చుకుంటూ రోడ్డుమీదకు వచ్చాడు.

రోడ్డుమీద కొందరికి నడిచే హక్కుంటే, యింకొందరికి వాహనాలమీద తిరిగే హక్కు వుంది. ఐతే వాహనాలమీద తిరిగేటప్పుడు ధరావతు చెల్లించటం వల్ల ఆ హక్కు కోల్పోవటం జరుగుతుంది.

జేబులో చెయిపెట్టి పర్సుతీసి, ఒకఅరలో పదికాగితాన్ని చూశాడు. బస్సులో వాడికి యిస్తే. కండక్టర్ శిఖామణి తనను భిక్షకుడు కంటే హీనంగా చూస్తాడు. అందుకు దాన్ని మార్చాలి.

ఓ బడ్డీ ముందుకు వెళ్ళాడు "రెండు పనామాకింగ్ సిగరెట్లు, ఒక సోడా యివ్వు" అన్నాడు.

పెందుర్తి మాష్టర్జీ

కొట్టు వ్యక్తి పదినోటు మధ్యలో దారం వుందేమోచూసి, చూపుడు వేలుతో రెండు దెబ్బలు టపీ టపీ మని వేసి తనకు కావలసింది యిస్తున్నాడు.

'యేందేశమోయిది?' నిట్టూర్చాడు. అణుశాస్త్రి.కొట్టువాడు రిమార్కబుల్‌గా చూశాడు అణుశాస్త్రి దేశం గురించి మాట్లాడిన సందర్భంఏమిటో అతనికి అంతు పట్టలేదు. అందుకే అణుశాస్త్రి ముఖంలోనికి అదోలా చూశాడు. ఆచూపుల్ని చదివేశాడు అణుశాస్త్రి

"ఏంలేదు. అమెరికాలో అయితే ఈ బాధ వుండదు. అన్నీ మనిషిలేని కొట్లే, ఒక టోకెన్ వేసి సిగరెట్లు, సోడాలు తీసుకోవడమే"

"అమెరికాలో సోడాలు కూడా వుంటాయండి"

"యింకా నయం బంక బీడీలు వుంటాయండి అని అడగలేదు. అది అమెరికా కాప్టెలిస్ట్‌కంట్రీ, సోడాలువాళ్ళెందుకు తాగుతారు."

"అమెరికాను పొగుడుతూ సోడా ఎందుకు తాగుతున్నారు గోల్డ్‌స్పాట్ ఎందుకు తాగకూడదు" అన్నాడు కొట్టువాడు.

యుక్తిగా లెంపకాయ ప్రసాదించినట్లయింది అణుశాస్త్రికి. యిక అతగాడితో కామెంట్ అనవసరం అనుకున్నాడు.

అప్పటికే చిల్లశీర చేతిలోపడటంతో అణుశాస్త్రి బస్‌స్టాపు వైపు కదిలాడు. ప్రవాహంలా జనం దారుణంగా పెరిగిపోతుంది. తన చిన్నప్పుడు ముక్కోటి ఆంధ్రులు అనేవారు. యిప్పుడో ఆరుకోట్ల మంది ఆంధ్రులు.

ఎడమచేతిని విచ్చలవిడిగా ఎడమచేతి వైపే సంచరింపచేస్తూ, అభినయలక్షణంతో నడుస్తున్నాడు.

అతనిముందు యిద్దరు నడుస్తున్నారు.

పొత్తివంచె, ఖద్దరు చొక్కానుబట్టి పల్లెటూరి మనుషులని తెలుస్తుంది. ఇద్దరూ విలాసంగా రెండువైపులా వున్న షాపులవైపు చూస్తున్నారు. ఆ చూపుల్లో కాస్త మోతాదు ఎక్కువలో శ్రద్ధా కనిపిస్తోంది.

"నిజంరా, వాచీలో రేడియో పెట్టేశారంటే, పేతి వాచీలో రేడియో పెట్టటమంటే ఏటి?" అంటున్నాడు ఒకడు.

"నీది మరీసిత్రంరా"నమ్మనట్లు అన్నాడు రెండోవాడు.

# కంప్యూటర్లొస్తున్నాయ్ జాగ్రత్త !

"నీ ముఖం, పేటి వాచిలో సిల్మా కూడా చూపించే రోజులు వస్తున్నాయంట"

"చహ్. మరీ బూటకం చెప్పమాకు."

అణుశాస్త్రికి ఆరాటం ఎక్కువయింది.

ఒకనిది ప్రవృత్తి మార్గం! రెండోది నివృత్తి మార్గం!!

"ఒరేయ్! నువు చూస్తావుండు మనుసులు రోడ్డుమీద నడవరు, అంతా పైనే"

"పైనా?"

"మరె.... పచ్చుల్లా పైన తిరుగుతారు''

"అంటే"

"అంటే ఏముంది. ఆఫీసులో ఎగరటం, యింట్లో వాలటం సిల్మాకెల్లాలనుకో అక్కడ నుండి సిన్మా హాలుమీద వాలటం, అంటే ఆకాశంలో ట్రాపిక్ పోలీసులు తిరుగుతా వుంటారు."

"అవును మనుషులు పచ్చుల్లా ఎగరటమేంట్రా?"

"కాలమహత్యం, గాస్ బూరా ఎల్లిపోతందా? మనిసి అట్టాగే పోతుంటాడు."

"సత్రమే మరి"

అణుశాస్త్రికి భావ ఆనందం కలిగింది.

వరమశివణ్ణి ప్రార్థిస్తున్న కాలంలో కూడా పల్లెవాసులకు, పరమాణుశక్తి కి పరిశోధనాభిమానం వున్నందుకు పరవశుడయి పోయాడు. అణుశాస్త్రికి కుతూహలం అధికమయినా బస్టాండ్ వచ్చేయటంతో కాళ్ళు ఆటోమాటిక్‌గా ఆగిపోయాయ్.

లేకపోతే_

వారికి కాఫీ సమర్పించి యంత్రయుగంలో వింతలు గురించి అధ్యాయాల వారిగా చెప్పే వాడు.

బస్ రానే వచ్చింది. తనవిజ్ఞాన మేధస్సు గురించి వారికి చెప్పలేక పోయినందుకు మనస్సులో సంతాపం తెలుపుకొని బస్సు ఎక్కాడు. కొన్ని నిమిషాలు వేలాడినా, ఒక సీటు లభించడంతో బరువుగా కూర్చుండి పోయాడు అణుశాస్త్రి.

"ఏమయినా యీ ఆయుధపోటీతో సృష్టి అంతమయిపోయేలా వుందండి" తన ముందు సీటులో వున్న యిద్దరిలో ఒకడన్నాడు.

"మరే"

"అయినా యీ అమెరికా వారికి యిదేం పోయేకాలమండీ! 'నాచిన్నప్పుడు ఒక దిన పత్రికలో యేమని అఘోరించారో తెలుసా? తొలుత అణుబాంబును కనిపెట్టింది, మేమే, ప్రయోగించింది మేమే, యీ అణుబాంబులు వాడకూడదని చెపుతుంది మే మే అని చెప్పారు "

"దేనికయినా సమర్థులండి. హిరోషిమా, నాగసాకిని చూసికూడా వారికి బుద్ధి, జ్ఞానం లేదంటే ఏమనగలం?"

"అనేదే ముంది. అప్పుడు అణుబాంబు, యిప్పుడు న్యూట్రన్ బాంబు యంత్ర యుగం అనుకోవటమే గాని యిప్పుడు వున్న వుపద్రవాలు గతంలో లేవు"

అణుశాస్త్రికి కించిత్తు కోపం వచ్చింది.

"ఓరి దుర్మార్గా! ఎలా తెల్లవాడి తెలివిని తూలనాడేదవు, అడెడదవు పో! _ ఏలా న్యూట్రన్ బాంబును విమర్శించెదవు, చేసేదవు పో! ఏలా యంత్ర యుగమును నిందించెదవు_ నిందించెదవు పో! ఏలా నా ముందు ఎక్కెదవు"సుయోధన సార్వభౌమునిలెవల్లో మాట్లాడాలనుకున్నాడు.

కాని అంతలో దిగవలసిన స్టాప్ దర్శనమివ్వటంతో దిగేశాడు. యంత్ర యుగాన్ని విమర్శించినందుకు చింతాక్రాంతుడయి యిల్లు చేరుకున్నాడు

అసలు నడుస్తున్న చరిత్ర శుభోదయం నుండి సూర్యాస్తమయం వరకు యంత్రాల మీదే నడుస్తుంది.

కాఫీకి గాస్, ఆఫీసుకు బస్, వార్తలకి రేడియో, లగరీకి టి. వి., వంటకి కుక్కర్, స్నానానికి షవర్‌బాత్, ఎవరో మహానుభావుడు అన్నట్లు_

"'మనిషి' అనే వండర్‌ఫుల్ మిషన్ ఎన్ని మిషన్లను తయారుచేస్తుందో!"

అణుశాస్త్రి అర్ధాంగియిచ్చిన కాఫీ సేవించి స్నానం ముగించి సాఫీగా సోఫాలో కూర్చుని రేడియో ఆన్ చెయ్యాలనుకున్నాడు.

"శాస్త్రీ!" వరండాలో తండ్రి పిలిచాడు

అణుశాస్త్రి యాంత్రికంగా వరండాలోకి నడిచాడు.

తండ్రి కామేశం ఎవరో పల్లెటూరి వ్యక్తితో మాట్లాడుతున్నాడు "ఈయన గుర్తున్నాడా? మనవూరే. మనప్రక్కవీధిలో వుండేవాడు" అంటూ అతన్ని గురించి అణుశాస్త్రికి చెప్పాడు.

అణుశాస్త్రికి వాస్తవంగా గుర్తు రాలేదు. అయినా ఒక నవ్వు నవ్వి 'పనిమీదవచ్చారా' ప్రశ్నించాడు.

"పనిలేకే వచ్చాం బాబు" అన్నాడు ఆ వ్యక్తి నమ్రతగా.

అణుశాస్త్రి నుదురు చిట్లించాడు.

కామేశం అందుకున్నాడు. "దిక్కుమాలిన కాలం. మనవూరి భూములన్నీ నాసరయ్యావేగా? ఈమధ్య కూలీలకి అతనికీ కూలిడబ్బుల గొడవ వచ్చిందట యింకేముంది? ట్రాక్టర్లు దిగుమతి చేయించాడు. అన్ని పనులు యంత్రాలు చేస్తే కూలీలు బ్రతికేదెక్కడ?? మన కూలీల జీవనాధారం పడిపోయింది."

అణుశాస్త్రికి ఆ మాటలకు అర్థంటుగా కోపం వచ్చేసింది.

అయినా పైకి ఏమనలేదు.... మనిషిచేసే పని హాయిగా యంత్రం చేస్తుంది. చేయించుకునే యజమానికి ఎంత సుఖం. యిలాంటి వాళ్ళతో తర్కించటం ఆరోగ్యప్రదం కాదు అని సరిపెట్టుకున్నాడు

ఆ రాత్రి తెల్లవారింది.

ఆఫీసులో తన సింహాసనం మీద అధిష్ఠించిన అణుశాస్త్రికి తాజాగా నోటీసు వచ్చింది. గజగజ వణికిపోయి, గాబరాపడిపోయాడు. వర్తమాన జగత్తంతా తన ముందే భగ భగ మండిపోతున్నట్లనిపించింది.

''తనను ఆరు నెల్లలో వుద్యోగం నుండి తొలగించటం జరుగుతుంది. తనతో పాటు మరో పదిమందిని ఆఫీసులో నుండి తొలగిస్తున్నారు. యిందరు చేసే పని ఒకే ఒక కంప్యూటర్ చేస్తుందట_" యిదీ నోటీసులో విషయం.

లోకమంతా గాండాంధకారమయింది.

కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయ్ శరీరం తూలిపోతుంది. ఎన్ని దృశ్యాలు.... కంప్యూటర్ తనలాంటి ఎందరినో పాదాలక్రింద తొక్కుతున్నట్లనిపిస్తోంది .... మేధస్సు మొద్దుబారింది.

ట్రాక్టర్ల క్రింద కూలీజనం....

కంప్యూటర్ల క్రింద తనలాంటివాళ్లు ....

రానున్నకాలం.... ఏమవుతుంది?

మనిషి మనుగడ ఎక్కడా?.... ఎక్కడా?

ప్రశ్నలు.... ప్రశ్నలు.... ప్రశ్నలు....

* * *

జాతీయ వేతన విధానం రూపొందించేందుకు నిపుణుల కమిటీకి నివేదించనున్నట్లు కేంద్ర కార్మికమంత్రి చెప్పారు. కార్మికుల వేతనాలకు గరిష్ఠ పరిమితిని గూడ నిర్ణయించాలట!

కార్మిక లోకానికి మే డే శుభాకాంక్షలు

నాణ్యతకు, మన్నికకు, పేరెన్నికగన్న రేమాండ్స్, దిగ్జామ్,

షూటింగులకు, షర్టింగులకు

# శ్రీ హేమరాజ్ సిల్క్ ప్యాలెస్

*మెయిన్ బజారు, విజయవాడ - 1*

---

కార్మికలోకానికి 'మే డే' శుభాకాంక్షలు

పెళ్ళిళ్ళకు, శుభకార్యములకు అవసరమైన అన్నిరకముల
వస్త్రములకు దయచేయండి.

అన్నిరకాల వస్త్రాలపై 40 శాతం వరకు తగ్గింపు

# రూప్ సంగమ్

ఫిలింఛాంబర్ హాల్

*గాంధీనగర్, విజయవాడ - 3*

# దోపిడిని అంతం చేసేందుకు దీక్ష పట్టాల్సిన దినం 'మేడే'

పెట్టుబడిదారీ విధానం పుట్టడంతోనే, దానికి గోరీకట్టే కార్మికవర్గమూ వుద్భవించింది.

దోపిడికి, దాని కూలద్రోతకు శాస్త్రీయమైన అవగాహన లేని దినాలవి. కార్మికుల కడగండ్లు, సంపన్నుల సుఖజీవితాలు చూచిన కార్మికవర్గం తన జీవితాన్ని సుఖమయం చేసుకోవాలనే ఆకాంక్షతో ప్రయత్నిస్తున్న రోజులు.

ప్రాథమిక ట్రేడ్‌యూనియన్ చైతన్యం ఏర్పడగానే ఒక యజమానితో పోరాడటం కాక, యజమానివర్గంతోనే పోరాడక తప్పని స్థితి కార్మికవర్గానికి ఎదురైంది. మరింత విశాల ప్రాతిపదికపై సంఘటితపడాలనికార్మిక వర్గం నిశ్చయించుకుంది.

తన వేతనాలను పెంచుకోవాలని కోరింది. జీతాల్లో తరతమ తేడాలున్న కార్మికవర్గానికి తరతమ వినాదాలు వుండేవి.

కాని అందరినీ బాధపెట్టి, సామాన్య సమస్యగా రూపొందింది పనిగంటల సమస్య.

ఈనాడు 8 గంటల పని అనేది అందరూ ఆమోదించిన వినాదం. అత్యధిక రంగాలలో అమలుకొచ్చినది గూడా. కనీసం చట్టం ఆ హక్కునిస్తున్నది.

కాని ఒక నాడు పొద్దు పొడవగా ప్రారంభించి అస్తమానంతో పని నిలిపేవారు. విద్యుచ్ఛక్తి వచ్చిన తర్వాత పని గంటలు మరింత పెరిగాయి.

ఆస్థితికి వ్యతిరేకంగా అతి భీకరమైన పోరాటం సాగింది. అనేకులు ఆత్మార్పణ చేశారు. ఉరికంబాలకు బలైనారు. ఆత్యాగ ఫలితాలే ఈ రోజు కనీసం చట్టం దృష్టిలోనైనా 8 గంటలపని ఆమోదింప చేసుకోగలిగాయి.

ఇలా ప్రపంచ వ్యాపితంగా 8 గంటల పని నాగరిక జీవుల చేత ఆమోదింపజేసిన కథే 'మేడే' కథ.

అది అమెరికాలోని ఫిలడెల్ఫియా రాష్ట్రములో 1806వ సంవత్సరం సంఘం పెట్టుకున్న నేరానికి కార్డు వెయినర్స్ సంఘ నాయకులపై కుట్రకేసు బనాయించారు. ఆసందర్భంగా వెల్లడైన వాస్తవాలనుబట్టి ఫిలడెల్ఫియాలో కార్మికులు 19 నుండి 20 గంటల వరకు పని చేయాల్సివస్తున్నదని వెల్లడైంది.

ఇదే సమస్యపై 1824లో రొట్టెల పరిశ్రమ కార్మికులు సమ్మెచేశారు. అప్పుడూ ఈ విషయాలే వెల్లడైనాయి.

ఆనాడు కార్మికుల నినాదం "రోజుకు 10 గంటల పని."

ఈ నినాదంతో మొదట 1827లో ఫిలడెల్ఫియాలోని భవన నిర్మాణం కార్మికులు సమ్మె చేశారు. అది త్వరలో ఒక ఉద్యమంగా రూపొందింది. ఈ వుద్యమ ప్రథమ ఫలితం పొందినవారు. అమెరికన్ ప్రభుత్వోద్యోగులు. దాని ననుసరించి అనేకపరిశ్రమలు సహితం విడివిడిగా ఈ హక్కును సాధించుకున్నాయి.

విజయంపొందిన కార్మికవర్గం "8గంటల పని" నినాదం ఇచ్చింది. 1866లో అమెరికానంతటినీ కలిపే నేషనల్ లేబర్ యూనియన్ ఏర్పడటంతో ఎనిమిది గంటలపని నినాదం దేశవ్యాప్తమైంది. అప్పటికే ఆస్ట్రేలియాలో ఈ నినాదం యివ్వడమేగాదు సాధించుకున్నారు గూడా.

ఈ నినాదం, కోరిక పశ్చిమదేశాలతోనే ఆగలేదు.

1853లో భారత దేశంలో రైల్వేల నిర్మాణము ప్రారంభమైంది. 1857 లో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రారంభమైంది. క్రూరంగా అణచివేయబడింది. అప్పుడే శైశవావస్థలోనే వున్న భారత కార్మిక వర్గం 1862 ఏప్రిల్-మే లలో హౌరా స్టేషనులో పనిచేసే 1200 మంది కార్మికులు ఎనిమిది గంటల పనికోసం సమ్మె చేశారు.

ఈ విధంగా కార్మికవర్గం ఆవిర్భవించిన చోటల్లా ఈ నినాదం మారుమ్రోగింది. కార్మికులను సంఘటిత పరచింది. పోరాటాలలోకి లాగింది.

1867లో నేషనల్ లేబర్ యూనియన్ ఏర్పడడంతో అమెరికా కార్మిక వర్గాన్నిఒకే వేదికపై సమీకరించే సంఘం ఏర్పడింది.

మొదటిసదస్సు "పెట్టుబడిదారీ బానిసత్వం నుండి ఈ దేశ కార్మికులను విముక్తులను చేసేందుకు, అమెరికన్ యూనియన్ లోని రాష్ట్రాలన్నింటా 8 గంటల పని దినాన్ని సాధారణ పని కాలంగా నిర్ణయిస్తూ చట్టం చేయించడం ప్రథమ కర్తవ్యం" అని తీర్మానించింది.

అంతేకాదు, కార్మికవర్గ ప్రయోజనాలను కాపాడేందుకు నిలిచే అభ్యర్థులను శాసన సభలకు ఎన్నుకునేలా కృషి చేసే రాజకీయ కర్తవ్యాన్ని సహితం ఆసదస్సు నిర్దేశించింది.

ఇలాంటి తీర్మానాన్నే జెనీవాలో మొదటి అంతర్జాతీయ సంస్థ సహితం 8 గంటల పని నినాదాన్ని ఆమోదించింది. దీని తో ఈ నినాదం పశ్చిమ దేశాలన్నిటా కార్చిచ్చులా వ్యాపించింది. "యావత్ప్రపంచ కార్మికుల సామాన్య వేదిక" అయింది.

1884అక్టోబరులో అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్ ఈ క్రిందివిధంగా తన శాఖలను ఆదేశించింది.

1886 మే ఒకటినుండి 8 గంటలే చట్టబద్ధ పనిదినంగా చేసుకోవాలి. అందుకు అన్ని యూనియన్లు తమ నిబంధనలను సడలించుకొని కార్యాచరణకు సిద్ధం కావాలి.

20 నెలలుముందుగా ఈ నిర్ణయంచేశారు. ఈ పోరాటం జయప్రదం అయ్యేందుకు ఐక్య కార్యాచరణను ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదన కార్మికవర్గ ఆలోచనలకు అద్దం పట్టింది. ఆ నినాదం కార్మికవర్గానికికరదీపికై మొత్తం కార్మికులను కదనరంగానికి నడిపింది. యూనియన్లలో మూడు, నాలుగు రెట్లు సభ్యులు చేరారు.

## చికాగో పోరాటం

మేడే వచ్చింది. సర్వ సన్నాహాలతో కార్మికవర్గం తన నిర్ణయాన్ని అమలు జరుపబూనుకుంది. అమెరికానంతా అట్టుడికించిన ఈ మహోద్యమం చికాగోలో అగ్నివర్షమై భగ్గుమన్నది. కార్మికులంతా తమ

# పనిగంటల తగ్గింపుకై మనదేశ కార్మికుల పోరాటం

టూల్స్ క్రింద పడేసారు. సమ్మెలో చేరారు. చికాగో నగరం మానవ మహాసముద్ర రూపం, ప్రదర్శనా తుఫానుల రూపం ధరించింది.

శత్రు శిబిరం మిన్నకుంటుందా? మొత్తం రాజ్యాంగ యంత్రశక్తినంతా మొహరించింది ప్రదర్శనలను అడ్డుకొనడం, చెదరగొట్టడం ప్రారంభమైంది.

ఈ దాగుడుమూత మే 3 వ తేదీన మెక్ కార్మిక్ రీపర్స్ వర్క్స్ అనేచోట బద్దలైంది.

అక్కడ వేలాదికార్మికులు గుమిగూడారు సభ జరుపుకున్నారు. లేచిపోయే ముందు ప్రభుత్వ కిరాతక తుపాకులు గుండ్లు కక్కాయి. ఆరుగురు కార్మికులను బలిగొన్నాయి. ఎందరో గాయపడ్డారు.

నిరసన.... నిరసన .... నిరసన వెల్లువ ప్రారంభమైంది. ఈ వెల్లువలన్నీ 'హే మార్కెట్' మానవ మహాసముద్రంలో కలిశాయి. సభలో ద్వేషం ప్రదర్శించారు. కాని అది ముక్త కంఠంతో నినాదాలు యివ్వడానికే సరిపెట్టుకుంది.

కాని ప్రత్యర్థులు ఆక్రోధావేశాలసాకుగా మరో దాడికి యత్నించారు. సమీకరణఅయిన జనం తమను ఢీ కొంటారని. అది సాకుగా మరో రక్త యజ్ఞం జరపచ్చని పొంచి కూర్చున్నాయి. జనం వారికి ఆ అవకాశం యివ్వలేదు కాని వారు ఆ రోజును వృధా పోనియ దలచలేదు. తమ ఏజంటుచేత సమావేశం పైకి బాంబు విసిరేయించారు. అది ఆసరాగా పోలీస్ యంత్రాంగం వేటకుక్కల్లా కార్మికులపై దాడిచేసింది.దాడి,ఆత్మరక్షణ.... వేలాది కార్మికులు, వందలాదినిప్పులుకక్కుతున్న తుపాకులు,ఏడుగురు పోలీసులు మరణించారు. నాలుగు కార్మిక జ్యోతులు ఆరిపోయాయి.

హే మార్కెట్ మట్టి కార్మికులరక్తంతో జేవురు రంగు పులుముకుంది

ఆ రక్త దానం కార్మిక వర్గానికి అరుణ పతాకం బహూకరించింది.

అసంఘటిత కార్మిక వర్గం, తదుపరి గమ్యం లేని నాయకత్వం, శాస్త్రీయ సోషలిజం ఇంకా అందరూ ఆమోదించని కాలం. లక్ష్యంలేని ప్రజాసైన్యం చెల్లా చెదరైంది. పెట్టుబడి దారీ వర్గం ప్రథమ విజయం సాధించాననుకొని, దానిని మరింత తీవ్రతరం చేసింది.

నలుగురు ట్రేడ్ యూనియన్ నాయకులపై కుట్రకేసులు, హత్యానేరాలుమోపారు.

బానిస బ్రతుకుల
ఆకలి రోతల
అంతంచేయగ
కదలిరా !
తిండి వుంటే స్వేచ్ఛ
స్వాతంత్ర్య మంటే భుక్తి

అంటూ ప్రపంచానికి నిజాన్ని చాటుతూ పురికంబాలెక్కారు వారు.

1888....అమెరికన్ కార్మికవర్గం కోలుకుంది. మేడేను స్మరించుకొనే సాంప్రదాయం నుండి తిరిగి పోరాటాల దినంగా మార్చాలని భావించింది. 1890 నుండి తిరిగి ఎనిమిది గంటల పని వుద్యమానికి దీక్షబూనారు.

ఈసారి అమెరికన్ కార్మికులకు ప్రపంచ శ్రామికుల అండకై కృషి చేశారు.

1889 జూలై 14న రెండవ అంతర్జాతీయ సంస్థ ఆవిర్భవించింది. అమెరికాలో పని గంటల పోరాటదినంగా పాటిస్తున్న 'మేడే'ను అంతర్జాతీయ కార్మికదినంగా పాటించాలని తీర్మానించింది.

ఈ తీర్మానం ఐరోపా అంతటా ప్రతిధ్వనించింది. సోషలిస్టు వ్యతిరేక చట్టాలను సహితం ధిక్కరించి జర్మనీ కార్మికులు సమ్మె చేశారు. అమెరికాలో సరేసరి.... దేశాన్నంతటినీ మరోసారి కుదిపివేసింది

ఆనాడు ఏంగెల్సు యిలా రాశారు : "నేను ఈ వాక్యాలు రాస్తున్న సమయంలో ఐరోపా అమెరికాలలోని కార్మికవర్గం తన శక్తి సామర్థ్యాలను సమీక్షించుకుంటున్నది. చరిత్రలో మొదటిసారిగా కార్మికవర్గం ఒకే సైన్యంగా, ఒకే పతాకంకింద, ఒకే తక్షణ లక్ష్యంకోసం సమీకృతమైంది. 8 గంటల పని చట్టబద్ధం కావాలన్నదే ఆ లక్ష్యం.ప్రస్తుతం మనకు కనిపిస్తున్న ఈ దృశ్యం అన్నిదేశాల కార్మికులూ ఒకటేనని భూస్వాములు పెట్టుబడి దారులు గుర్తించేందుకు తోడ్పడుతుంది."

1893 జ్యూరిచ్ అంతర్జాతీయ మహాసభ నాటికి మేడే లక్ష్యం విస్తృతం అయింది 8 గంటల పనిదినం తక్షణ లక్ష్యం కాగా "సామాజిక పరివర్తన ద్వారా వర్గ వ్యత్యాసాలను బద్దలుకొట్టాలనే కార్మికవర్గ దృఢ సంకల్పాన్ని చాటిచెప్పే" కర్తవ్యం చేర్చారు.

ఈ సంప్రదాయం మనదేశంలో సహితం కొనసాగింది. 12 నుండి 18 గంటల వరకు పనిచేసే కార్మికులు తమ పనిగంటలు తగ్గించాలని అనేక పోరాటాలు సాగించారు.

ఇది భారతదేశం. దీని సంస్కృతి భిన్నమైనది. ఇక్కడ వర్గపోరాటం పనికిరాదు. ధర్మకర్తృత్వం మనవారసత్వం అని గొప్పలు చెప్పి, దోపిడీని మరుగుపరచే ట్రేడ్ యూనియన్ నాయకులు మనకు వున్నారు.

కాని చరిత్ర ఇందుకు భిన్నంగా వుంది. భారతదేశంలో సహితం కార్మికవర్గం పోరాడి రక్తం చిందించి పనిగంటలు తగ్గించుకోవలసి వచ్చేది.

అంతేగాదు, ఒక వలస దేశంలోని కార్మికులుగా వారు వలసదేశ భారాన్ని, తమ పెట్టుబడిదారుల దోపిడిని గూడ ఎదిరించాల్సి వచ్చింది.

తమకు ఏలాంటి చట్ట బద్ధ రక్షణాలేదు. ఫలితంగా తమ సంఘటిత శక్తితోనే వారు తమ జీవన పరిస్థితులను మెరుగుపరచుకునే ప్రయత్నం చేసేవారు.

ఒకటి రెండు వుదాహరణలు గమనించండి.

ఒక సర్దారు దుర్మార్గుడు. కార్మికులందరినీ వేధిస్తున్నాడు. అతనిపై చర్యతీసుకొని, ఉద్యోగం నుండి తొలగించాలని కార్మికుల డిమాండ్. మిల్లు ముందు ప్రదర్శన జరుపుతున్నారు. యూరోపియన్ యజమానులు తుపాకీ పేల్చి ఇద్దరిని బలిగొన్నారు.

తమ జీతాలు పెంచమని, బక్రీద్ నాడు పనికి రానందుకు ఆపిన జీతం యివ్వమని మరో చోట కార్మికులు పోరాడారు.అక్కడా యజమానులే కాల్పులు జరిపారు.

# ఈ 'మే డే' న జాతి విముక్తికి ప్రతిజ్ఞ పడదాం

ఇలా చీటికి మాటికి యాజమానులు తుపాకులు వుపయోగించడాన్ని అనాటి లెఫ్టినెంట్ గవర్నర్ నిరసించారు.

ఇవి ఫ్యాక్టరీ లేబర్ కమిషన్ రిపోర్టు చూపిన నిదర్శనాలే.

## పని గంటలకై పోరాటం

1862లో ఎనిమిది గంటల పనికై హౌరా రైల్వే కార్మికులు సాగించిన సమ్మె ముందే వివరించాను. కార్మికవర్గం ఆవిర్భవించే కొద్దీ అవి మరీ ఎక్కువ కాసాగాయి.

1905 నాటికి విద్యుత్ దీపాలు వచ్చాయి. అప్పటికే 12 నుండి 17 గంటల వరకు పని చేస్తున్న కార్మికులను మరి కొంతకాలం పని చేయాలని యజమానులు వత్తిడిచేయసాగారు.

"ఇటీవల జరుగుతున్న మిల్లు కార్మికుల ఆందోళన సందర్భంగా నిన్న సాయంత్రం (అక్టోబరు 8) పెద్దగొడవ జరిగింది. దాదాపు మూడు, నాలుగువేల మంది మిల్లు కార్మికులు పరేల్‌లోని డిస్లే రోడ్‌మీద వున్న మిల్లుల ముందు వుద్రేకపూరితమైన ప్రదర్శనలు చేశారు. ఈ ఆందోళన చేసిన కార్మికులు సూర్యాస్తమయం తరువాత పనిచేయడానికి నిరాకరించడమేగాక, సాయంకాలం తరువాత పనిచేసే కార్మికులను పనిచేయకూడదని నిరోధించారు.... ప్రదర్శకులలో చాలామందిని ప్రాసిక్యూట్ చేశారు.

('అమృతబజార్' పత్రిక క్రిందిగీతలు నావి)

విపరీతమైన పనిగంటలు, నికృష్టమైన జీతాలతో అపరిమితమైన దోపిడీకి దేశంలో కార్మికులు గురౌతున్నారు. అనేకులు ధార్మికులు ఈ పరిస్థితిపట్ల ఆందోళన వ్యక్తం చేసేవారు. కార్మికులను ఆదుకోవాలని చూపేవారు.

అతి హేయ్యకరమైన ఈ దోపిడితోనే లాంక్‌షైర్ (ఇంగ్లండ్) బట్టల పరిశ్రమతో స్వదేశీ పెట్టుబడిదారులు పోటీపడేవారు. ఈ పోటీనుండి తమను రక్షించుకోడం పేరిట బ్రిటిష్ పెట్టుబడిదారులు భారతదేశంలో పని గంటల విషయం ఆందోళన చేశారు.

ఇక్కడి ధార్మికుల ప్రబోధాలు, కార్మికుల యాధృచ్ఛిక పోరాటాలు, అక్కడి యజమానుల వత్తిడితో భారత ప్రభుత్వం టెక్స్‌టైల్ లేబర్ ఎన్‌క్వైరీ కమిటీ (ఫ్రీయర్ స్మిత్) ని నియమించింది. ఇంతా ఆ కమిటీ యిచ్చిన సిఫార్సు ఏమిటి? రోజుకు 12 గంటలు వారానికి 72 గంటలకు మించి పని ఉండరాదని. అంటే అప్పటికి ఇంకా ఎక్కువ పని గంటలు వుండేవని అర్థం కావడం లేదా?

కాని పెట్టుబడిదారుల "భారతీయాత్మలు" వూరుకోలేదు. వారి ప్రతినిధిగా ప్రముఖ వ్యాపార వేత్త శ్రీ విఠల్‌దాస్ దామోదర్ థాకర్సే ఈ సిఫార్సును ఖండించాడు. "1891 లో ప్రభుత్వం యిచ్చిన వాగ్దానాన్ని ఉల్లంఘించింది. కార్మికులకు (?) పారిశ్రామిక వేత్తలకు ప్రస్తుతం అంగీకారయోగ్యమైన భారతదేశ పరిస్థితులకు అనుగుణంగా వున్న యీ పద్ధతిని మార్చడానికి ప్రభుత్వం జోక్యం చేసుకోడం కేవలం అన్యాయం, అక్రమం" అని కేకలు పెట్టారు,

ఇంతకీ 1891లో ఇచ్చిన వాగ్దానమేమిటి? అప్పటి ఫ్యాక్టరీ లేబర్ కమిషన్ పురుష కార్మికుల పని గంటల విషయంలో జోక్యం చేసుకోరాదని సిఫార్సు చేసింది.

ఫ్యాక్టరీ కార్మికుల పనిగంటలు విషయంలో ఏదో ఒక రకమైన చట్టం 1891లో వచ్చింది. బాల కార్మికులకు 9 గంటలు, మహిళా కార్మికులకు 11గంటలు పనిని చట్టబద్ధం చేసింది.

ఇది అమలుజరగలేదు. 1911లో చేసిన ఫ్యాక్టరీ చట్టం సహితం జౌళి పరిశ్రమలో కార్మికులకు 12 గంటల పనినే విధించింది. అయితే, అంతకుముందు ఎక్కువ గంటలు పనిచేస్తున్నప్పుడు తీసుకునే కూలికి ఎలాంటి రక్షణా చట్టంలో లేదు. ఫలితంగా కూలీలు విపరీతంగా తగ్గించడం ప్రారంభమైంది.

## ఎప్పుడో ఎందుకు...?

అనాడే కాదు, ఈనాడు దేశమంతటా ఎనిమిది గంటల పని వుందా? మన దేశంలో అత్యధిక సంఖ్యాక శ్రామికవర్గం వ్యవసాయ కార్మికులు. వారిలో ఏడాది పొడుగూతా నియమించుకొనే పాలేర్లవంటివారికి పని గంటలు లేవు.

8 గంటలు కాదు 10 గంటల తర్వాత పనిచేయము అని ఆందోళన చేసిన లోకో రన్నింగ్ స్టాఫ్ విపరీతమైన దమనకాండకు గురౌతున్న విషయం మనకు తెలుసు.

అసంఘటిత రంగంలో పనిచేసే కార్మికుల స్థితి మనకంతా తెలుసు.

కాబట్టి 'మేడే' తరువాత కాలంలో రూపొందించిన "అన్ని రకాల దోపిడీలనుండి కార్మికుల విముక్తి" అనే లక్ష్యం ఇంకా మనకు ఎంతో దూరంలో వుంది. సరికదా అది యాదృచ్ఛికంగానే ప్రారంభించిన 8 గంటల పనినైనా యింకా మనం పూర్తిగా సాధించుకోలేదు.

అందుకే భారత కార్మికులకు 'మే డే' దీక్షా దినం కావాలి.

అన్ని రకాల దోపిడీల నుండి విముక్తికి కంకణధారులం కావాలి.

అన్ని రంగాలలో 8 గంటల పనిదినాన్ని సాధించుకునే తక్షణ కర్తవ్యానికి మనం ఈనాడు పునరంకితం కావాలి. ★

## జూట్ కార్మిక సంఘానికి శ్రీ గంగాధరరెడ్డి ఎన్నిక

నెల్లిమర్ల జూట్ కార్మికసంఘ అధ్యక్ష పదవికి ఏప్రిల్ 4వ తేదీన జరిగిన ఎన్నికలలో సి ఐ టి యు విశాఖ కౌన్సిల్ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎస్. గంగాధరరెడ్డి అత్యధిక ఓట్ల మెజారిటీతో గెలుపొందారు.

మొత్తం 5289 ఓట్లు పోలుకాగా శ్రీ గంగాధరరెడ్డికి 3817 ఓట్లు, ఆయన ప్రత్యర్థి తెలుగుదేశం శాసనసభ్యుడు తమ్మిన సీతారామ్‌కు 1567 ఓట్లు వచ్చాయి. 2280 ఓట్ల మెజారిటీతో శ్రీ గంగాధరరెడ్డి ఘన విజయం సాధించారు.

ఈ ఎన్నికల్లో తెలుగుదేశం శాసన సభ్యుడు డబ్బు, వాహనాలు, ప్రభుత్వ యంత్రాంగాన్ని యధేచ్ఛగా వినియోగించుకున్నట్లు తెలుస్తున్నది. అయినప్పటికీ కార్మికులు శ్రీ గంగాధరరెడ్డినే గెలిపించారు. యూనియన్ నాయకత్వ సమస్య గత రెండేండ్లుగా నలుగుతూ వచ్చింది. ఎన్నికలు జరపడానికి తేదీని నిర్ణయించడంతో సహా మొత్తం ఏర్పాట్లను విశాఖపట్నం డిప్యూటీ లేబర్ కమిషనర్ పర్యవేక్షించారు.

యూనియన్ ఎన్నికలలో తనను అత్యధిక మెజారిటీతో గెలిపించిన కార్మికులకు శ్రీ గంగాధరరెడ్డి కృతజ్ఞతలు తెలియజేశారు.

# శేషగిరినగర్: కొత్తగూడెం

# సి. ఐ. టి. యు.
# ఆంధ్రప్రదేశ్
# 4వ మహాసభ
## విశేష సంచిక

"నిజమైన విప్లవ ట్రేడ్‌యూనియన్ ఉద్యమానికి అంకితమౌదాం." ఇదీపి. ఐ. టి. యు. 4వ రాష్ట్ర మహాసభలో ప్రదర్శితమైన ఒకే ఒక ప్రతిన. ప్రతిధ్వనించిన నినాదం.

ఆహ్వానసంఘం అనేక ఇబ్బందులను ఎదుర్కొన్నది. కొత్తగూడెంలో హాలులేదు. ఏర్పడనున్న హాలుకు తాత్కాలిక ఏర్పాట్లతో సమావేశ స్థలాన్ని అలంకరించారు. తగినన్ని వసతి సౌకర్యాలు లేవు. ఉన్నంతలో ఘనంగా చేశారు. అన్నిటినీ మించి మంచి నీటి సరఫరా వ్యవస్థ దెబ్బతిన్నది. మొక్కవోని సాహసంతో వలంటీర్లు నీటి సరఫరా చేయవలసి వచ్చింది.

మహాసభ జరపాలనే తుది నిర్ణయానికి, మహాసభ జరిగేనాటికి మధ్య ఒకే 'పే డే' వచ్చింది. వనరుల సమీ

**1983 ఏప్రిల్ 1, 2, 3**

కరణకు కొంతయిబ్బంది జరిగింది. అయినా ఆహ్వానసంఘం అన్నిఏర్పాట్లు జయప్రదంగా చేసింది

అయినా వారు తమ ఏర్పాట్లలోపాలు చెప్పారు కాని ప్రతినిధులకు ఏర్పాట్లు పట్ల లేదు ఇబ్బందులు గుర్తుకు రాలేదు.

అందరిలోనూ ఒకే ప్రశ్న. 10 ఏండ్ల క్రితం సి ఐ టి.యు. బలమేమిటి? ఈనాడు దాని శక్తి ఏమిటి? సి.ఐ టి.యు. విధానాలను ఎంత ముందుకు తీసుకెళ్ళాం? ఈ విషయంలో ఎదురైన యిబ్బందులేమిటి? ఆంధ్ర ప్రదేశ్‌లో కార్మికవర్గమెంత? దానిలో సి. ఐ. టి. యు. బలమెంత? ఆ బలాన్ని గుణాత్మకంగా పెంచుకొనేందుకు ఏ కర్తవ్యాలు నిర్వహించాలి? ఇవి – ఇవే ప్రశ్నలు. ఈ ప్రశ్నలకు సమాధానాలకై చర్చలు. అందుకే తీర్మానాలు.

ముందు రోజే రిటైరైన సీనియర్ సి.ఐ.టి.యు. కార్యకర్త, దక్షిణ మధ్య రైల్వే ఎంప్లాయీస్ యూనియన్ ప్రధాన కార్యదర్శి సి.ఐ.టి యు పతాకాన్ని ఎగురవేయడంతో ఏప్రిల్ 1న మహాసభ ప్రారంభమైంది. "ఈ జెండా త్యాగాల జండా. మానవ విముక్తికి బాటలు చూపిన జెండా. ఈ జెండా నీడన అనేక విజయాలు సాధించాం మనం. సాధించాల్సింది ఎంతో వుంది. సోషలిస్టు సమాజం సాధించేవరకు మనం విరామం లేకుండా కృషి చేయాలి. ఈ జెండాకు మన జీవితాలను అంకితం చేద్దాం. దాని ఆశయాల విజయానికి ప్రతిజ్ఞ పడదాం" అని ఆయన వుద్బోధించారు

పోలీసు, గూండా దాడులకు గురై అమరులైన కార్యకర్తలకు, చివరికంటా ఉద్యమానికి అంకితమై రాలిపోయిన నాయకులకు, మరణించిన జాతీయోద్యమ కార్యకర్తలకు సంతాప ప్రకటనతో మహాసభ ప్రారంభమైంది.

సి. ఐ. టి యు. రాష్ట్ర అధ్యక్షులు శ్రీ పర్సా సత్యనారాయణ అధ్యక్షత వహించారు. కార్మికవర్గం ఎదుర్కొంటున్న రాజకీయ పరిస్థితిని ఆయనసమీక్షించారు. ప్రపంచ శాంతిని భగ్నం చేసేందుకు, సామ్రాజ్యవాదుల కుట్రలను ఆయన సోదాహరణంగా వివరించారు. అలాగే భారత ప్రభుత్వం కార్మిక వర్గంపై సాగిస్తున్న దాడులను వివరించారు. సంక్షోభం పెరిగేకొద్దీ ఈ దాడులు మరింత తీవ్రమౌతాయని, వాటిని ఎదుర్కొనడానికి రాజకీయంగా, నిర్మాణరీత్యా గూడ కార్మిక వర్గాన్ని సంసిద్ధం చేయవలసివుందని ఆయన ప్రబోధించారు.

ఆహ్వాన సంఘ అధ్యక్షులు, ఖమ్మం మునిసిపాలిటీ చైర్మన్ అయిన శ్రీ చిర్రావూరి లక్ష్మీనరసయ్య గారు ప్రతినిధులకు స్వాగతం పలుకుతూ, కొత్తగూడెంలో బొగ్గు కార్మికుల ఉద్యమ నిర్మాత శ్రీ శేషగిరిరావు జీవితాన్ని ఆయన స్మరిస్తూ, అప్పటినుండి ఖమ్మం జిల్లాలో ఉద్యమం సాగించిన విజయాలను, ఎదుర్కొన్న యిబ్బందులను, పొందిన అనుభవాలను వివరించారు. కార్మిక వర్గం

# మహాసభ విశేషాలు

మహాసభ విశేషాలు

మహాసభ విశేషాలు

మహాసభ విశేషాలు

మహాసభ విశేషాలు

తీవ్రమైనదాడులను ఎదుర్కొంటున్న దశలో ప్రజాతంత్ర-ముఖ్యంగా వామపక్ష ఉద్యమానికి బలమైన ఖమ్మం జిల్లాలో మహాసభ జరగడం హర్షణీయమని, కార్మికోద్యమంలో నూతన మలుపుకు ఈ మహాసభ నిర్ణయాలు దోహదంచేయాలని తమ ఆకాంక్షను వ్యక్తం చేశారు.

సి.ఐ.టి.యు. కేంద్ర నాయకులు, పార్లమెంటు సభ్యులు శ్రీ బాలానందన్ మహాసభను ప్రారంభిస్తూ దేశ పరిస్థితులను సవివరంగా వివరించారు.

రాష్ట్రంలో సి ఐ టి యు విజయాలను, కర్తవ్యాలను వివరిస్తూ ప్రధాన కార్యదర్శి శ్రీ నండూరి ప్రసాదరావు నివేదిక ప్రవేశ పెట్టారు.

కార్యకలాపాల నివేదికను కార్యదర్శి వి. శ్రీహరి ప్రవేశపెట్టారు.

నివేదికలను ఆయా జిల్లాల ప్రతినిధులు, తమ తమ బసలలో కూడి చర్చించారు.

రెండవరోజు ఉదయం వివిధ జిల్లాల ప్రతినిధులు నివేదికలపైన వారి జిల్లాల అనుభవాలను జోడించి అభిప్రాయాలను వ్యక్తం చేశారు. ప్రధాన పరిశ్రమ కేంద్రాలలో, రాష్ట్రవ్యాపితంగా ప్రధాన పరిశ్రమలలో కేంద్రీకరించి పనిచేయాలని, ఆ విధంగా ప్రజాతంత్ర ఉద్యమంపైనే ప్రభావం కలిగించాలని ప్రధాన కార్యదర్శి రూపొందించిన కర్తవ్యంతో అందరూ ఏకీభవించారు.

సంఖ్యారీత్యా రాష్ట్రంలో ఉద్యమం పెరిగినందుకు అంతా హర్షించారు అదే సందర్భంలో రాష్ట్రంలోగల కార్మికవర్గంతో పోలిస్తే మన ఉద్యమం సాధించవలసింది ఎంతో వుందనే విషయంతోనూ అంతాఏకీభవించారు. అలాగే కీలకమైన పరిశ్రమలలో సి. ఐ. టి. యు. బలాన్ని పరిశీలించి, దానిని మరింత పెంచే కార్యక్రమానికి అంకితం కావాలనే విషయాన్ని నొక్కి చెప్పారు.

కార్మికవర్గ ఐక్యత కోసం, ఐక్య కార్యాచరణ కోసం సి. ఐ. టి. యు. రాష్ట్రంలో సాగించిన కృషికి మహాసభ ప్రతినిధులు సంతృప్తిని వెలబుచ్చారు. కార్మికవర్గ ఐక్యత, ఐక్య కార్యాచరణలలో వివిధ జిల్లాలలో వచ్చిన అనుభవాలను ప్రతినిధులు ఎంతో వివరంగా పేర్కొన్నారు. ఐక్య కార్యాచరణ ప్రాధాన్యతను ఇతర సంఘాలు గుర్తించనందుకు, దానికి కొన్ని సందర్భాలలో విఘాతం కలిగిస్తున్నందుకు వారెంతో ఆవేదన వ్యక్తం చేశారు. ఐక్య కార్యాచరణకు ఎక్కువ సందర్భాలలో ఇతర సంఘాలను వెంటబడి ఒప్పించాల్సి వస్తున్నది. అలా అంగీకరించినా చిత్తశుద్ధితో కృషి చేయడం లేదు; కార్యాచరణలో చేరిన సంఘాలు తమ తమ బలాన్ని అంతా కేంద్రీకరించి కార్యక్రమాన్ని జయప్రదం చేయడంలేదు. కొన్ని సందర్భాలలో ఇతరసంఘాలు దీనిని 'మొక్కుబడి' కార్యక్రమంగా మాత్రమే చేపడుతున్నాయని వారు సోదాహరణంగా వివరించారు.

అలాగే ఐక్య కార్యాచరణలో భాగంగా సి ఐ టి.యు. ఏతర సంఘాలలో పనిచేస్తున్న సి ఐ టి.యు కార్యకర్తలు ఎదుర్కొంటున్న యిబ్బందులను సహితం కొందరు ప్రతినిధులు పేర్కొన్నారు. సి ఐ.టి.యు కార్యకర్తలు తమ కార్యకలాపాల ద్వారా కార్మికుల

విశ్వాసం చూరగొని యూనియన్ బాధ్యతల లోనికి ఎన్నుకోబడే అవకాశం వస్తే ప్రజాతంత్ర పద్ధతులనే కాలరాచే పద్ధతులకు వివిధ సి ఐ టి.యు యేతర నాయకత్వాలు పూనుకుంటున్న విషయాలను ప్రతినిధులు మహాసభ దృష్టికి తెచ్చారు.

అయినా ఐక్యకార్యాచరణ విధానానికి, సి ఐ టి.యు యేతర యూనియన్లలో పని చేసే విధానానికి కట్టుబడివుండాలని మహాసభ నిర్ద్వంద్వంగా అభిప్రాయపడింది.

కామ్రేడ్ ప్రసాదరావ్‌గారు చర్చల్లో వచ్చిన అంశాలకు సమాధానమిచ్చిన తర్వాత నివేదిక ఏకగ్రీవంగా ఆమోదించింది మహాసభ.

2వ రోజు మధ్యాహ్నం నుండి ప్రతినిధులు పరిశ్రమలవారిగా విడివడి చర్చలు జరిపారు. పరిశ్రమల్లో ఎదురౌతున్న మొత్తం సమస్యలను వివరంగా చర్చించారు. చర్చలను నివేదికలుగా మహాసభ ముందు వుంచారు. ఆయా పరిశ్రమలలో తక్షణ సమస్యలపై తీర్మానాలు ప్రతిపాదించారు.

మూడవరోజు ఉదయం పారిశ్రామిక నివేదికల వివరణ తీర్మానాలను సభ ఆమోదించింది.

మొత్తం చర్చలను సమీక్షిస్తూ శ్రీ పి. సుందరయ్యగారు ప్రతినిధులను వుద్దేశించి ప్రసంగించారు.

అఖిల భారత శ్రామిక మహిళా కమిటీ కన్వీనర్ శ్రీమతి విమలా రణదివే తమ సందేశం యిచ్చారు.

మధ్యాహ్నం సి. ఐ. టి. యు., 'కార్మిక లోకం' జమాఖర్చులను ప్రధాన కార్యదర్శి ప్రవేశ పెట్టారు.

పాత కమిటీ తరపున నూతన కమిటీ ప్యానెల్‌ను ప్రవేశపెట్టగా మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించింది.

జయజయ ధ్వానాలతో మహాసభ ముగిసింది.

సభానంతరం ప్రదర్శన, బహిరంగ సభ జరిగాయి.

బహిరంగసభకు సి ఐ.టి.యు. రాష్ట్ర కమిటీ అధ్యక్షులు శ్రీ వర్మా సత్యనారాయణ అధ్యక్షత వహించారు.

శ్రీయుతులు నండూరి ప్రసాదరావ్, బాలానందన్, విమలా రణదివే, పి. సుందరయ్య, వి. శ్రీహరి, వర్మాగారలు ప్రసంగించారు. తదుపరి సాంస్కృతిక కార్యకలాపాలు జరిగాయి.

మహాసభ రెండవరోజున శ్రామిక మహిళల సదస్సు జరిగింది. సదస్సులో శ్రామిక మహిళలకు ఒక విజ్ఞాపన ఆమోదించారు. అనేక తీర్మానాలు చేశారు.

శ్రీమతి విమలా రణదివే, శ్రీ బాలానందన్, శ్రీ నండూరి, శ్రీ వర్మా గారలు సదస్సులో పాల్గొన్నారు.

---

### పరిశ్రమల ప్రాతినిధ్యం

| | |
|---|---|
| రైల్వే | 30 |
| ఆర్.టి.సి. | 26 |
| మోటార్ | 20 |
| పబ్లిక్ సెక్టార్ | 51 |
| స్టేట్ సర్వీసెస్ | 37 |
| సెంట్రల్ సర్వీసెస్ | 36 |
| బొగ్గు | 19 |
| కాగితం | 10 |
| సిమెంట్ | 8 |
| టెక్స్‌టైల్స్ | 7 |
| పొగాకు | 17 |
| నిర్మాణం | 3 |
| మునిసిపల్, పంచాయతీ | 7 |
| జూట్ | 7 |
| షెడ్యూల్ పరిశ్రమలు | 34 |
| రసాయనాలు | 11 |
| ఇతర పరిశ్రమలు | 104 |

### ప్రతినిధులు పనిచేస్తున్న సంఘాల అనుబంధం.

| | |
|---|---|
| సి. ఐ. టి. యు. | 294 |
| ఏ. ఐ. టి. యు. సి. | 7 |
| ఐ. ఎన్ టి. యు. సి. | 12 |
| బి. యం. యస్. | 3 |
| హెచ్. యం. యస్. | 13 |
| ఇండిపెండెంట్ | 98 |
| టి. ఎన్. టి. యు. సి. | 1 |

---

## మహాసభ విశేషాలు

మహాసభ విశేషాలు

మహాసభ విశేషాలు

మహాసభ విశేషాలు

---

### అర్హతల సంఘం

#### ప్రాంతాలు

| | |
|---|---|
| హైదరాబాద్ | 95 |
| కృష్ణాజిల్లా | 24 |
| గుంటూరు | 24 |
| కర్నూలు | 25 |
| నల్గొండ | 20 |
| విశాఖ | 43 |
| తూర్పు గోదావరి | 29 |
| పశ్చిమ గోదావరి | 29 |
| నెల్లూరు | 19 |
| ప్రకాశం | 5 |
| ఖమ్మం | 47 |
| శ్రీకాకుళం | 2 |
| మహబూబ్‌నగర్ | 1 |
| ఆదిలాబాద్ | 4 |
| వరంగల్ | 7 |

---

### వివిధ సంఘాలలో ప్రతినిధులు వహిస్తున్న బాధ్యతలు

| | |
|---|---|
| అధ్యక్షులు | 8 |
| ప్రధాన కార్యదర్శులు | 22 |
| కార్యనిర్వాహకులు | 2'5 |
| కమిటీ సభ్యులు | 31 |
| సాధారణ సభ్యులు | 152 |

### ప్రతినిధుల వయస్సు

| | |
|---|---|
| 30 లోపు | 156 |
| 30-40 మధ్య | 153 |
| 41-50 మధ్య | 77 |
| 51-60 మధ్య | 40 |
| 60 పైన | 12 |

### ప్రతినిధులు పనిచేస్తున్న సంఘాల సంఘటితబలం

| | |
|---|---|
| 100 లోపు సభ్యత్వంగల సంఘాలు | 50 |
| 100 నుండి 200 | 42 |
| 200 నుండి 500 | 73 |
| 500 నుండి 1000 | 43 |
| 1000 నుండి 2000 | 26 |
| 2000 కు పైన | 52 |

★

# క్షీణిస్తున్న భారతదేశ ఆర్థిక పరిస్థితి



సి.ఐ.టి.యు. ఆంధ్రప్రదేశ్ నాల్గవ మహాసభ ఒక ప్రత్యేక పరిస్థితిలో జరుగుతున్నది. ఈనాడు మానవాళి న్యూట్రాన్ బాంబు ప్రమాదాన్ని ఎదుర్కొంటున్నది. మొత్తం పెట్టుబడిదారీ వ్యవస్థ సంక్షోభంలో కూరుకొని వుంది. ఈ సంవత్సరమే కారల్ మార్క్స్ శతవర్ధంతి జరుగుతున్నది.

"మార్క్స్ చెప్పిన సిద్ధాంతాలు తప్పు" అని బూర్జువా ఆర్థికశాస్త్రవేత్తలు గత రెండు దశాబ్దాలుగా ప్రచారం చేస్తున్నారు. యుద్ధానంతరం జర్మనీ, జపాన్‌లు అభివృద్ధిచెందిన తీరును వారు వుదాహరణగా చూపేవారు. అమెరికా అభివృద్ధిని చూడమనేవారు. ఐతే వారి మాటలు వారే మింగవలసిన స్థితికి వచ్చారు. 1930 నాటిని మించిన సంక్షోభంతో పెట్టుబడిదారీ ప్రపంచమంతా కూలిపోయింది. సంక్షోభ పరిస్థితిని శ్రీమతి ఇందిరాగాంధి సహితం ఆమోదించక తప్పలేదు. అందరూ సంపన్నమైనదని చెప్పే అమెరికాను పరిశీలిద్దాం. ఈనాడు ఆ దేశంలో కోటీ 20 లక్షల మంది నిరుద్యోగులు - గత చలికాలంలో 20 లక్షల మంది ప్రజలు నిలువ నీడ లేక అల్లాడిపోయారు. నెతురు గూడుకట్టే చలిలో వీధుల్లో కాపురాలు చేశారు. ఆ ప్రభుత్వం గాని, ఏ ధార్మికసంస్థగాని వారిని ఆదుకోలేకపోయింది.

ఒక్క ఫోర్డ్ కంపెనీ కార్మికుల సంగతి చూడండి. ఈ కార్మికుల సంగతి ఎందుకు చెబుతున్నానంటే, సోవియట్‌కు ఒకనాటి ప్రధాని కృశ్చేవ్ ఈ ఫ్యాక్టరీని సందర్శించారు. మాకు కార్లున్నాయ్. ఫ్రిజ్‌లు ఉన్నాయ్. టి. వి. ప్రతి ఇంట్లో వుంది. మీ కార్మికులకు వున్నాయా? అని ఆనాడు ప్రశ్నించారు. ఆ ఫ్యాక్టరీ కార్మికులే ఈనాడు లక్షా పాతికవేలమంది నిరుద్యోగులై వున్నారు. అమెరికా కార్మికులు పైన పేర్కొన్న సౌకర్యాలన్నీ హైర్ పర్చేజ్‌లో కొంటారు. ఉద్యోగం పోగానే వాయిదా బకాయీలకు కొన్న సామాను కంపెనీ పట్టుకెడుతుంది. ఉద్యోగముంటేనే అతనికి అప్పులు పుడతాయి. అదే అతనికి విలువనిచ్చేది. అలాంటి కార్మికులు నేడు నిరుద్యోగులు. ఆలోచించండి- వారి పరిస్థితి ఏమిటో?

ఉక్కు పరిశ్రమ ఏజాతికైనా జీవగర్ర. ఆ పరిశ్రమలో అమెరికా కార్మికులు లక్ష మంది ఉపాధులు కోల్పోయారు. ఈ పరిశ్రమలో 40 శాతం వుత్పత్తి తగ్గించింది ఆ దేశం.

బ్రిటన్‌లో నేడు 14.7 శాతం నిరుద్యోగులు. జర్మన్, జపాన్‌లు గూడ ఇదే పరిస్థితిని ఎదుర్కొంటున్నాయి. అభివృద్ధి ఐన పారిశ్రామిక దేశాల్లో నేడు మూడుకోట్ల లక్ష మంది నిరుద్యోగులున్నారు. వారి మొత్తం జాతీయోత్పత్తి గత సంవత్సరం 1.5 శాతం పెరిగింది. ఈ సంవత్సరం మెరుగు అయి 1.8 శాతం పెరుగుతుందట! నిరుద్యోగం తరగదు. సంక్షోభపు ఇతర లక్షణాలు పోవు. ఇది వారి వార్షిక నివేదిక సారం.

పెట్టుబడిదారీ సమాజంలో మానవ ఉత్పాదనా శక్తి ఎన్నో రెట్లు పెరుగుతుందని మార్క్స్ చెప్పాడు. ఈనాటి శాస్త్రీయ అభివృద్ధి, సాంకేతిక పురోగమనం ఈ విషయం రుజువు చేస్తున్నాయి. మానవజాతి కనీస అవసరాలన్నీ తీర్చగల శక్తి యీనాటికే ప్రపంచానికి వుంది. అయినా పెట్టుబడిదారీ సమాజంలోని ఆంతరంగిక వైరుధ్యాలు దీనిని అసాధ్యం చేస్తున్నాయి.

ఒకనాడు పెట్టుబడి దారులు "స్వేచ్ఛా వ్యాపారం" కబుర్లు చెప్పేవారు. అది యీనాడు "వాణిజ్య యుద్ధం"గా మారింది. ఉదాహరణకు జపాను అమెరికాకు చౌకగా వస్తువులను ఎగుమతి చేస్తున్నది. దానిని క్రమబద్ధం చేసేందుకు అమెరికా కొత్త చట్టం చేసింది. తన దేశంలో తయారయ్యే పార్టులు 72 శాతం వాడిన కార్లనుమాత్రమే దిగుమతి చేసుకుంటామని ఆచట్టం చెప్పింది. ఇది ఒక పరిస్థితికాగా అమెరికా ప్రపంచాన్ని యుద్ధంలో ముంచెత్తేందుకు ప్రయత్నిస్తున్నది. ఈ సంవత్సరం ఆయుధాలకు 209 బిలియన్ల డాలర్లు వెచ్చిస్తున్నది. సరికొత్త ఆయుధాల రూపకల్పనకు కృషి చేస్తున్నది. అమెరికా సాంకేతిక, విజ్ఞాన రంగాలలో పని చేసే వారిలో 55 శాతం యుద్ధ పరిశ్రమల్లో వున్నారు.

రీగన్, కమ్యూనిజానికి తుదిఘడియలు వచ్చాయని ప్రగల్భాలు పలుకుతున్నాడు. సోషలిస్టు వ్యవస్థ చుట్టూ ఆయుధాగారాలు ఏర్పరుస్తున్నాడు. సోవియట్ ఆయుధ పోటీ నివారణకు అనేక సూచనలు చేసింది. కానీ రీగన్ అంగీకరించడంలేదు.

ప్రపంచవ్యాప్తంగా శాంతి మానవాళి ఈ ప్రమాదానికి వ్యతిరేకంగా ప్రదర్శనలు చేస్తున్నది. అమెరికాలో యుద్ధపరిశ్రమలోనే పనిచేస్తున్న 32 వేల మంది శాస్త్రజ్ఞులు సోవియట్‌తో ఒప్పందానికి రావాలని ఒక సమావేశంలో విజ్ఞప్తి చేశారు శాంతి వుద్యమంలో అనేక చోట్ల చర్చి పెద్దలు గూడ పాల్గొంటున్నారు. దీని విషయంలో మన కృషి యింకా విస్తృతపరచుకోవాలి.

## దేశంలో ఆర్థికపరిస్థితి

దేశంలో స్వాతంత్ర్యం వచ్చిననాటి నుండి, ఒక్క మూడేండ్లకాలం మినహా, కాంగ్రెస్(ఐ) అధికారంలో వుంది ప్రజల్లో 48 శాతం దారిద్ర్యరేఖకు దిగువనే బ్రతుకుతున్నట్లు ప్రభుత్వమే చెప్తున్నది. ఈ సంవత్సరం ఆ అంకె మరింత పెరిగిందనడంలో సందేహంలేదు. ఈసారి బడ్జెట్‌లో ఈ ప్రస్తావనే లేదు. ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజిలలో నమోదైన నిరుద్యోగులు కోటి 90 లక్షలు. గ్రామసీమల్లో నిరుద్యోగులనుకూడ కలుపుకున్నట్లైతే 6 కోట్లు వుంటారని అంచనా.

గత పార్లమెంటు సమావేశం తర్వాత ప్రజలపై రు. 1587 కోట్లు అదనపు భారాలు

మోపారు. బియ్యం విడుదల ధర పెరుగుదల వల్ల రు. 300 కోట్లు, 1982లో సెంట్రల్ ఎక్సైజ్ రు. 200 కోట్లు, బొగ్గు ధర పెంచడంతో రు. 217 కోట్లు అదనపుభారాలు మోపారు.

ప్రభుత్వం తన ఆదాయ వనరులను, ఖర్చు పద్దులను పార్లమెంటు ఆమోదంతో చేయడం ప్రజాస్వామిక సాంప్రదాయం. ఆ సాంప్రదాయానికి భిన్నంగా పార్లమెంటు అధికారాన్ని త్రోసిపుచ్చి పై ధరలు పెంచారు. ఇంకా విడ్డూరమైన విషయమేమిటంటే పార్లమెంటు జరుగుతుండగానే,దానికి తెలియకుండానే పోస్టల్ ధరలు పెంచి మరో రు.70 కోట్లు అదనపు భారాలు మోపారు.

రైల్వే ఛార్జీలు రు. 487 కోట్లు, జనరల్ పన్నులు రు. 716 కోట్లు మోపారు. ఇంకా బడ్జెట్‌లోటు రు. 1560 కోట్లు వుంది ఇదీ ప్రజలపై పడేదే. ఇలా ఈ సంవత్సరం మొత్తం రు. 4340 కోట్లు అదనపు భారాలు ప్రజలు మోయాలి. ఇంత భారంలో బడా వ్యాపారులపై పడే ప్రత్యక్ష పన్నులు 12.5 శాతం మాత్రమే. పరోక్ష పన్నులరూపంలో 87.5 శాతం ప్రజలు మోయాలి. ఇక ధరలు ఎలా పెరక్కుండా వుంటాయి.ధరలు గత సంవత్సరం 3 శాతం మాత్రమే పెరిగాయంటున్నారు. ఇదొక బూటకం. బియ్యం ధర 6.1 శాతం, పప్పుధాన్యాలు 10.1 శాతం, మాంసం, చేపలు 18 శాతం పెరిగాయి. ఇవన్నీ సామాన్యుడి అవసరాలు.

ఈ ధరలు పెంచడంద్వారా జీతాల తగ్గింపు మనకు తెలియకుండానే మన నెత్తిన రుద్దుతున్నారు. ధరల పెరుగుదలకు పరిహారం పూర్తిగా లేక, జీతాల పెంపుదల కొరగాకుండా పోతున్నది. బడ్జెట్‌లో పెట్టుబడి రంగంపై యుద్ధం లేదు. నల్లధనం వెలికితీత చర్యలు లేవు. వారికన్నీ రాయితీలే.

గత సంవత్సరం పుత్పాదక సంవత్సరమన్నారు. ఉత్పత్తి పెరుగుదల 4.5 శాతం మాత్రమే. అంతకుముందు ఏడు 8.5 శాతం పెరిగింది. ఈ సంవత్సరం పెట్రోలియం 30.6 శాతం, సిమెంటు 10 శాతం, ఎరువులు 9.6 శాతం, విద్యుచ్ఛక్తి 7 శాతం పెరిగాయి. కాని మొత్తం పుత్పత్తి 4.5 శాతమే పెరిగింది. బొంబాయి జౌళి సమ్మెవల్ల పుత్పత్తి మరింత పెరగలేదనవచ్చు. కాని అది నిజం కాదు. మన పారిశ్రామిక ఉత్పత్తి సూచీలో బట్టల స్థానం 4 పాయింట్లుమాత్రమే. నాలుగు పాయింట్ల భాగం మొత్తం ఉత్పత్తి ఆగినా మొత్తం వుత్పత్తి పెరుగుదలలో ఇంత తేడా ఎలా వచ్చింది? దీనికి ప్రధాన కారణం చిన్న పరిశ్రమలు మూత పడడమే.

ఉత్పత్తి పెరిగితే ధరలు తగ్గుతాయని బూర్జువా ఆర్థిక శాస్త్రవేత్తలు అంటుంటారు. పెట్రోలియం వుత్పత్తి పెరిగింది అయినా 1980లో రు 280 కోట్లు, 1981లో రు 1194 కోట్లు, 1981 జూలైలో మరో రు 1071 కోట్లు, 1983లో రు 800 కోట్లు ధరలు పెరిగాయి. విద్యుచ్ఛక్తి వుత్పత్తి పెరిగింది, అయినా రేట్లు పెరుగుతూనే వున్నాయి.

ప్రతిఏటా విదేశీవ్యాపార లోటు పెరుగుతున్నది. సోషలిస్టుదేశాల్లో మిగులువుంది. పెట్టుబడిదారీ దేశాల్లో లోటు వస్తోంది.

భారత ప్రభుత్వం ఐ. ఎం. ఎఫ్. నుండి తీసుకున్న రుణంలో 42 శాతం ఆ సంస్థ యివ్వగా, 52శాతం సౌదీ అరేబియాఇచ్చింది. సంస్థ వడ్డీరేటు 7 శాతం, సౌదీ అప్పుకు 15 శాతం వడ్డీ. సరాసరి 11 శాతం వడ్డీ అవుతున్నది. 1984-85లో ఈ అప్పు తీర్చడం ప్రారంభమవుతుంది. వడ్డీ రు 600 కోట్లు, అసలు రు. 580కోట్లు తీర్చాలి. గత అప్పులకు వెయ్యి కోట్లు, ఈ అప్పుకు రు. 1180 కోట్లు చెల్లించాలి. ఎంత భారం పడనున్నదో గమనించండి.

ఐ.ఎం.ఎఫ్.అప్పుకుగానుభారతప్రభుత్వం అనేక షరతులకు ఒప్పుకున్నది. అవధుల్లేని మార్కెట్ పాలసీ అందులో ఒకటి. విదేశీ దిగుమతులకు ఉదారంగా అనుమతినిస్తున్నారు. మీ రాష్ట్రంలో యాంత్రీకరణ మూలంగా క్రమేపి 14 వేలమంది పొగాకు పరిశ్రమలో నిరుద్యోగులు కాబోతున్నారు. ఉక్కు అమ్ముడు పోక నిల్వలు పేరుకుంటుండగా, మనం ఉక్కు దిగుమతి చేసుకోవాల్సి వస్తున్నది, వారిని సంతృప్తి పరచేందుకు. ఈ విధానం ఫలితమే కేరళలో కెమికల్ ఫైబర్ పరిశ్రమలో 11 వేలమంది నిరుద్యోగులైనారు. అశోక్ లేలాండ్ ఒక షిఫ్టు తగ్గిస్తున్నది. కోటలో జె. కె. సింథెటిక్స్‌లో రెండున్నరవేల మందిని రిట్రెంచి చేశారు. ఇవి ఐ. ఎం. ఎఫ్ అప్పు ఫలితాలు.

మన ఆర్థిక విధానాలను ప్రపంచ బ్యాంక్ నిర్ణయిస్తున్నది. ఆర్థిక రంగంలో మనం వలసదేశవాసులం కానున్నామా అనే భయం పొడసూపుతున్నది.

వస్తురంగంలోనే కాదు. సాంకేతిక పరిజ్ఞానం గూడ దిగుమతి చేసుకుంటున్నారు. ఈ ఆధునికీకరణ పేరిట వుద్యోగావకాశాలు తరిగిపోతున్నాయి. ఈ జబ్బు అన్ని రంగాలకు వ్యాపిస్తున్నది. మనకు వున్న సాంకేతికపరిజ్ఞానాన్ని గూడ కాలదన్నుతున్నారు.

సి.ఐ.టి.యు కార్మిక - కర్షక ఐక్యత గురించి ఉద్ఘాటిస్తున్నది. దీనిని మన కార్యకర్తలు సరిగా అర్థం చేసుకోడంలేదు మిగతా కష్టజీవులతో కలసి పోరాడందే కార్మికులు తమ స్థితిని గూడ మెరుగుపరచుకోలేరు.

ఇందిరాగాంధీ ప్రభుత్వం కార్మికవర్గంపై దాడులు ప్రారంభించింది. ఎస్మా, నాసాలు, పారిశ్రామిక వివాద చట్టం మార్పులు,ట్రేడ్ యూనియన్ చట్టంలో మార్పులు ఇందుకు ఉదాహరణలు. కార్మికవర్గ పోరాట పటిమను, సమ్మె హక్కును హరించే ప్రయత్నాలు సాగుతున్నాయి.

1981 జూన్‌లో జాతీయ సదస్సు జరిగింది. అనేక ఐక్య పోరాటాలకు దారితీసింది. కార్మికవర్గం ప్రతిఘటనకు పూనుకుంటున్నది. కొద్దిఫలితాలు వచ్చాయి. ఐక్యతకు మరింత దీక్షతో కృషి సాగించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

దేశంలో విచ్ఛిన్నకరశక్తులు తలెత్తుతున్నాయి. ఈ శక్తులను ఎదిరించడంలో సి ఐ టి యు ముందున్నది.

కార్మికవర్గాన్ని విభజించి, పాలించేందుకు కుల, మత శక్తులు రంగంలోకి వస్తున్నాయి. మనం ఈ ప్రమాదాన్ని ఎదుర్కోవాలి. సాంఘిక, ఆర్థిక రంగాలలో జరిగే వుద్యమాలన్నింటా మనం పాల్గొని వాటిని సరైన మార్గంలో పెట్టాలి.

ప్రభుత్వ విధానాలు మారకుండా కార్మికవర్గ పరిస్థితులు మారవు. ★

## ఎదిరించి పోరాడాలని శ్రీ బాలానందన్ పిలుపు

# ది ఐ. ఎల్. టి. డి. కంపెనీ వర్కర్స్
# కో - ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీ లిమిటెడ్

**నెం. D 1263 H.O. అనపర్తి బ్రాంచి : రాజమండ్రి.**

**F. D. L. No. 736**

## ఆంధ్రప్రదేశ్ ఐ. ఎల్. టి. డి. కంపెనీ వర్కర్స్ ఫెడరేషన్
### బ్రాంచి : అనపర్తి - రాజమండ్రి కార్యకర్తల కృషిఫలితంగా

మేనేజిమెంటు ద్వారా వడ్డీలేని అప్పు

కార్మికుల షేర్ ధనం - త్రిప్పు ద్వారా 14-10-1960న రిజిష్టర్ చేయబడినది.

1964లో నిత్యఅవసరాల వస్తువుల స్టోర్సు, బట్టలస్టోర్సు ప్రారంభించి వస్తువులను మార్కెట్ రేటు కన్నా తక్కువకు లభ్యమౌతున్నాయి.

1977 సం॥ సొసైటీకి రూ. 10,000 తో స్వంతబిల్డింగు నిర్మాణమైనది.

స్టోర్సు కంపెనీ ఆవరణలో గల బిల్డింగులోనే నడుస్తూంది

సొసైటీ, యూనియన్ ఆధ్వర్యాన వెల్ఫేర్ సెంటర్లో 7 కుట్టుమిషనులపై కార్మిక స్త్రీలు శిక్షణ పొందుతున్నారు

| సంవత్సరం | మెంబర్లు | షేరుధనం | త్రిప్పు | కంపెనీ ఇచ్చిన అప్పు | కార్మికులకు అప్పు యిచ్చినది | లాభం |
|---|---|---|---|---|---|---|
| 1960-61 | 966 | 10,252 | — | 75,000 | 59,600 | + 923-28 |
| 1970-71 | 2807 | 22,364 | 17091-50 | 48,000 | 1,1,4045 | + 2221-50 |
| 1979-80 | 3319 | 29,028 | 59583-00 | 69,000 | 1,41,780 | + 3783-01 |
| 1980-81 | 3289 | 28,953 | | | 1,33,480 | 10,195 |
| 1981-82 | 3237 | 30,024 | | | 1,47,660 | 8977 |

| | | | |
|---|---|---|---|
| స్టోర్సు | 1977-78 | స్టోర్సులో కొన్న సరుకులు | 2.36,564-46 |
| | | అమ్మిన సరుకులు | 2,50,243-72 |
| | | నికర లాభం | 8,631-58 |

పి. వెంకటరత్నం
కార్యదర్శి & మేనేజర్

తేతల గోవిందరెడ్డి
అధ్యక్షులు

మరియు బోర్డు ఆఫ్ డైరెక్టర్సు

కార్మికవర్గ ప్రయోజనాల రక్షణలో అసువులు బాసిన ప్రజా నాయకులకు ముందుగా జోహారు లర్పిస్తున్నాను. ప్రత్యేకించి రాష్ట్ర సి. ఐ. టి. యు. నాయకుల్లో ఒకరైన కామ్రేడ్ యం. కె. స్వామి, షిప్‌యార్డు కార్మికుల ప్రియతమ నాయకుడు కామ్రేడ్ జె. సత్తిరాజు అకాల మరణంపట్ల గాఢ సంతాపాన్ని తెలుపుతూ వారికి విప్లవ జోహారులర్పిస్తున్నాను.

ఈ మధ్యనే భారత రాజధాని ఢిల్లీలో వందకుపైగా అలీనరాజ్యాల మహాసభ జరిగిన విషయం, ప్రపంచ ప్రజలనెదుర్కొంటున్న అనేక సమస్యలపై తీర్మానాలు చేసిన విషయం మీకు తెలిసినదే.

సామ్రాజ్యవాదం ఉన్నంతవరకూ యుద్ధాలు వుంటాయని మహనీయుడు లెనిన్ ఏనాడో చెప్పినమాట ఈనాటికీ వర్తిస్తుంది. సామ్రాజ్యవాదుల కారణంగానే ప్రజలు ఇప్పటికి రెండు ప్రపంచవ్యాపిత యుద్ధాలు చూచారు. మరొక యుద్ధం రానివ్వము అని శపధాలు చేసి, ఒడంబడికలు చేసుకొని ఐక్యరాజ్యసమితి లాంటి సంస్థలను రూపొందించుకొన్నప్పటికీ రెండవ ప్రపంచ యుద్ధం ముగిసినప్పటినుంచి గత 38 సంవత్సరాల్లోను నూరుకుపైగా స్థానిక యుద్ధాలు జరిగాయి. వీటన్నింటా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సామ్రాజ్యశక్తుల చేయి వుంది. ప్రజల శాంతియుత జీవితానికి ప్రమాద మేర్పడింది. ఉద్రిక్తత నెలకొనియుంది.

ప్రపంచశాంతికి సామ్రాజ్యవాదులవైపు నుండి తీవ్రమౌతున్న ప్రమాదం గురించిన అవగాహన అలీనరాజ్యాల మహాసభ చేసిన కొన్ని తీర్మానాల్లో వెల్లడవుతుంది. తమ స్వాతంత్ర్య రక్షణకు, తమ ఆర్థిక ప్రయోజనాల రక్షణకు సామ్రాజ్యవాదుల వత్తిళ్ళను ప్రతిఘటించాలన్న తహతహ కూడా అలీన రాజ్యాల సభలో వ్యక్తమయింది. సామ్రాజ్యవాదులను ఖండించవలసినచోట తీర్మానాల్లో అస్పష్టత వున్నప్పటికీ ఈ విశాల వేదికపై ఆ విషయాలు చర్చించబడటం, తీర్మానించటం సామ్రాజ్య వ్యతిరేక శక్తులకు బలాన్నిస్తుంది.

అమెరికా నాయకత్వాన సామ్రాజ్యవాద శక్తులు యుద్ధ సన్నాహాలను తీవ్రతరం చేస్తున్నాయి. సోషలిస్టుదేశాలకు వ్యతిరేకంగా నూతన ప్రమాదకర ఆయుధాలను మోహరిస్తున్నాయి. బాహాటంగా కవ్వింపులకు పూనుకుంటున్నాయి. యూరప్ ఖండంలో యీ కవ్వింపు మరింత నగ్నంగా జరుగుతోంది. సోషలిస్టు దేశాలలోని అనేక టార్గెట్లను క్షణకాలంలో పేల్చివేయ గల మిసిలీ కేంద్రాలను పడమటి యూరప్‌లోను, నాటో కూటమిసభ్య రాజ్యాల్లోను పెడుతున్నారు.

సామ్రాజ్యవాదులు ఎంత బరితెగించి యుద్ధ కవ్వింపు చర్యలు జరుపుతున్నారో అంత గట్టిగాను దేశదేశాల ప్రజల నుండి ప్రతిఘటన తీవ్రమౌతోంది.



**ప్రపంచ శాంతికై పాటుపడండి**

శాంతి శక్తులు బ్రహ్మాండంగా కదులుతున్నాయి. యూరప్ ఖండాన్నే కదిలించి వేస్తున్నాయి.

సోవియట్ అధినేత కామ్రేడ్ బ్రెజ్నేవ్ సర్వ విధ్వంసకరమైన న్యూక్లియర్ ఆయుధాలను ముందుగా తాము ప్రయోగించేది లేదని ప్రపంచానికి హామీయిచ్చారు. ఇలాంటి ప్రకటనే అమెరికా అధ్యక్షుడూ చేయాలని కోరారు. కాని అమెరికా ఇలాంటి ప్రకటన చేయనిరాకరించింది. తాను తన మిసిలీలను వేయిమైళ్ళ వెనక్కు మళ్ళిస్తానని యూరప్ దేశాలలో అమెరికా క్రూయిజ్ మిసిలీలను పెట్టరాదని సోవియట్ ప్రతిపాదించింది. దీనినీ అమెరికా నిరాకరించింది. సోవియట్ చూపిన చొరవ శాంతికాముక శక్తులకూ, శాంతి ఉద్యమానికి ఎంతో బలాన్నిచ్చింది.

యుద్ధ సన్నాహాలు చేస్తున్న పెట్టుబడిదారీదేశాల ప్రభుత్వాలు తమ ప్రజలపై విపరీతమైన భారాలు వేస్తున్నాయి. బడ్జెటులో యుద్ధఖర్చులకు కేటాయింపులు ఎక్కువ చేస్తున్నాయి. సంక్షేమ పద్దుల్లో కోత పెడుతున్నాయి.

సామ్రాజ్య దేశాల ఆర్థిక విధానం నానాట మరింత తీవ్రమైన సంక్షోభంలో పడుతోంది. దానికి ఒక గుర్తు నిరుద్యోగం. పెట్టుబడిదారీ దేశాలన్నింటా నిరుద్యోగం పెరిగిపోవడం చూస్తున్నాం.

పెట్టుబడిదారీ దేశాలన్నింటా మొత్తం 300 లక్షలు నిరుద్యోగులు. పరిశ్రమలు మూతపడుతున్నాయి వున్న ఉద్యోగాలు వూడుతున్నాయి.

పెట్టుబడిదారీ పంథాలో దేశాన్ని నడుపుతున్న భారత ప్రభుత్వంకూడా దేశంలో నిరుద్యోగాన్ని పెంచుతోంది. దేశం మొత్తం మీద రెండుకోట్ల మంది నిరుద్యోగులున్నారు. ఏటేటా యీ సంఖ్య పెరుగుతోంది. ఈ ఆర్థిక సంక్షోభం నుండి బయటపడటానికే అమెరికా యుద్ధప్రయత్నాలను గావిస్తున్నది.

క్రిందటి మన మహాసభ నాటికి కేంద్రంలోనూ, అనేక రాష్ట్రాల్లోనూ ప్రతిపక్షంలో నున్న కాంగ్రెసు 1980 పార్లమెంటు ఎన్నికల్లోను, ఆ తర్వాత రాష్ట్ర శాసనసభల ఎన్నికల్లోనూ కొన్నింట తిరిగి అధికారం చేతబట్టింది. అయినా కాంగ్రెసు నానాట బలహీనపడుతోంది. వామపక్ష సంఘటనలు బలంగానున్న పశ్చిమబెంగాల్, త్రిపుర, కేరళ రాష్ట్రాల్లో కాంగ్రెసు గాలి పనిచేయలేకపోయింది.

తాజా పరిణామం యింతవరకూ కాంగ్రెసుకు బలమైన కంచుకోటలుగావున్న ఆంధ్ర, కర్ణాటక రాష్ట్రాల్లో కాంగ్రెసు ఘోరంగా ఓడించబడింది. కాంగ్రెసేతర ప్రభుత్వాలు ఏర్పడ్డాయి.

రాష్ట్రాల అభివృద్ధిలో వ్యత్యాసాలు వుండటాన్ని ఆధారం చేసుకొని దేశంలో అనేక ప్రాంతాలలో వేర్పాటువాదాలు బయలుదేరినవి. సామ్రాజ్య వాదుల ప్రోత్సాహం

# పర్సా అధ్యక్షోపన్యాసం

**కార్మికుల వేతనాలపై దాడిని ప్రతిఘటించండి**

ఇందుకు పూర్తిగా వున్నది. ఖలిస్థాన్, బ్రహ్మపుత్ర ఖండ్ నినాదాలు ఈసామ్రాజ్యవాద ప్రోత్సాహ ఫలితాలే. చివరకుఈనాడు ఈ వేర్పాటు వాదం అతి విషాదకరమైన అస్సాం పరిస్థితిని తెచ్చిపెట్టింది. దేశ సమైక్యతకూ, సమగ్రతకూ ఇవి ప్రమాదకరం కార్మికవర్గం ఈ వేర్పాటు వాదులను గట్టిగా ఎదుర్కోవాలి.

అంతర్గత కుమ్ములాటల్లో మునిగిపోయిన కాంగ్రెసు పాలనలో ప్రజల సమస్యల గురించి పట్టించుకునే దిక్కులేకుండా పోయింది. పాలనా యంత్రాంగం దాదాపు స్తంభించినంత పనైంది. కాంగ్రెసు పాలిత రాష్ట్రాలకుగాని, కేంద్రానికిగాని అద్దం పట్టినట్లుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పనిచేసిన తీరు లోకవిదితం.

అన్ని పెట్టుబడిదారీ దేశాల్లో మాదిరిగానే పెట్టుబడిదారీ విధానం ఫలితంగా వచ్చిన జబ్బులకు భారత ప్రభుత్వంకూడ అవే మాత్రలు వాడుతోంది. దేశం అభివృద్ధి కావాలంటే అప్పులు చేయక తప్పదంటోంది. ఎలాంటి షరతులు విధించినా, చివరకు దేశ సార్వభౌమత్వానికే దెబ్బతగిలే షరతులున్నప్పటికీ అప్పు దొరికితే అంతే చాలన్నట్లు ప్రభుత్వం అప్పులకోసం ఎగబడుతోంది.

కార్మికుల వేతనాలపై దాడిచేస్తోంది. బి. పి. ఇ. గైడులైన్సు పేరిట ఈ దాడి సాగిస్తున్నది. వేతనాలను ఉత్పాదకతకు ముడిపెడుతోంది డి. ఎ ను స్తంభింపచేసింది. దీర్ఘకాలపు ఎగ్రిమెంట్లు చేయాలంటోంది-సంప్రతింపుల పేరుతో కాలయాపన జరిపి ఆ కాలానికి పెరిగిన జీతాలను నిరాకరిస్తోంది.

ఈ దాడులను ప్రతిఘటించే కార్మికులపై నాసా, ఎస్మాలాంటి చండ శాసనాలను ప్రయోగించింది. సమ్మె హక్కును హరించివేసింది. ట్రేడ్ యూనియన్ నాయకులను జిల్లాల నుండి, కార్మిక కేంద్రాల నుండి బహిష్కరించి దూరప్రాంతాలకు తరిమివేస్తోంది. బీహారు ప్రెస్ బిల్లు ద్వారాపత్రికల గొంతు నొక్కే చర్యలకు పూనుకొంది.

ఫ్యాక్టరీలు మూసివేయడం, లాకౌట్లు ప్రకటించటం సమ్మెలను దీర్ఘకాలం కొనసాగనివ్వటం, ఆవిధంగా కార్మికులను ఆకలిమంటలకు గురిచేసి తక్కువ వేతనాలపై తిరిగి ఉద్యోగంలో చేరేటట్లుగా లొంగతియటం పరిశ్రమల యజమానులు ఉపయోగిస్తున్న రకరకాల ఆయుధాలు. బొంబాయి బట్టలమిల్లుల కార్మిక సమ్మె పట్ల యజమానులు తీసుకున్న వైఖరి యిందుకు ఒకమచ్చుతునక.

## ఐ. ఎమ్. ఎఫ్. వత్తిళ్ళు

పెట్టుబడిదారీ పంథాలో దేశాన్ని నడుపుతున్న భారత ప్రభుత్వం ప్రపంచ బ్యాంకు, ఐ. ఎమ్. ఎఫ్. లాంటి సంస్థలనుంచి అప్పులు విపరీతంగా తెస్తోంది. హానికరమైన షరతులను ఆ సంస్థలు మన దేశంపై విధించాయి. ఆ సంస్థలు చేస్తున్న వత్తిడుల ఫలితంగా పెట్టుబడిదారీ దేశాలనుండి ఎక్కువ ధరలకు మనం దిగుమతులు చేసుకోవాలి. దిగుమతులు మనమీద బలవంతంగా రుద్దుతున్నారు. మనం చౌకధరలకు ఎగుమతి చేయాలి. ఎగుమతి కోసమే ఉత్పత్తిచేయాలి. రెండువైపులా భారత ప్రజలు దోపిడికి గురవుతున్నారు.

ఐ, యమ్ ఎఫ్. షరతుల మూలంగా మన పరిశ్రమల్లో కొత్త యంత్రాల ప్రవేశం, కంప్యూటర్స్ పెట్టడం జరుగుతోంది. అదేమంటే ఉత్పత్తి ఖర్చులు తగ్గించడానికి యిది అవసరమంటున్నారు. అంటే మన కార్మికుల శ్రమను పెట్టుబడిదారీ దేశాలు కారుచౌకగా కొనుక్కొనేందుకు అవకాశం కల్పించాలి. మన కార్మికుల ఉద్యోగాలు పోగొట్టి అయినా పెట్టుబడి దారీ దేశాల్లో ఫ్యాక్టరీలు ఆగకుండా నడిచేటట్లు భారత ప్రజలు సహకరించాలి ఒక్క మాటలో పెట్టుబడి దారీ దేశాల బరువులను మన ప్రజలు మోయాలి !

## గూండాదాడులు

ఈ మధ్యకాలంలో పరిశ్రమల యజమానులు కొత్తరకమైనదాడులు ప్రారంభించారు. గూండా గ్యాంగులను పోషించి ఆయుధాలిచ్చి ట్రేడ్ యూనియన్ ఆఫీసులపై దాడులు చేయించటం, నాయకులను, చురుకైన కార్యకర్తలను హత్యచేయించటం ఎక్కువైంది. అత్యంత ఆందోళనకరమైన విషయమేమంటే కార్మికుల కుటుంబ స్త్రీలపై అత్యాచారాలు జరిపించటం పరిశ్రమల యజమానులు కనిపెట్టిన సరికొత్త ఆయుధం. ఆయా సందర్భాల్లో యజమానుల గూండాలకుతోడు పోలీసులు గూడా యీ దౌర్జన్యకాండలో భాగస్వాములవుతున్నారు.

ప్రభుత్వప్రోత్సాహంతో కార్మికవర్గంమీద తన పెత్తనాన్ని సాగిస్తున్న ఐ ఎన్.టి.యు.సి. నాయకత్వం జనతా ప్రభుత్వహయాములో మాత్రం యితర ట్రేడ్ యూనియన్లతోపాటు కార్మిక సమస్యలపై ఐక్యకార్యాచరణలోకి చేరింది. ఇందిరా కాంగ్రెసు తిరిగి అధికారంలోకి వచ్చినప్పటినుంచి అది పాత ఒరవడిలోనే కార్మికుల్లో చీలికలు కల్పించే శక్తిగాను, కార్మికులపై గూండా దాడులు జరిపించే శక్తిగాను పని చేస్తోంది. ఐ. ఎన్. టి. యు. సి. నుంచి చీలిన ఒక సెక్షను మాత్రం (దారా గ్రూపు)ఐక్యకార్యాచరణకు కలిసివస్తోంది.

యజమానులతో లాలూచి పడటం, కార్మికులకు తెలుపకుండా నష్టకరమైన ఎగ్రిమెంట్లు చేయటం, కార్మికుల పోరాటాలను విచ్ఛిన్నం చేయడంవలన ఐ ఎన్ టి యు సి ని కార్మికులు నిరసిస్తున్నారు. తమకు నమ్మకమైన నాయకత్వాలద్వారా తమ సమస్యలు పరిష్కారం కావాలని కోరుతున్నారు. ససేమిరా వీల్లేదని కాంగ్రెసు ప్రభుత్వం ఐ ఎన్ టి.యు.సి. ద్వారానేపరిష్కారంచేసుకోవలెనని వత్తిడి చేస్తోంది. బొంబాయి మిల్లు కార్మికుల పోరాటం, అస్సాం టీ తోటల కార్మికుల, బొగ్గుగని కార్మికుల, నెల్లిమర్ల జూట్ కార్మికుల విషయంలోను జరుగుతున్నదిదే.

రహస్య బ్యాలెట్ ద్వారా కార్మికుల తరపున సంప్రతించే యూనియన్లు నిర్ధారించాలన్న కోర్కెను భారత ప్రభుత్వం మొండిగా నిరాకరిస్తోంది.

**ట్రేడ్ యూనియన్ హక్కులను కాపాడుకోండి**

## ఐ. యల్. ఒ మందలింపు

అంతర్జాతీయ కార్మికసంస్థ ఏర్పడినప్పటి నుండి భారత ప్రభుత్వం గత 60 ఏండ్లుగా అందులో సభ్యురాలు. అయినా ఆ సంస్థ చేసిన తీర్మానాలను చాలావాటిని కాంగ్రెసు ప్రభుత్వం ఉల్లంఘించుతోంది. ఈ ఉల్లంఘనల గూర్చిన అనేక ఫిర్యాదులకు ఐ. యల్. ఒ. కోరిన వివరాలకు భారత ప్రభుత్వం కప్పదాటు సమాధానాలిచ్చింది. సంతృప్తిచెందని ఐ. యల్. ఒ. భారత ప్రభుత్వాన్ని సున్నితంగానైనా మందలించింది.

## జాతీయ ప్రచార కమిటి

జాతీయ ప్రచార కేంద్రంగా రూపుదిద్దుకున్న నేషనల్ కాంపెయిన్ కమిటి పోరాట కేంద్రంగా కూడ రూపొందాలని మన ఆశ. క్రిందటి సంవత్సరం రెండవ భాగంలోను, ఈ ఏడాది మొదటి మూడునెలల్లోనూ ఓడరేవు కార్మికులు, ఉక్కు పరిశ్రమ కార్మికులు,

> ఐ. ఎమ్. ఎఫ్. అప్పు
> కార్మికుల పాలిటి ఉరితాడు

బొగ్గుగని కార్మికులు జరిపిన దేశవ్యాపిత సమ్మెలకు నేషనల్ క్యాంపెయిన్ కమిటి మద్దతు లభించింది. బి.పి.ఇ గైడ్‌లైన్సుపై గట్టి సమ్మెటపెట్టు పెట్టటం జరిగింది.

ఏమైనా గత నాలుగేండ్లలోను కార్మికవర్గం సంఘటితపడి ప్రభుత్వ విధానాలకు గట్టి ప్రతిఘటనయిచ్చింది వేతనాల పెరుగుదలమీద విధించిన సీలింగును బద్దలుకొట్టగలిగింది బొగ్గు, ఉక్కు, బి.హెచ్.ఇ.ఎల్ లాంటి ప్రభుత్వరంగ పరిశ్రమల్లో 1979 లో జరిగిన ఎగ్రిమెంట్లు అలాంటివే. ఓపికగా కొనసాగించిన కార్మికవర్గ ఐక్యకార్యాచరణ విధానానికి యిది విజయం.

## వామపక్ష ప్రభుత్వాలు

భారతదేశంలో వస్తున్న మార్పుల్లో నియంతృత్వశక్తులకు వ్యతిరేకంగా వామపక్ష శక్తులు బలపడి కొన్ని రాష్ట్రాల్లోనయినా నిలదొక్కుకోవటం కార్మిక వుద్యమానికి అత్యంత ప్రాముఖ్యమైన విషయం. బెంగాలు, త్రిపుర, రాష్ట్రాల్లో వామపక్ష ప్రజాతంత్ర సంఘటన ప్రభుత్వాలు కార్మిక వర్గ మిత్రులుగా తమ ప్రతిష్ఠను పెంచుకున్నాయి. ప్రత్యామ్నాయ విధానాలను అమలు జరుపబూనాయి. వాటి మనుగడే ప్రజాస్వామికోద్యమానికి రక్ష.

నియంతృత్వం వైపు అడుగులు వేస్తూ కార్మిక వర్గంమీద, మొత్తం ప్రజాతంత్ర శక్తులమీద, విలువల మీద దాడి చేయడం కేంద్రంలోని కాంగ్రెసు ఎంచుకున్న మార్గం. దాని దారి మళ్ళించాలని ప్రజా స్వామ్య శక్తులు కృషి చేస్తున్నాయి. కార్మిక వర్గం ప్రజాస్వామిక శక్తులకు చేయూతనివ్వాలి సంఘీభావం ప్రకటించాలి. అగ్ర శ్రేణులలో నిలబడాలి తద్వారానే కార్మికవర్గం తనను తాను రక్షించుకోగలుగుతుంది.

దేశ విచ్ఛిత్తికి, సామ్రాజ్యవాద శక్తులు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను అండదండలిస్తున్నాయి. ఆర్థికం, ఆయుధాలు చేరవేస్తున్నాయి. దేశసమగ్రత రక్షణకు కార్మిక వర్గం నడుం కట్టాలి. అస్సాంలోని సి. ఐ. టి. యు. శ్రేణులు ఎన్నో త్యాగాలు చేస్తూ దేశ సమగ్రతకై నిలబడ్డాయి. ఇది మనందరికీ గర్వకారణం.

ఈ సాంప్రదాయాన్ని మరింత ముందుకు తీసుకుపోవాలి.

ట్రేడ్ యూనియన్లలో తమ పాత్ర గురించి శ్రామిక మహిళలు గత నాలుగేళ్ళలోను ఆలోచన చేస్తున్నారు. తమకు సముచిత పాత్ర లభించాలని కోరుతున్నారు. మద్రాసు కాన్ఫరెన్సు తర్వాత కొంత కృషి జరిగినా ఈ సమస్యకు మన అనుబంధ సంఘాల బాధ్యులు శ్రద్ధ చూపాలి. వీరి పోరాటను పెంచగలిగితే కార్మికోద్యమానికి, జనరల్ ప్రజాస్వామికోద్యమానికి ఎంతో బలాన్ని చేకూరుస్తుంది.

మూడు దశాబ్దాలపాటు ఆంధ్రప్రదేశ్ ప్రజల నెత్తికెక్కిన కాంగ్రెస్ పాలనను అంతమొందించుకొని నూతన రాజకీయ వాతావరణంలో మన రాష్ట్ర ప్రజలున్నారు. ఎన్నో ఆశలు పెంచుకొని వున్నారు.

జనతా హయాంలోలాగానే కాంగ్రెస్ అదునుకోసం పొంచుకొని వుంది. దాని శక్తిని తక్కువ అంచనా వేయతగదు.

ఈ స్థితిలో కార్మికోద్యమ పురోగమనానికి, ఎలాంటి అవాంతరాన్నయినా ఎదుర్కొనేందుకు సిద్ధంగా వుండే చైతన్యాన్ని కార్మికవర్గానికి కల్గించటానికి మనం కృషి చేయాలి.

యుద్ధ ప్రమాదాన్ని అడ్డుకోవటానికీ, శాంతిని పరిరక్షించుకోవటానికి మనం కార్మిక వర్గాన్ని చైతన్యవంతం చేసుకోవాలి.

నియంతృత్వ పోకడలను అరికట్టటానికి, ప్రజాస్వామ్యాన్ని రక్షించుకోవటానికి, దేశ సమగ్రతను కాపాడుకోవటానికి కార్మిక వర్గం తన పాత్ర నిర్వహించాలి.

దేశ కార్మిక శ్రమను విదేశీ గుత్త పెట్టుబడిదారులకు కారుచౌకగా అమ్మివేసే కేంద్ర ప్రభుత్వ విధానాలను ఓడించాలి.

మన రాష్ట్ర అభివృద్ధికి అవసరమైన నిధులను కేంద్రం నుండి రాబట్టుకోవాలన్నా, ప్రమాదానికి చేరుతున్న నిరుద్యోగ సమస్యను పరిష్కరించుకోవాలన్నా, రాష్ట్రాలకు అదనపు అధికారాలు సంపాదించాలన్నా

> ఐక్యకార్యాచరణ విజయం
> ప్రభుత్వం వెనుకంజ

కోర్కెలకు ఉద్యమ స్వరూపం యిచ్చుకోవాల్సి వుంటుంది.

ఈ కర్తవ్య నిర్వహణలో సి ఐ టియు.ను బలమైన శక్తిగా రూపొందించుకోవటం ప్రధాన అంశంగా వుంచుకోవాలని, మన రాష్ట్ర 4వ మహాసభలో చర్చలు ఈ దిశలో నిర్దిష్టమైన సూచనలు అందించేవిగా ఉంటాయని ఆశిస్తున్నాను.

★

## ప్రావిడెంట్ ఫండ్ పై వడ్డీ పెంపు

* ప్రావిడెంట్ ఫండ్ పై చెల్లించే వడ్డీ రేటును 9.15 శాతానికి పెంచాలని ప్రావిడెంట్ ఫండ్ బోర్డు నిర్ణయించింది.

# ప్రధాన కార్యదర్శి నివేదిక



## ముఖ్యాంశాలు

1970డిసెంబరులో రాజమండ్రిలో మొదటి మహాసభ నాటికి 46 యూనియన్లు, 23 వేల సభత్వం వుండేది. ఈనాడు 200 యూనియన్లు 55వేల సభ్యత్వం వుంది. దీనికి తోడు ఇండిపెండెడ్ యూనియన్లలోను, ఇతర కేంద్రాలకు అనుబంధింపబడిన సంఘాల్లోను మన కార్యకర్తలు పనిచేస్తున్నారు. అటువంటి యూనియన్లలో మన పలుకుబడి మరో 50 వేలు వుంటుంది.

ఈ కాలంలో జరిగిన అనేక కార్మిక పోరాటాలకు, వాటి విజయాలకు మన సంఘానిది బాధ్యత ఫలితంగా సి. ఐ. టి. యు. ప్రతిష్ఠ పెరిగింది కార్మికవర్గ నిజాయితీగల మిలిటెంట్ నాయకత్వంగా గణుతికెక్కింది.

ఎందరో కార్యకర్తలు త్యాగాలు చేశారు. ఉద్యోగాలు కోల్పోయారు. ప్రాణాలు పణంగా పెట్టి పోరాడారు. కార్మికులతో నిత్య సంబంధాలు వుండి, నిజాయితీతో పోట్లాడే వందలాది కార్యకర్తలను తయారుచేసుకోగలిగాము.

ఇది మనకు గర్వకారణం.

గతంతో పోలిస్తే మనం పెరిగాము కాని మనకొక లక్ష్యముంది. దానితో పోల్చుకొని సాధించిందెంత? సాధించాల్సింది ఎంత? సాధించేందుకు ఏ మార్గం ఉపయోగించింది? ఇందులో ఎదురయిన ఇబ్బందులేమిటి? జరిగిన నష్టాలు ఏమిటి? మన లక్ష్య సాధనకు రచించాల్సిన వ్యూహమేది? దానిని సాధించే మార్గమేమిటి?-ఇవీ వేసుకోవలసిన ప్రశ్నలు. అప్పుడే పుష్కర కాలం కార్యక్రమాన్ని సమీక్షించుకోగలం. మరింత వేగంగా ట్రేడ్ యూనియన్ వుద్యమంలో విజయాలను సాధించగలం.

### మన లక్ష్యం - మన మార్గం

సకల విధములైన దోపిడీ పద్ధతులను అంతంచేసి సోషలిస్టు సమాజాన్ని ఏర్పాటు చేయటాన్నిఅందుకుమార్గంగా ప్రస్తుతమున్న పెట్టుబడిదారీ భూస్వామిక ప్రభుత్వాన్ని తొలగించిప్రజలనిజమైనప్రజాస్వామికప్రభుత్వాన్ని ఏర్పాటు చేయటాన్ని సి.ఐ.టి.యు. ఆశయంగా పెట్టుకున్నది. వర్గపోరాటాన్ని జయప్రదంగా సాగించటమూ, ఈ ఆశయ సాధనకై జరిగే పోరాటానికి కార్మికవర్గం నాయకత్వం వహించటమూ సి ఐ టి యు. లక్ష్యమని చెప్పింది. తన నిబంధనావళి ప్రథమాధ్యాయంలోనే ఈ ఆశయం, లక్ష్యం, మార్గం నిర్దేశించబడినవి.

వీటిని సాధించాలంటే కార్మికవర్గం యొక్క రాజకీయ చైతన్యాన్ని పెంచాలి. సోషలిస్టు చైతన్యాన్ని కలిగించాలి పీడిత ప్రజల ఛాంపియన్‌గా కార్మికవర్గం ముందుకు రావాలి. ప్రజాతంత్ర హక్కుల కొరకూ, పౌరహక్కుల కొరకూ జరిగే పోరాటంలో అగ్రగామి పాత్రను వహించాలి. నియంతృత్వ పాలనకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో ముందుపీఠిన నిలబడాలి.

ఈ కర్తవ్యాన్ని ఎంతవరకు నిర్వహించాము అనేది చూడాలి.

అదేవిధంగా ఈ లక్ష్యసాధనలో కార్మిక వర్గం, మొత్తం పీడితవర్గాలన్నింటినీ కలుపుకురావాలి. ముఖ్యంగా 100కి 70 మందిగా గ్రామీణ ప్రాంతాలలో వుండే రైతాంగాన్ని వ్యవసాయ కార్మికులనూ కలుపుకురావాలి. భూస్వామి దోపిడీ వడ్డీవ్యాపారుల దోపిడీ, మార్కెటు దోపిడీ, దారుణమైన ప్రత్యక్ష, పరోక్ష పన్నుల రూపంలో సాగే ప్రభుత్వ దోపిడీ మున్నగువాటికి వీరు గురియౌచున్నారు కాబట్టి వారినికూడా పోరాటంలోకి తీసుకురాకుండా, వారితో ఐక్యతను సాధించకుండా కార్మికవర్గం తన లక్ష్యసాధనలో విజయం పొందలేదనటమే కాదు, దైనందిన కోర్కెల కొరకై సాగే తన పోరాటానికి మద్దతునుకూడా సంపాదించుకోలేదు ఇటువంటి పీడితవర్గాల గట్టి తోడ్పాటు లేకుండా కార్మికవర్గమొక్కటే తన ఆశయాన్ని సాధిస్తుందనుకొనడం వెర్రితనమేనని అనేక దేశాలలో జయప్రదంగా సాగిన విప్లవాల అనుభవాలు ఋజువుచేస్తున్నవి.

### కార్మికవర్గ చైతన్య స్థాయి

నేటి కార్మికవర్గ చైతన్య స్థాయి ప్రధానంగా ఆర్థికతత్వంలోనే మునిగి వున్నది. రాజకీయస్థాయికి ఎదగడంలో వెనుకబడుతున్నది.

ఉదాహరణకు యుద్ధ ప్రమాదం పెరిగింది. మానవమనుగడే ప్రశ్నార్థకంగావుంది. ఈప్రమాదానికి వ్యతిరేకంగా 72 కేంద్రాల్లో ప్రదర్శనలుచేశాం. 30 వేల మంది కార్మికులు కదిలారు. ఇది మంచిప్రయత్నమే కాని ఇది చాలా? అక్టోబరు 1న 4 కేంద్రాలలో జరిగిన ప్రదర్శనలలో కార్మికులు గణనీయంగా పాల్గొన్నారు. ఇది సరిపోతుందా? శాంతి విషయం అత్యంత ప్రాధాన్యతగలది.అయినా అందరినీ కదిలించలేకపోయాము. అది నిరంతర కృషిగా రూపొందలేదు ఇతర అంతర్జాతీయ విషయాలలో స్పందనే అతితక్కువగా వుంది.

దేశంలో నియంతృత్వం పెరుగుతున్నది. దాని ప్రధాన భారం కార్మికవర్గమే గతంలో అనుభవించింది పోలీసు దురంతాలు సాగుతున్నాయి. వీటికి వ్యతిరేకంగా సాగే పోరాటాల్లో మన పాత్ర చెదురుమదురుగా వుంది.

అది చైతన్యయుతంగా పాల్గొనే స్థాయికి ఇంకా ఎదగాల్సే వుంది

### కార్మిక-కర్షక ఐక్యతకు కృషి

ఇక కార్మిక - కర్షక ఐక్యతను సాధించడానికి ఎంతవరకు కృషి జరిగింది అనేది మనం చూడాలి. లోగడ నివేదికలో ఈ కృషి చాలా స్వల్పంగానే జరిగిందని చెప్పడం జరిగింది అటు తర్వాత ఈ కర్తవ్య నిర్వహణకై కొంత ప్రత్యేక కృషి జరిగింది. రాష్ట్రంలో 1980లో గిట్టుబాటు ధరలకొరకూ, బకాయిల చెల్లింపు వేసులుబాటు కొరకూ రాష్ట్ర వ్యాపితంగా జరిగిన రైతాంగ పోరాటానికి కార్మికవర్గం యొక్క మద్దతును సమకూర్చుటకు విశేషమైన కృషిని గావించాము. రాష్ట్ర బంద్‌కు ఇవ్వబడిన పిలుపు నందుకుని కార్మికవర్గం పెద్దఎత్తున దానిలో పాల్గొనుటకు కృషి చేసింది సి. ఐ. టి. యు. అందుకు చొరవ తీసుకున్నది ప్రముఖ పాత్రను నిర్వహించింది. బంద్ సందర్భంగా

**1970 లో**
**46 యూనియన్లు**
**13 వేల సభ్యులు**

ఆర్. టి. సి బస్సుల నాపడానికి జరిగిన సందర్భంలో గుర్రం గోవిందు అనే యువకుడు చనిపోవడం జరిగింది. అయితే యిందులో కొన్ని బలహీనతలు కూడా కన్పించినాయి. కొన్ని పరిశ్రమలలో మరొక రోజు పనిచేసే షరతుపై ఆ రోజు ఫ్యాక్టరీ మూసివేయునట్లు మేనేజిమెంటుతో ఒప్పందం చేసుకోవడం జరిగింది. కొన్నిచోట్ల అటెండెన్సు రిజిష్టరులో సంతకాలు పెట్టి బయటకు రావడం జరిగింది. కొన్ని సందర్భాలలో శెలవు చీటీలు పంపి సమ్మెలో పాల్గొనినట్లు నటించడం జరిగింది. ఈ బలహీనత ముఖ్యంగా ఎక్కువ జీతాలు వచ్చే ప్రభుత్వ రంగ పరిశ్రమలు, ఇన్సూరెన్సు మున్నగు వాటిల్లో కన్పించింది.

ఇటువంటి బలహీనతలున్నా మొత్తం మీద రాష్ట్ర వ్యాపితంగా కార్మికవర్గం రైతాంగ వుద్యమానికి తోడ్పడిన ఘటనఇది. సి. ఐ. టి. యు అంతా ఒక్కుమ్మడిగా పూనుకోవటంవల్లనే యిది జయప్రదమైనది. అన్ని సందర్భాలలోనూ యిటువంటి కృషి జరగడంఅవసరం. సి ఐ టి.యు. మొత్తంగా పూనుకొనకపోతే యిటువంటి పిలుపులు పిలుపులుగానే వుండిపోవటం జరుగుతుంది.

రైతాంగం కార్మికవర్గ పోరాటాలకు సహాయం అందించిన ఘటనలుకూడావున్నవి. లోకో రన్నింగ్ స్టాఫ్ సమ్మె సందర్భంలోనూ, రైల్వే సమ్మె సందర్భంలోనూ, కర్నూలులో పేపరుమిల్లు కార్మికుల సమ్మె సందర్భంలోనూ యిటువంటి సహాయం లభ్యమైంది కార్యకర్తలు మొత్తంగా కదిలి దీనిని తమ విద్యుక్త ధర్మంగా భావించడ వల్లనే యిది జరిగింది.

కానీ ఇది స్వల్పం. రైతాంగ కోర్కెల సందర్భంలో మనం తీర్మానాలు చేయడంతో సరిపుచ్చుకుంటున్నామే గాని, రైతాంగం యొక్క కోర్కెలను. పోరాటాలను విస్తృతంగా కార్మికులలో ప్రచారంచేయడంగాని, కార్మికుల ప్రదర్శనలు, ఊరేగింపులు చేయడంగానీ సానుభూతి సూచకంగా యితర రూపాలలో మద్దతు నివ్వడంగానీ చెయ్యడం లేదు. రైతు తన అత్యుత్తమ మిత్రుడని కార్మికులకు చెప్పడానికి ట్రేడ్‌యూనియన్ ఉద్యమం ప్రతి అవకాశాన్నీ వుపయోగపెట్టుకోనట్లయితే, మన గ్రామీణ ప్రాంతాలలోని దుర్భర పరిస్థితుల మీద కార్మికుని దృష్టిని కేంద్రీకరింపజేయకపోతే బూర్జువా-భూస్వామ్య పీడనకు వ్యతిరేకంగా రైతాంగ పోరాటానికి తోడ్పడేందుకు కార్మికుడిని ఉత్తేజపరచకపోయినట్లయితే, కష్టాలలోవున్న రైతును ఆదుకోవడానికి సంఘీభావ కార్యకలాపాలు నిర్వహించకపోతే, వ్యావసాయిక విప్లవం జరగకుండా ఆహార సమస్య పరిష్కారింపబడటంగాని, కార్మికుడు విముక్తిపొందే అవకాశంగాని లేదనేది గుర్తింపజేయకపోతే- ఈ మైత్రిని నిర్మించడం సాధ్యం కాదు. కార్మికుడికి రైతు చైతన్యం కల్పించడానికి, రైతాంగ హక్కులకొరకు నిలబడేటట్లుగా చేసేందుకూ ట్రేడ్ యూనియన్లు తీవ్రకృషి సల్పకుండా, కార్మిక-కర్షక మైత్రి అనే నినాదం ఆచరణకురాదు ధాన్యం ప్రోగు చేయడం, ఇతర సహాయం అందజేయడంద్వారా కొన్ని ప్రదేశాలలో రైతులు కార్మికుల సమ్మెలకు సహాయపడటం కనపడుతున్నది. కాని రైతాంగానికి కార్మికవర్గం సహాయం అందించిన సందర్భాలు అరుదుగా వున్నాయి. లక్షలాది రైతాంగానికి నష్టం కలిగించిన విస్తృతమైన కరువులు వచ్చినపుడు సయితం ఆ రాష్ట్రంలోని కార్మికవర్గాన్నిగాని, మిగతా దేశంలోని కార్మికవర్గాన్నిగాని రైతుజనావళికి ఏదయినా సహాయం చేయడానికిగాను ట్రేడ్ యూనియన్ సంస్థలు కదిలించనేలేదు కరువులొచ్చినప్పుడుగాని, వరదలొచ్చినప్పుడుగాని సహాయక నిధుల వసూళ్ళు ప్రారంభించింది బూర్జువా మానవ కారుణ్య సంఘాలేగాని ట్రేడ్ యూనియన్లు కాదు. ఈ ప్రాథమిక బాధ్యతల విషయంలోనే పరిస్థితి ఈ విధంగా వుంటే, రైతాంగాన్ని దెబ్బకొట్టే పునాది సమస్యలమీద ట్రేడ్ యూనియన్లు యెలా మౌనంగా వుండేది సులభంగా వూహించవచ్చు ఈ అనాసక్తి దృక్పధాన్ని విడనాడకపోతే కార్మిక-కర్షక సంఘీభావం నెలకొల్ప

**1983 లో**
**200 యూనియన్లు**
**55 వేల సభ్యులు**

డానికి ప్రతి అవకాశాన్నీ వినియోగించుకోకపోతే, రైతాంగంపై జరిగే ప్రతి దాడికి కార్మికుడు స్పందించేటట్లు చేయకపోతే, వ్యావసాయక విప్లవ ప్రాధాన్యతను గూర్చి తెలియచెప్పకపోతే మన కార్మిక-కర్షక మైత్రి నినాదం ఒక కలగానే మిగిలిపోతుంది

లేకుంటే మనం అర్థికతత్వంలో కూరుకుపోతాం.

### కార్మికవర్గంలో మన స్థానం

పశ్చిమ బెంగాల్, మహారాష్ట్ర, తమిళనాడు వగైరాలతో పోల్చితే మన రాష్ట్రం పారిశ్రామికంగా వెనుకబడివున్నా అన్ని రాష్ట్రాలలో వలెనే కొన్ని కీలకమైన పరిశ్రమలు మనరాష్ట్రంలోనూ వున్నవి. రైల్వేలలో దాదాపు 1,40,000 మంది కార్మికులూ, ఉద్యోగులూ వున్నారు. ఆర్.టి సి.లో సుమారు 68000 మంది వుండగా, మెకానిక్‌లతోకలిపి లారీలు, ప్రైవేట్ బస్సులు, టాక్సీలు, ఆటోలు మున్నగువాటిలో 2,00,000లకు పైగా పని

## మన లక్ష్యమేమిటి ? దానికెంత చేరువయ్యాం ?

చేస్తున్నారు. బొగ్గు పరిశ్రమలో 70,000 మంది, విద్యుచ్ఛక్తి పరిశ్రమలో 40,000 మంది, తంతితపాలాలో 50,000 మంది పని చేస్తున్నారు. పెద్ద ప్రభుత్వరంగ పరిశ్రమలైన హెచ్.ఎమ్.టి., బి.హెచ్.ఇ.ఎల్., ఇ.సి.ఐ.యల్., ఐ.డి.పి.యల్, హెచ్.ఎ.ఎల్, ఆల్విన్స్. యన్.యఫ్.సి. మున్నగు హైదరాబాద్ పరిశ్రమలలోనూ, షిప్‌యార్డు, బి.హెచ్.పి.వి., జింక్ స్మెల్టర్, స్టీల్, హిందూస్థాన్ పెట్రోలియం వంటి విశాఖ పరిశ్రమలలోనూ, డిఫెన్సు పరిశ్రమలలోనూ, రేవులలోనూ 1,00,000 మందికి పైగా కార్మికులూ, ఉద్యోగులూ పనిచేస్తున్నారు బ్యాంకులలో సుమారు 28,000 మంది, ఇన్సూరెన్సులో సుమారు 4,500మంది పనిచేస్తున్నారు. రాష్ట్రప్రభుత్వోద్యోగులు 4,50,000 మంది వుంటారు. ఇక మున్సిపల్ కార్మికులు, షాప్ గుమాస్తాలు, కార్మికులు, రైస్‌మిల్లులు, పంచదార ఫ్యాక్టరీలు, జూట్‌మిల్లులు, పేపరు మిల్లులు, బట్టల మిల్లులు మున్నగువాటిలోనూ, చేతివృత్తుల లోనూ పనిచేసేవారు, హమాలీలు, రిక్షా పుల్లర్లు, ప్రింటింగు ప్రెస్సులు, ఫౌండ్రీలు, వర్క్‌షాపులు మున్నగువాటిలో పనిచేసేవారూ లక్షలమంది కార్మికులు వున్నారు.

అయితే సంఘటిత కార్మికవర్గం సంఖ్య చాలా తక్కువ. వివిధ ట్రేడ్ యూనియన్ సెంటర్లు ఫెడరేషన్లు, అసోసియేషన్లు చెప్పుకొనే సభ్యత్వాన్ని చూసినా (వాస్తవానికి ఇవి పెంచి చెప్పుకొనే సంఖ్యలు) ఈ మొత్తం సభ్యత్వం మొత్తం కార్మికులలో చాలా స్వల్పమనే చెప్పాలి.

ఈ సంఘటిత కార్మికవర్గంలో కూడా సి.ఐ.టి.యు. వెనుక సంఘటితమైన కార్మిక వర్గ భాగం తక్కువ. ఈ సంఘాలను నడుపుతూ కార్మికవర్గ చైతన్యాన్ని పెంచుతూ ప్రజాతంత్ర ఉద్యమంలో నాయకత్వ స్థానానికి చేరవలసిన కార్యకర్తల సంఖ్య కూడా చాలా తక్కువ. కొన్ని ప్రధాన పరిశ్రమల లోనూ, ప్రధాన పారిశ్రామిక కేంద్రాల లోనూ ఉన్న పరిస్థితినిచూస్తే ఈ విషయం స్పష్టపడగలదు.

కీలక పరిశ్రమలలోగాని, ప్రధాన పారిశ్రామిక కేంద్రాలలో గాని మనం బలహీనంగా వున్నాం. ముఖ్యమైన ఆర్.టి.సి.లో విశాఖపట్టణంలో గానీ, హైదరాబాద్‌లోగానీ, విజయవాడలోగానీ, మరెక్కడాగాని పూర్తి కాలం ట్రేడ్‌యూనియన్ పనికై వుండే కార్యకర్తలు లేరు. దాదాపు రైల్వే పరిస్థితి కూడా యింతే.

విద్యుచ్ఛక్తి రంగంలో పూర్తికాలపు కార్యకర్తలేరు. దీనిని బట్టి ఒకటి స్పష్టమవుతున్నది. కీలక పరిశ్రమలలో పనిని సి.ఐ.టి.యు. నిర్లక్ష్యం చేసింది. దాని ప్రాధాన్యతను గుర్తించక పోవడం వలననే యిది జరిగింది.

ఈ పరిశ్రమలలో చాలా కాలంనుండి పెత్తనం చేస్తున్న కొన్ని యూనియన్లు వున్నవి. ఆ నాయకత్వం మిలిటెంటు ఉద్యమాలను నిర్మించకపోవడమే గాక కార్మికులను రాజకీయంగా చైతన్యపరచి వారిని ప్రజాతంత్ర ఉద్యమాల్లోకి తీసుకురావడానికి కృషి చేయడంలేదు. పైగా వర్గ సామరస్య విధానాన్ని అవలంబిస్తూ ఉద్యమాన్ని ఆర్థిక

## ఆర్థిక పోరాటాల పూబినుండి బయటపడాలి

తత్వపు చట్రంలోనే వుంచుతున్నది. ఆ విధానాలనెదిరించి కార్మికులను చైతన్యపరచి మిలిటెంటు ఉద్యమాలను నిర్మించవలసిన అవసరం మనపై వున్నది. ఇందుకు ఎంతో ఓపికతో కూడిన కృషి అవసరం. పంచాబ్దాలు, దశాబ్దాలు కూడా ఆ విధంగా కృషి చేయవలసిన అవసరం వుంటుంది. ఇది చాలా అవసరం. ఈ కర్తవ్యాన్ని జయప్రదంగా నిర్వహించకుండా జనతా ప్రజాస్వామిక విప్లవంలో కార్మికవర్గాన్ని నాయకత్వ స్థానానికి తీసుకురాదలచడం అర్థవిహీనం. కాబట్టి సి. ఐ. టి. యు. ఈ పరిశ్రమలలోనూ, కేంద్రాలలోనూ ఎక్కువగా కేంద్రీకరించవలసిన అవసరం వున్నది. అందుకు తగిన క్యాడరును నియమించాలి. సి. ఐ. టి. యు. యొక్క వనరులను ఎక్కువగా ఈ కర్తవ్య నిర్వహణకై వినియోగించాలి.

చిన్న పరిశ్రమలలోనూ, కనీస వేతనాల చట్టం షెడ్యూలులో చేర్చబడిన పరిశ్రమల లోనూ చెదురుమదురుగా వున్న ఫౌండ్రీలు వర్క్‌షాపులు మున్నగు వాటిల్లోనూ లక్ష

## కార్మిక - కర్షక ఐక్యత ముఖ్యం

లాది మంది కార్మికులు పనిచేస్తున్నారు. వారికి జీతాలు తక్కువ. కనీసవేతనాల చట్టం లో నిర్ణయించబడిన జీతాలుకూడా వారికిముట్టడంలేదు. పనిభారం హెచ్చు. ఉద్యోగ భద్రతలేదు. ప్రమాదాలు హెచ్చు. కాబట్టి వీరిని యూనియన్లలో సమీకృత పరచడం, వీరి సమస్యల కొరకై ఆందోళనలు చేయడం, పోరాటాలు జరపడం అవసరం. ముఖ్యంగా చిన్న చిన్న పట్టణాల్లోనూ, బస్తీలలోనూ వీరే అధిక సంఖ్యలోవుంటారు వీరిని వారి వారి కోర్కెల సాధన కొరకై వుద్యమాల లోనికి తేవాలి. ప్రజాతంత్ర ఉద్యమంలోనికి తేవాలి ఇది అవసరం.

కానీ కీలక పరిశ్రమలను విస్మరించి, వీటికే పరుగులెత్తడం సరికాదు. కీలక పరిశ్రమలకూ, భారీపరిశ్రమలకూ ప్రాధాన్యతనుయిస్తూ ఈ పరిశ్రమలలోని కార్మికులను సంఘటితపర్చాలి

దీనిని మర్చిపోవడం వల్లనే ఈ చిన్న చిన్న ఫ్యాక్టరీలలోని కార్మికుల సమస్యలపై మొత్తం సి ఐ టి యు. శక్తియుక్తులన్నింటినీ కేంద్రీకరించడం, అది కూడా నెలల తరబడి సాగించడం, అందువల ప్రధాన కార్యక్రమాలు కుంటుబడటం కూడాజరిగింది.

సి ఐ టి యు నాయకులు ఒక్కొక్కరూ యిటువంటి అనేక చిన్న ఫ్యాక్టరీలలోని సంఘాలకు నాయకులుగావుండటం జరుగుతూ వున్నది ఒక్కొక్కరు డజను యూనియన్లకు పైగా బాధ్యత వహిస్తూయున్నారు ముఖ్య నాయకులే వీటికి బాధ్యత వహిస్తూవుండడం వల్ల వారి కాలమంతా వీటి సమస్యలకే పరిమితమౌతూ ప్రధాన పరిశ్రమలపై కేంద్రీకరించలేక పోవడంగానీ, మొత్తం వుద్యమాన్ని ఆకళింపు చేసుకుని గైడెన్సు యివ్వలేక పోవడంగాని జరుగుచున్నది. ద్వితీయ శ్రేణి నాయకత్వాన్ని అభివృద్ధి చేస్తానికి కూడా ఆటంకం ఏర్పడుతోంది కాబట్టి సి ఐ టి.యు లోని యితర కార్యకర్తలకు ఈ బాధ్యతలు వప్పగించడం ద్వారా ప్రధాన పరిశ్రమల లోనూ, ఇతర పరిశ్రమలలోనూ మనం నిర్వహించవలసిన కర్తవ్యాలకు న్యాయం చేయడం జరుగుతుంది.

చాలా పట్టణాలలో చిన్నచిన్న పరిశ్రమలు, వర్క్‌షాపులు, ఫౌండ్రీలు, ఫ్యాక్టరీలు వుంటున్నది దేనికి దాని యూనియన్లను ఏర్పరచడంవల్ల 15, 20 మందితో యూనియన్ ఏర్పడటం తన సమస్యలకే అది సతమతమవుతూ జనరల్ కార్మికోద్యమంనుండి దూరంగా వుండటం జరుగుతూ వున్నది. తన స్వశక్తితోనే తన పోరాటాలను సాధించడం కూడాకష్టసాధ్యం. కాబట్టియిటువంటి వాటినన్నిటినీకలిపిఫ్యాక్టరీవర్కర్సు యూనియన్‌అనో, ఇండస్ట్రియల్ వర్కర్సు యూనియన్‌అనో, పట్టణ కార్మిక సంఘం అనో పెడితే ఈ అన్ని తరహాల కార్మికుల పోరాటాలను సమన్వయం చేస్తానికి, ఒకరికొకరు అండదండలందించుకుంటానికి వీలేర్పడుతుంది.

కాబట్టి మనం ఈ క్రింది కర్తవ్యాలను నిర్వహించడానికి పూనుకోవాలి.

1) అన్ని జిల్లాలలోను రైల్వే, ఆర్. టి. సి, ఎలక్ట్రిసిటీ, లారీ ట్రాన్స్‌పోర్టు కార్మికులపై కేంద్రీకరించాలి. అందుకు తగిన క్యాడరును నియమించాలి. ముఖ్యంగా హైదరాబాదు పట్టణంలో ఆర్. టి. సి. ఎలక్ట్రిసిటీ, రైల్వే రంగాలకు, విశాఖలో రైల్వే, పోర్టు, ఆర్. టి. సి, ఎలక్ట్రిసిటీ రంగాలకు విజయవాడలో ఆర్.టి.సి ఎలక్ట్రిసిటీ రంగాలకు ముఖ్య బాధ్యులను వెనువెంటనే నియమించాలి.

మనరాష్ట్రంలో కొన్ని ప్రధాన పారిశ్రామిక కేంద్రాలు హైదరాబాద్, విశాఖపట్టణం. బొగ్గుగనుల బెల్టు, విజయవాడ, గుంటూరు ప్రాంతం వున్నవి. రాష్ట్రంలోని ప్రధానమైన కీలకపరిశ్రమలూ, భారీ ఇంజనీరింగు వగైరా పరిశ్రమలూ ఇక్కడ కేంద్రీకరింపబడి వున్నవి సంఘటిత కార్మికోద్యమంకూడా ఇక్కడ వున్నది. ఈ ప్రాంతాలు పారిశ్రామికంగా అభివృద్ధి అగుటయేగాక రాజకీయ కేంద్రాలుగా, విద్యా సాంస్కృతిక కేంద్రాలుగా అభివృద్ధియై వున్నవి. సి. ఐ. టి యు. కార్యకర్తలుకూడా ఈ ప్రాంతాలలోనే గణనీయమైన సంఖ్యలో వున్నారు. ఈ ప్రాంతాలలో సి. ఐ. టి. యు. బలపడకుండా ఇచ్చట వున్న ప్రధాన పరిశ్రమలలో బలమైన శక్తిగా తయారు కాకుండా తన పైనున్న కర్తవ్యాలను అదినిర్వహించలేదు. రాష్ట్రవ్యాపిత మిలిటెంట్ ఉద్యమాన్ని నిర్మించలేదు. కాబట్టి సి ఐ టి.యు హైదరాబాద్, విశాఖపట్టణం, బొగ్గు బెల్టు, విజయవాడ-గుంటూరు, ప్రాంతాలలో కార్మికోద్యమంపై కేంద్రీకరించాలి వాటిలోకూడా కీలక పరిశ్రమలూ, భారీ పరిశ్రమలపై కేంద్రీకరించాలి. అచ్చటి రైల్వే, ఎలక్ట్రిసిటీ మున్నగు ప్రధాన పరిశ్రమలలోనూ మన బలాన్ని ఆధారం చేసుకొని మొత్తం ఆ పరిశ్రమలో, సర్వీసులో రాష్ట్ర వ్యాపితంగా విస్తరించడానికి కృషిచేయాలి. క్యాడరు నియామకంలో, రాష్ట్ర జిల్లా నాయకత్వాల ప్లానులలో ఈ కర్తవ్యం అత్యధిక ప్రాధాన్యతను వహించాలి.

2) చిన్నచిన్న యూనియన్లను కలిపి ఒకే జనరల్ యూనియన్‌గా ఏర్పాటు చేయాలి. ఒకే పరిశ్రమలో వున్న వివిధ యూనియన్‌లను ఒకే యూనియన్‌లోకి తీసుకురావడంతో దీన్ని ప్రారంభించాలి.

## కీలక పరిశ్రమలపై కేంద్రీకరించండి

ఈ సందర్భంలో ఒక జాగ్రత్తను తీసుకోవలసియున్నది. మన పోరాటం ప్రధానంగా బహుళజాతి గుత్త కంపెనీలకూ, భారతీయ బడా పెట్టుబడిదార్లకూ వ్యతిరేకంగా ఉద్దేశించబడినది. ఈ గుత్త పెట్టుబడుల దోపిడీకి, పోటీకి చిన్న పెట్టుబడిదార్లు తట్టుకోలేకపోతున్నారు. ఇందిరాగాంధి ప్రభుత్వం అనుసరించే విధానాల ఫలితంగా గుత్త పెట్టుబడులు చిన్న పరిశ్రమలలోకికూడా ప్రవేశించటంవల్ల చిన్న పెట్టుబడిదారులు మధ్యరకం పెట్టుబడిదార్లు కూడా దెబ్బతింటున్నారు గుత్త పెట్టుబడిదారులు ఆఖరుకు చిల్లర వ్యాపారంలోకి కూడా దిగుతూవున్నారు కాబట్టి మనం కార్మికుల డిమాండ్లు పెట్టేటప్పుడు చిన్న పరిశ్రమల స్తోమతునుకూడా దృష్టిలో పెట్టుకోవాలి. పట్టువిడుపులతో కూడిన వైఖరిని అవలంబించాలి.

కార్మికోద్యమాన్ని నిర్మించటంలో, కార్మిక సంఘాలను ఏర్పర్చడంలో మనం మరొక జాగ్రత్తను తీసుకోవాలి. సి ఐ.టి యు.కార్యకర్తలు లేనిచోటకు వరుగులెత్తి యూనియన్లను స్థాపించటం కార్మికోద్యమానికి బాసటగా నిల్వగల ప్రజాసంఘాలనూ, ప్రజా వుద్యమాలనూ నిర్మించకుండా ఆ యూనియన్లను నడపజూడటం హానికరం. యజమానులు ఎన్నడూ మిలిటెంటు యూనియన్లను సహించరు. వాటిని అణచివేయుటకై కార్మిక నాయకులను, కార్మికులను బర్తరపు చేయడం, లాకౌట్లు ప్రకటించడం, దూరప్రాంతాలకు బదిలీచేయడం మున్నగు చర్యలకు పూనుకుంటారు. బేతంచెర్ల, సూళ్ళూరుపేట, ఎమ్మిగనూరు మున్నగు ఉదాహరణలు వున్నవి. కాబట్టి తగినంత కేడరు వున్నచోట, ప్రజాసంఘాల, ప్రజాతంత్ర వుద్యమం యొక్క మద్దతు లభించు చోట మన వుద్యమ విస్తృతానికి అనువు ఏర్పడుతుంది.

ట్రేడ్‌యూనియన్ల నిర్మాణ బలహీనత, సంఘటిత ట్రేడ్‌యూనియన్ ఉద్యమం విభజితమైవుండటం, సంఘటిత ట్రేడ్ యూనియన్లలో మనము ప్రధాన శక్తిగా గానీ, నాయకత్వశక్తిగా గానీ లేము అనే సత్యాన్ని-అనేక పరిశ్రమలలో ఇతర సెక్షన్లు మనకంటే బలంగా వుండడం, కొన్ని పరిశ్రమలలో మనతో సమానంగా ఉండడం దృష్టిలో వుంచుకొని నిలకడైన ఐక్యసంఘటన ఎత్తుగడను నవలంబించడం ద్వారానే కార్మికవర్గాన్ని సమీకరించే కర్తవ్యాన్ని నిర్వహించగలం. రానున్న పోరాటాలలో కార్మికవర్గ ఐక్యతా లక్ష్యాన్ని సమ్మెల వెల్లువతో మనమొక్కరమే పూరేగాలని ప్రయత్నించడంద్వారా సాధించలేము. అటువంటి ఎత్తుగడ, వివిధ కేంద్రాలలో రంగంలోనికి వచ్చే అసంఖ్యాక కార్మిక బాహుళ్యం నుండి-ఎటూ నిర్ణయించుకోనివారు ఇతర ట్రేడ్‌యూనియన్ల ఇతర రాజకీయ పార్టీల పలుకుబడి కింద గల కార్మికుల నుండి మనలను వేరు చేస్తాయి.

సి.ఐ.టి.యు. రాష్ట్రకమిటీ ఏర్పడినప్పటి నుండీ మనం దీనికొరకై కృషి చేస్తూనే వున్నాం. మనం యింకా బలహీనంగానే వున్నప్పుడే రైల్వే కార్మిక సమ్మె సందర్భంలోనే యిందుకొరకై గట్టి ప్రయత్నం గావించాము. యన్. సి సి. ఆర్. ఎస్. పని చేయడానికి ఇప్పుడు జడ్.సి.సి.ఆర్. పని చేయడానికి మన చొరవే ప్రధానంగా వుంటు

న్నది. ప్రభుత్వరంగ పరిశ్రమల సదస్సులు జరపడంలోగానీ ,నేషనల్ కాంపెయిన్ కమిటీ ఇచ్చిన పిలుపుల సందర్భంలో గానీ యితర సమస్యలపై గానీ, రాష్ట్ర కార్మికవర్గాన్ని సమీకరించడానికి మనమే చొరవతీసుకొంటూ యున్నాము. కొన్ని సందర్భాలలో ఇన్సూరెన్సు యూనియన్లు చొరవ తీసుకొన్నవి కొన్ని సందర్భాలలో ఎ.ఐ టి యు సి చొరవ తీసుకున్నా మనం పూర్తిగా సహకరించాము.

అయితే ఈ సదస్సులు, ఐక్యకార్యాచరణ సందర్భాలలో మన శక్తి నంతటినీ సమీకరిస్తానికి ప్రయత్నిస్తూ రాగా యితర యూనియన్లు ఆ ఆసక్తినీ, పట్టుదలనూ చూపెట్టడంలేదు కొన్ని సందర్భాలలో ఆ కార్యక్రమాలకు తూట్లు పొడవడం కూడా జరిగింది.

## ప్రజాతంత్ర కార్య విధానం

కార్మికులు తమంతతామే అన్ని పాలసీ విషయాలను ప్రజాతంత్రయుతంగా చర్చించి నిర్ణయించుకొనే ప్రజాతంత్ర సంస్థలుగా ట్రేడ్ యూనియన్‌లను అభివృద్ధి పరచ

## మన పోరాటం బడాబూర్జువాతో

యన్ దైనందిన కార్యక్రమంలో పాల్గొనునట్లు చేయగలము. యూనియన్ ప్రజా పునాది నిరంతరం పెంపొందగలదు.

యూనియన్ విధానాన్ని రూపొందించడంలో, వివిధ స్థాయిలలో యూనియన్‌కార్యకలాపాలలో పాల్గొనడంలోను, చర్చలలో, పోరాటాలలో పాల్గొనడంలోనూ, యూనియన్ సామాన్య సభ్యుల వర్గ శిక్షణ, వర్గ చైతన్యం పొందుతారు.

ఇతరులకూ మనకూ ట్రేడ్ యూనియన్ రంగంలో వచ్చిన విభేదాలలో ఈ సమస్య ఒకటి ప్రధానమైనది. అందుచేతనే సి. ఐ. టి.యు నిబంధనావళిలో "ప్రజాతంత్రకార్య విధానము" అన్న అధ్యాయాన్ని ప్రారంభంలోనే జేర్చాము సమష్టి నాయకత్వం,క్యుములేటివ్ ఓటింగ్, మెనారిటీ అభిప్రాయాలకు తగిన స్థానాలు యివ్వడం మున్నగు ప్రజాతంత్ర పద్ధతులను ఆదేశించాము.

సరే-వాటిల్లో పనిచేయాలన్నది మనసూత్రం. ఈ ఆదేశాన్ని తరచూ మన కార్యకర్తలు మరిచిపోవడం జరుగుతూవుంటుంది. ఎ ఐ. టి.యు.సి. సంఘాలలోగాని, ఐ. ఎన్. టి. యు.సి. సంఘాలలోగానీ వుండి మనం పని చేస్తూన్నప్పుడు అక్కడ చాకచక్యంగా మన రాజకీయాలు తీసుకువెళుతూ, కార్మికుల్లో మెజారిటీని అధిక సంఖ్యాకులను మన వైపుకు ఆకర్షించడానికి బదులు ఆ సంఘాల నుండి బయటకు వచ్చి మన వెనుకనున్న కొద్ది సభ్యత్వంతో పోటీ సంఘాలనేర్పర్చడానికి ఉత్సాహపడటం జరుగుతూవున్నది. ఇది సరైన పద్ధతికాదని నిరూపించినపుడు అసలు యూనియన్ కార్యకలాపాలకే స్వస్తి చెప్పడం జరుగుతూవున్నది.

కార్మికవర్గంలో మనం ఇప్పటికి మైనారిటీ అని గుర్తించాలి ప్రజా బాహుళ్యం సభ్యత్వం గలిగిన ఫెడరేషన్లూ, యూనియన్లూ అనేకం ఎ ఐ టి యు సి, ఐ. ఎన్. టి. యు. సి. మున్నగువాటి నాయకత్వాన వుంటున్నవి వాటిలో మనం పనిచేయడం మన కర్తవ్యం.

# నండూరి నివేదిక

డంలో తరచూ మన కార్యకర్తలే విఫలమౌతున్నారు.

మన పనిలో విస్తృతంగా సాధారణ కార్మికులందరినీ కదలికలోకి తెచ్చి, నవ చైతన్యం రేకెత్తించే కార్యక్రమాన్ని వేగిరపరచే కార్మికవర్గ ప్రజాతంత్ర పద్ధతులు, రూపాలు, ధైర్యంగా ఆచరించడంలో లోటు వుంది. ఫ్యాక్టరీలలో రోజూవారి సమస్యలపై ఆందోళన చేయడంలోను, యూనియన్ విధానాన్ని చర్చించడం యూనియన్ నిర్ణయాలను రూపొందించడంవంటి కర్తవ్య నిర్వహణలో సభ్యులను,సభ్యులు కానివారిని కూడా సమీకరించడంకూడా అందులోభాగమే బహిరంగ మాస్ మీటింగులలో చర్చించనున్న విషయాలను, యూనియన్ అనుసరిస్తున్న పంథాను కార్మికులకు వివరించిన తరువాత ఎన్నిక జరపడం కార్మికవర్గ ప్రజాస్వామ్యంలో ఒక ప్రధానమయిన భాగం. యూనియన్ నిబంధనావళిలోని నియమాలను పాటించటమే ప్రజాస్వామ్యం భాగంకాదు. విపరీతమైన కార్మికవర్గ ప్రజాస్వామ్య పద్ధతుల ననుసరించడంద్వారా మాత్రమే,కార్మిక బాహుళ్యం, సభ్యులు పెద్ద ఎత్తున యూని

మనం ఆచరణలో ఈ సూత్రాన్ని ఎంత వరకు అమలు జరుపుతూ వున్నాము అనేది చూడాలి

కొన్ని యూనియన్ల ఫంక్షనింగు వ్యక్తులపై ఆధారపడి జరుగుచూవున్నది. ఇందువల్ల కమిటీ సభ్యులు నిర్ణయాలను తీసుకొనడంలో ప్రేక్షకపాత్ర వహిస్తూవుండడం, నాయకుడు - అనుచరుడు అనే ప్రాక్టీసు అమలులోకి వస్తూవుండడం జరుగుతూ వున్నది. ఈ లోపాలను సరిదిద్దుకోవాలి.

కాబట్టి ఈ విస్తారమైన సెక్షన్ల యెడ మనం మరింత శ్రద్ధతీసుకోవాలి. ముఖ్యంగా బ్యాంకులు, ఇన్సూరెన్సు, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వోద్యోగులతో మనకున్న సంబంధాలను పెంచుకోవాలి. ఆ రంగంలో పార్టీని విస్తృతపర్చాలి

## అభివృద్ధి నిరోధక సంఘాల్లో పనిచేయడం

కార్మికులు ఎక్కడవుంటే అక్కడ పని చేయాలని అన్నది- ఆ సంఘాలు ఎంత అభివృద్ధి నిరోధక నాయకత్వం క్రింద వున్నా

సంస్కరణవాద యూనియన్ల చేత నడుపబడిన సమ్మెల సంఖ్యాధిక్యతను చూస్తే వాటిలో ఒకపద్ధతి ప్రకారం పనిచేయవలసిన అవసరాన్ని స్పష్టంగా చూపుతున్నది అలా చేయక పోవడమంటే సమ్మెలకు ద్రోహం చేయడానికి వారి పలుకుబడిని యింకా నిలబెట్టుకోవడానికి గాను సంస్కరణ వాదులకు ఆ కార్మికులను కార్యకర్తలను వదలివేయటమే అవుతుంది. సంస్కరణవాద యూనియన్లలో పని చేయడానికి కార్మికవర్గంలో మన పలుకుబడిని పెంచుకొంటానికి గాను సంస్కరణవాద యూనియన్ల లోపల కృషి సాగించడానికి గల నిరోధకతను శీఘ్రంగా అధిగమించడం, ఐక్య సంఘటన కోసం మనం సాగించేపోరాటానికి విజయం చేకూర్చడానికి అవసరం ఈ యూనియన్లలో ఎలా పనిచేయాలి, ఏ పద్ధతుల ననుసరించాలి ఏ సమస్యలను చేపట్టాలి అనేవి ఆయా సందర్భాలను బట్టి క్షుణ్ణంగా చర్చించి నిర్ణయించుకొనవలసినవి.

( మిగతా 66 వ పేజీలో )

# మీకోసమేగాదు, ప్రజలకోసంగూడ పోరాడాలి

మన మహాసభలో పెట్టిన నివేదికలు చూశాను. ప్రతినిధుల చర్చలు విన్నాను. సభలో ప్రవేశపెట్టిన అనేక తీర్మానాలు చూశాను. నా అభిప్రాయాలు చెప్పాలనుకున్నాను.

మీరిక్కడ అనేక తీర్మానాలు ప్రవేశపెట్టారు. వాటిలో ఎక్కువభాగం ప్రభుత్వం "అది చేయాలి, ఈ చట్టం యిలా మార్చాలి" అని కోరేవి వున్నాయి. కాని ఇది కార్మికుల ప్రభుత్వమా? కాదు. కానప్పుడు మనం చెప్పినట్లు మనకు అనుకూలమయిన చర్యలు ఎందుకు తీసుకుంటుంది? మనకు అనుకూలమైన ప్రభుత్వాన్ని ఏర్పరచుకునేందుకు, కార్మికవర్గ రాజ్యాన్ని సాధించుకునేందుకు మనం కృషి చేయాలి.

కాని అంతవరకు సమస్యలు ఆగవుగదా? మనం కోర్కెలు సాధించుకోవాలి. అందుకు మార్గమేమిటి?

రాష్ట్రంలో సి. ఐ. టి. యు. సభ్యత్వం 55 వేలు. రాష్ట్రంలో వివిధ రంగాలలో 20 లక్షలమంది పని చేస్తున్నారు. వ్యవసాయేతర రంగాలలో 25 లక్షల మంది, వ్యవసాయంలో 80 లక్షల మంది వున్నారు. సి. ఐ. టి. యు. సోదర గ్రామీణ కష్ట జీవుల సంఘాల్లో 3 లక్షల మంది చేరారు. ఇంత తక్కువ సంఖ్యలో వుండి మనం కోరితే ఏ ప్రభుత్వమైనా పనిచేస్తుందా? అందువలన మన యూనియన్ల సభ్యత్వం పెరగాలి. చైతన్యయుతంగా. యజమానులతో పోరాడే శక్తి పెరగాలి.

మన రాష్ట్రంలో మన సి. ఐ. టి. యు. కార్యకర్తలు అనేక ఇతర సంఘాలలో వుండి పనిచేస్తున్నారు. అది ఏ సంఘమైనా కానీండి. అది సంస్కరణవాద సంఘమైనా సరే. ఆ సంస్థలో కార్మికులందరినీ సభ్యులుగా చేర్పేందుకు మనం కృషి చేయాలి. సమస్యలు తీసుకొని కష్టపడి పని చేయాలి. అప్పుడే సి. ఐ. టి. యు కార్యకర్తలు వర్గ తత్వంతో పనిచేసినట్లౌతుంది.

ఇక్కడకు వచ్చిన ప్రతినిధులు వేరే సంఘాలు పెట్టాలంటున్నారు. కీలకమైన రంగాల్లో మన బలం వేరే సంఖ్యలోనేవుంది. మన సంబంధాలు పెంచుకోకుండా వేరే సంఘాలు పెట్టడం ఎలా?

అనేక కోర్కెలు మనకు వున్నాయి. వాటిని తీర్చుకునేందుకు ఆయా సంఘాలు కృషి చేస్తున్నాయి తీర్మానాలు చేస్తున్నారు. కాని ఎవరికి వారు తమ కోర్కెలు తీర్చుకోగలమనుకోడం పొరపాటు. ఈ దృక్పథం మారాలి. తోటి కార్మికులను కలుపుకొని పోరాడాలి. ఏ కేటగిరీకి ఆ కేటగిరీగా ఆలోచించరాదు. పబ్లిక్ రంగ సంస్థలకు వాటిలో పనిచేసే సి. ఐ టి. యు కార్యకర్తలకు ప్రత్యేక వేదిక కావాలంటున్నారు. తామొక్కరే ఏ కోర్కెలనూ సాధించుకోలేరు. ఆ సంస్థల చుట్టూగల కార్మికులందరినీ కలుపుకోవాలి. అలాంటి వారికంతా కలిపి ఒక వేదిక ఏర్పర్చుకోవాలి. దాదాపు అన్ని పట్టణాలలో మనం సి ఐ.టి యు కౌన్సిళ్ళు ఏర్పర్చాము అందుకు మనకు అధికారం ఎవరిచ్చారు? మన సౌలభ్యంకోసం ఏర్పాటు చేసుకున్నాం. సి.ఐ.టి.యు అనుబంధం కాని సంఘాల్లో పనిచేసే కార్యకర్తలకు సహితం వేదికలుగా వుపయోగించేందుకే ఇవి ఏర్పాటైనాయి. ఈ వేదికల ఆధారంగానే మన కార్యకలాపాలు సాగించాలితప్ప, ఏ కేటగిరీకి ఆ కేటగిరీగా వేదికలు ఏర్పర్చుకోడం పొరపాటు అది కార్మికవర్గం వేరువేరుగా చీలడానికే వుపయోగిస్తుంది.

అందుకే మనం కార్మికులను ఐక్యం చేసే వేదికలు ఏర్పర్చాలి 1932లో మేము కూలి రక్షణ సంఘాలు పెట్టి కార్మికులందరినీ ఒకరికొకరిని అండగా నిలిపేవాళ్ళం.

అయితే మన కార్యకలాపాలు ఫ్యాక్టరీలకే పరిమితం కారాదు. మనం నివసించే ప్రదేశాల్లో సహితం పరస్పరం అవినాభావ సంబంధంతో పనిచేస్తే మనం పెరుగుతాము.

శ్రామిక మహిళల సమావేశం పిలిచాం. మనం వారిలో తగినంత కృషిచేస్తున్నామా? బీగాకు కార్మికుల్లో, రైస్‌మిల్స్‌లో స్త్రీలు ప్రధానంగా వున్నారు మార్కెట్లలోఉన్నారు. నర్సులు,ఉపాధ్యాయుల్లో మహిళలువున్నారు. వారిలో మనంలేము. వివిధ వృత్తులలో ఉన్న స్త్రీలను విరివిగా యూనియన్లలో సభ్యులుగా చేర్చాలి.

కార్మికులకు కావలసిన సర్వవిషయాల గురించి ట్రేడ్ యూనియన్లు పోరాడాలి. వారి జీతాలు, పని పరిస్థితులేగాదు వారికి ఇండ్లవసతి, వారి బిడ్డల చదువు వారి కుటుంబాలకు ఆరోగ్యకరమైన పరిసరాలు కలిగించడం వారి స్త్రీలకు వృత్తి అవకాశాలు వారి ఆరోగ్యం అన్నీ ట్రేడ్ యూనియన్లు పట్టించుకోవాలి. సర్వతోముఖమైన డిమాండ్లు పెట్టాలి వాటి సాధనకు పోరాడాలి తమ హక్కులకై, తమ జీవిత వికాసానికై నిలబడేది ట్రేడ్ యూనియన్ అనే చైతన్యం కార్మికునిలో అతని కుటుంబ సభ్యులలో గూడ రావాలి అప్పుడే వారు ట్రేడ్ యూనియన్లలో చేరతారు. ఉత్సాహంగా దాని కార్యకలాపాలలో పాల్గొంటారు.

మరొక పొరపాటు ధోరణి. వార్డులలో కార్యకలాపాల్లో పాల్గొంటారు. ఫ్యాక్టరీలో పనిచెయ్యరు. మేనేజిమెంటుతో పోట్లాడరు. ఈ రెండు పొరపాటు ధోరణులు పోవాలి. ఫ్యాక్టరీలో మేనేజిమెంటుతో పోట్లాడాలి. నివాస స్థలాల్లో ప్రజలను కూడగట్టి సేవా కార్యక్రమాల్లో, అవసరమైతే పోరాటాల్లో పాల్గొనాలి. కార్మికుల ఇంటి సమస్య విషయంలోగూడ మనం కృషి చెయ్యాలి. అది మనపని కాదనుకోరాదు. అలాగే మనసభ్యుల సమస్యలకేగాక, ఆ ప్రాంత ప్రజలందరి సమస్యలు తీసుకొని పోట్లాడాలి. అప్పుడే వారి అండదండలు మనకు లభిస్తాయి.

ఇంకొక పరిస్థితి ఏమిటంటే – మనం కోర్కెలు ప్రకటిస్తాం అదేదో మనకు, మేనేజిమెంటుకు మధ్య సమస్యగా మాత్రమే వుంచేస్తాం. ఇది పొరపాటు. మన కోర్కెలు సమంజసమైనవని చుట్టుప్రక్కల ప్రజలకు నచ్చచెప్పాలి. వారిని ఒప్పించాలి ఆ విధంగా ప్రజాభిప్రాయాన్ని మనకు అనుకూలంగా మలచుకోవాలి. తద్వారా మన సంఘటిత శక్తేగాక, చుట్టూ ప్రజల నైతిక బలం, అవసరమైనప్పుడు అన్ని విధాలా మద్దతు లభిస్తుంది. మన విజయాల నుండి వారు సంఘ

టిత శక్తిని దాని అవసరాన్ని అర్థం చేసుకొని సమైక్యమవుతారు. కార్మికులు పట్టణ పేదలతో కలిసి పోరాడితేనే విజయం సాధిస్తారు.

ప్రజల్లో ఐక్యతా భావాన్ని పెంపొందించి వారి హక్కులకు వారు సంఘటితంగా పోరాడే చైతన్యం కలిగించడం కార్మికవర్గ బాధ్యత. అందుకు ప్రథమ చర్యగా మన యిండ్లలో యువకులను, విద్యార్థులను, మహిళలను ఆయా ప్రజా సంఘాలలో చేరమని ప్రోత్సహించి చేర్పించాలి. వాటిలో చురుకైన పాత్ర వహించేలా సాయం చెయ్యాలి.

కనీసవేతన వంటివి వేరువేరుగా వంటరిగా పోట్లాడి సాధించుకోగలమా? అందరం కలసి సమాజానికి వ్యతిరేకంగా పోరాడాలనే చైతన్యం కార్మికులలో కలిగించాలి. ఏ పని చేసినా ఇతర సెక్షన్లను కలుపుకొని పని చేయాలి. కార్మికవర్గం జనతా ప్రజాస్వామిక విప్లవసాధనకు కృషి చెయ్యాలి. కార్మికవర్గం ఇతరులకోసం పోట్లాడుతూ సమాజాన్ని విముక్తి చేసేందుకు కృషి చేయాలి.

పట్నాల్లో పనిచేసే 40 లక్షల మంది, గ్రామాల్లో కష్టజీవులు 80 లక్షల మందికలసి పని చేయాలి. తెలంగాణా పోరాట కాలంలో ఈ ప్రాంతంలో అండదండలు యిచ్చింది. బొగ్గుగని కార్మికులు, రైతులు ఆదిమప్రజల్లో లీనమై పనిచేశారు. గ్రామ పేదలను కలుపుకోడం అవసరం. ఆర్. టి. సి కార్మికులు గ్రామ ప్రజలకు సేవ చేస్తున్నారా? ఐ ఎల్. టి.డి. వారు రైతాంగానికి సేవచేస్తున్నారా? గిట్టుబాటు ధర యివ్వాలని సమ్మె చేశామా? యజమానులను హెచ్చరించామా?

చిన్న చిన్న సంఘాలెందుకు? పట్టణంలో వుండే ముఠాకార్మికులందరిని ఒకేసంఘంలో చేర్పించవచ్చు. రిక్షా,హోటల్ కార్మికులందరికీ ఒకే సంఘం పెట్టవచ్చు. ఇంగ్లండ్‌లో 'జనరల్ వర్కర్స్ యూనియన్' అనివుంది అలాగే మనమూ ఎందుకు పెట్టగూడదూ?

హోల్‌టైమర్ల సంఖ్య పెంచాలన్నారు ఆ సూచన మంచిదే. అవసరం గూడా. కాని హోల్‌టైమర్లంటే గుమాస్తాలు కాదు. కార్మికుల సమస్యలలో లీనమై వారి అభిమానాన్ని, విశ్వాసాన్ని చూరగొనవలసిన కార్యకర్త. కొత్తగా చదువుకొని వచ్చే వారిలో వుత్సాహం వుండచ్చు. కాని వారు వెంటనే కార్మికుల విశ్వాసం చూరగొనగలరా? కాబట్టి యిప్పటికే గుర్తింపు, విశ్వాసం పొంది, సమస్యల పట్ల అవగాహన గలవారు త్యాగాలు చేసి ముందుకు రావాలి

గ్రామసీమల పనికి నష్టం లేకుండా, పారిశ్రామిక కార్మికులలో పనిచేయాలి. పట్టణాలను కీలకంగా చేసుకొని పని చేయాలి చురుకుగా వుండేవారిని ప్రోత్సహించి కార్యకర్తలుగా అభివృద్ధి చేయాలి. పెరుగుదలకు గీటు రాయి ఏమిటి? ఎంతమంది కార్యకర్తలను రిక్రూట్ చేశాము రాజకీయాలు నేర్పగలిగాము అనేది 13 సంవత్సరాల తర్వాత లక్ష సభ్యత్వం చాలదు. రాజకీయ పిలుపులపై ఎంతమందిని సమీకరించ గలుగుతున్నాం? రాజకీయ చైతన్యం కలిగించి, కార్యకర్తలను అభివృద్ధి చేసుకొన లేక పోవడమే ఇందుకు కారణం. మనం1500 మందిని చైతన్యంగల కార్యకర్తలను తయారు చేసుకోగలిగాం. ఇది చాలదు 10 వేల మందైనా కావాలి.

మార్క్సిజం-లెనినిజం అధ్యయనం చేసి దాని నీడన పనిచేయడానికి పూనుకునేకార్యకర్తల సంఖ్యే దీనికి గీటురాయి.

వర్గ సంఘాలు పెట్టింది, స్వాతంత్రోద్యమంతో వారికి సంబంధం కలుగజేసి, ఆ వుద్యమానికే జవసత్వాలుకలిగించింది కమ్యూనిస్టులు. గ్రామీణ - పట్టణ పేదల ఐక్యత అవసరాన్ని దృష్టికి తెచ్చింది కమ్యూనిస్టులు. సమగ్రదృష్టితో కృషి చెయ్యండి. మనం మరిన్నింతలుగా పెరుగుతాం.

[ఒక ప్రతినిధి నోట్సు నుండి]

★

---

( 64 వ పేజీ తరువాయి )

## ఎడ్యుకేషన్

ట్రేడ్ యూనియన్ రంగంలో పనిచేసే కార్యకర్తల బోధన నిమిత్తం రాజమండ్రి పాఠశాలతో మొదలుకొని మనం అనేక పాఠశాలలు నిర్వహించాం. 1982 అక్టోబరు ట్రేడ్ యూనియన్ల నిర్వహణ, కార్మిక చట్టాలు, ట్రేడ్ యూనియన్ రంగంలో కర్తవ్యాలు, ప్రపంచ, భారతీయ కార్మికోద్యమ చరిత్రను బోధించే పాఠశాలలను నిర్వహించడం జరిగింది. 209 మంది విద్యార్థులు దానికి హాజరైనారు.అయినా ఈపాఠ్యాంశాలు ఎంతవరకు వినియోగపడినవనే విషయం చర్చనీయాంశంగా వుంది. ఎఫిలియేషన్ ఫీజు పంపడం, యాన్యువల్ రిటర్న్సు పంపడం మున్నగు వాటిల్లోఇప్పటికీ లోపాలు

## ప్రజాతంత్ర కార్య విధానం మన ఆశయం

జరుగుతున్నది. కాబట్టి పాఠశాలలు నడవడమేగాక వాటిని ఎంతవరకు అర్థం చేసుకొని కార్యకర్తలు అమలుజరుపుతున్నారు? అనే దానిని రాష్ట్ర కేంద్రం పరిశీలిస్తూ వుండాలి.

## మధ్యతరగతి ఉద్యోగులు

ఇటీవలి కాలంలో మధ్యతరగతి వుద్యోగుల సంఖ్య పెరిగింది. వారి ఉద్యమమూ ట్రేడ్ యూనియన్ ఉద్యమ స్వరూపం తీసుకున్నది.

మన రాష్ట్రంలో రాష్ట్ర కేంద్రప్రభుత్వ సర్వీసుల్లోనూ, స్థానిక సంస్థలూ, బోర్డులూ, కార్పొరేషన్‌లూ మున్నగు వాటిల్లోనూ, బ్యాంకులు, ఇన్సూరెన్సులలోను సుమారు 8 లక్షలమంది వుద్యోగులూ, కార్మికులూ పనిచేస్తున్నారు. వీరిలో హెచ్చుభాగం అనేక సంఘాలలో సంఘటితమై వున్నారు అనేక మిలిటెంటు పోరాటాలను నడిపారు.

గత 12 ఏండ్లు మన వుద్యమ అనుభవాలను క్లుప్తంగా తెలియజేశాను. మనం సాధించిన విజయాలను పేర్కొన్నాను. మన కృషిలో వున్న లోపాలను ఎత్తిచూపెట్టాను. విజయాలను ప్రాతిపదికగా జేసుకొని, లోపాలను సరిదిద్దుకొని, ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవాలి. పైన సూచించిన విధంగా నిర్మాణాన్ని ఏర్పర్చుకొంటే, సి ఐ.టి.యు. రాష్ట్రంలో ఒక బలీయమైన శక్తిగా తయారవుతుందనుటలో సందేహం లేదు.

★

# రాష్ట్ర మహాసభ తీర్మానాలు

## సంతాప తీర్మానం

గత మహాసభ నుండి ఈనాటి వరకు కార్మికవర్గ ప్రయోజనాలకు అంకితమైన అనేకులు మరణించారు.

సోవియట్ కార్మికవర్గ నాయకులు కామ్రేడ్ సుస్లోవ్ సోవియట్ అధ్యక్షుడు కా॥ బ్రెజ్నేవ్‌ల మరణానికి ఈ మహాసభ తన సంతాపాన్ని తెలియజేస్తున్నది. భారత కార్మికుల ప్రియతమ నాయకులు కామ్రేడ్స్ ప్రమోద్‌దాస్ గుప్తా, బాలసుబ్రహ్మణ్యం, కామ్రేడ్ జయపాల్ సింగ్, కామ్రేడ్స్ దినేస్ భట్టాచార్య, జ్యోతిర్మయిబసు, సుహృద్ మల్లిక్ చౌదరి, శంకర్‌గుప్తాల మరణానికి ఈ మహాసభ తన సంతాపాన్ని వ్యక్తం చేస్తున్నది. భారత జాతీయోద్యమ నాయకులు, కాశ్మీర్ మాజీ ముఖ్యమంత్రి శ్రీ షేక్ అబ్దుల్లా, ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య యోధుడు శ్రీ తెన్నేటి విశ్వనాథం గారల అస్తమయానికి ఈ మహాసభ తన సంతాపాన్ని తెలియజేస్తున్నది.

మన రాష్ట్ర ట్రేడ్‌యూనియన్ ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించిన శ్రీ కపర్దిగారి మరణానికి తన సంతాపాన్ని ఈ మహాసభ వ్యక్తం చేస్తున్నది.

రాష్ట్ర సి ఐ టి యు. ఉద్యమంలో, ముఖ్యంగా రోడ్స్ అండ్ బిల్డింగ్స్ కార్మికులను సమైక్యం చేయడంలో తీవ్రంగా కృషి చేసిన కా॥ ఎం.కె స్వామి రాష్ట్ర సి ఐ టి.యు. ఉద్యమ నాయకులు, షిప్ యార్డు కార్మికుల ప్రియతమ నాయకుడు అయిన కా॥ సత్తిరాజు మరణం మన రాష్ట్ర ట్రేడ్ యూనియన్ వుద్యమానికి ఎంతో లోటు. వారి మరణానికి మహాసభ తన సంతాపం తెలియజేస్తున్నది.

భారత కార్మికోద్యమంలో కృషి చేసి అస్తమించిన వీరి ఆశయాలకు అనుగుణ్యంగా ట్రేడ్ యూనియన్ వుద్యమాన్ని మరింత ముందుకు తీసుకెళ్ళగలమని ఈ మహాసభ ప్రతిజ్ఞ పూనుతున్నది

## టంగుటూరు రైతాంగంపై కాల్పులకు నిరసన

గిట్టుబాటు ధర యిప్పించాలని కోరుతూ ఆందోళన చేస్తున్న టంగుటూరు ప్రాంత రైతాంగంపై తుపాకీ కాల్పులు సాగించి, ముగ్గురు రైతులను పొట్టబెట్టుకున్న ప్రభుత్వ చర్యను ఈ మహాసభ గర్హిస్తున్నది.

## ప్రభుత్వ రంగ సంస్థల కార్మికుల పోరాటంపై

పబ్లిక్ రంగ సంస్థలు 185 వుండగా 160 సంస్థలలో వేతన పునర్నిర్ణయం జరగవలసివుంది.

జీతాల పునర్నిర్ణయం గురించి బ్యూరో ఆఫ్ పబ్లిక్ ఎంటర్‌ప్రైజెస్ రూపొందించిన కార్మిక వ్యతిరేక సూత్రాల ఫలితంగా చర్చలు నిరవధికంగా సాగుతున్నాయి

కార్మికుల జీతాలలో కోత పెట్టేందుకు ప్రభుత్వం ఈ సూత్రాల పేరిట సాగిస్తున్న దాడిని ఈ మహాసభ ఖండిస్తున్నది.

పబ్లిక్ రంగ సంస్థలు నష్టాలపై నడుస్తున్నాయనే ప్రభుత్వ వాదన అవాస్తవికమైంది.

డివిడెండ్లు, ఎక్సైజ్ సుంకాలపేరిట ప్రభుత్వ ఖజానాకు ఈ సంస్థలు విపరీతంగా డబ్బు చెల్లిస్తున్నాయి. 1975-76లో రు. 1,196 కోట్లుగావున్న ఈ చెల్లింపులు 1980-81 నాటికి రు 3429 కోట్లకు పెరిగాయి. అంతేగాక కార్మికులపై అదనంగా మోపబడిన పనిభారం మూలంగా శ్రామికుడు కలిపే విలువ 1975-76లో రు. 2,083 కోట్లుకాగా, 1980-81 నాటికి రు. 4385 కోట్లకు పెరిగింది.

అదే సమయంలో కేవలం కరువుభత్యంపై గల ఆంక్షల మూలంగా గత నాలుగు సంవత్సరాలలోనే కార్మికులు తమ నిజ వేతనాలలో 18 శాతం నుండి 56 శాతం వరకు నష్టపోయారు. ఉత్పత్తిని పెంచాలని కార్మికులను కోరే సందర్భంలో ఉత్పత్తి ఖర్చులలో కార్మికుల వేతనాల శాతం క్రమేపీ పడిపోతున్న విషయాన్ని ప్రభుత్వం మరుగుపరుస్తున్నది.

ఇటువంటి కీలక సమయంలో జాతీయోద్యమ కమిటీ పిలుపుపై 1983 జనవరి 26న దేశవ్యాపిత పబ్లిక్‌రంగ సంస్థల సమ్మెకు ఏర్పాట్లు జయప్రదంగా జరగడం అత్యంత హర్షణీయమైన విషయం.

ఇలాంటి ఐక్య ప్రతిఘటనముందు ప్రభుత్వం వెనకడుగు వేసింది. కరువుభత్యం సూత్రం మార్పుకు అంగీకరించి, ఆ మార్పును సూచించేందుకు ఒక కమిటీని నియమిస్తానని, కమిటీ నివేదికను ట్రేడ్ యూనియన్లతో చర్చించి అమలుజరుపుతానని ఒప్పందానికి వచ్చింది. అలాగే బి పి. ఇ. గైడ్‌లైన్స్‌ను పునఃపరిశీలించేందుకు సూత్రప్రాయంగా అంగీకరించింది. ఇది మొత్తం కరువుభత్యం పొందుతున్న కార్మికవర్గానికి ఎంతో అనుకూలమైన పరిణామం.

ఈ ఒప్పందం జరిగి మూడు నెలలు దాటినా ఇంతవరకూ కమిటీని వేయకుండా ప్రభుత్వం తాత్సారం చేస్తున్నది.

ప్రభుత్వంచేత ఒక విషయం అంగీకరింపజేయడం ఒక ఎత్తుకాగా దానిని అమలు జరిపించుకొనడం మరొక యిబ్బందిగా తయారౌతున్నది.

ఇది భారత కార్మికవర్గ అనుభవం.

ఈ అనుభవందృష్ట్యా తిరిగి ఒక పెద్ద పోరాటానికి సన్నద్ధం కావలసి రావచ్చని ఈ మహాసభ భావిస్తున్నది.

ప్రథమ విజయం సాధించిన పబ్లిక్‌రంగ సంస్థల కార్మికులను ఈ మహాసభ అభినందిస్తూ, అవసరమై జాతీయోద్యమ కమిటీ పిలుపుయిస్తే మరోసారి పోరాటానికి సిద్ధపడవలసిందిగా కోరుతున్నది

పబ్లిక్‌రంగ సంస్థల కార్మికుల పోరాటం అందరు కార్మికుల పోరాటం. వారు పోరాటానికి పూనుకుంటే వారిని అన్నివిధాలా బలపర్చవలసిందిగా సి. ఐ. టి. యు యూనియన్లను, కార్యకర్తలను ఈ మహాసభ కోరుతున్నది.

## శాంతి పరిరక్షణకై పోరాడండి

ప్రపంచ శాంతి పరిరక్షణకు సోవియట్ యూనియన్ చేసిన సహేతుకమైన ప్రతిపాదనలన్నింటినీ తిరస్కరించి, తమ యుద్ధ ప్రయత్నాలను తీవ్రతరం చేస్తున్న అమెరికన్ సామ్రాజ్యవాదుల చర్యను ఈ మహాసభ తీవ్రంగా ఖండిస్తున్నది.

ప్రపంచవ్యాప్తంగా శాంతికై సాగుతున్న పోరాటాన్ని, ప్రదర్శనలను ఈ మహాసభ హర్షిస్తోంది. ఇలాంటి ప్రదర్శనలు రీగన్ ప్రభుత్వాన్ని కలవరపరిచే రీతిలో అమెరికాలో సహితం సాగుతుండడాన్ని ఈ మహాసభ ప్రత్యేకంగా గమనిస్తున్నది.

లండన్, పారిస్, బాన్ నగరాలను రీగన్ సందర్శించినప్పుడు యుద్ధ వ్యతిరేక ప్రదర్శకులు పోలీసులతో ఘర్షణ పడికూడా రీగన్ యుద్ధోన్మాదానికి తమ నిరసన తెలియజేశారు. యూరప్ ప్రజలు యుద్ధాన్ని ఎంత తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారో తెలిపే చిహ్నమిది.

ఆంధ్రప్రదేశ్‌లో 1982 సెప్టెంబరులోను, అక్టోబరు 1న హైదరాబాద్, విశాఖపట్నం, విజయవాడ, కర్నూలు నగరాలలోను శాంతి ప్రదర్శనలలో పాల్గొన్న కార్మికులను ఈ మహాసభ అభినందిస్తున్నది.

మన పొరుగునున్న దేశాలలో మిలటరీ స్థావరాలను నిర్మిస్తూ, ఆయుధాల సప్లయిని పెంచుతూ, హిందూమహాసముద్రాన్ని సైనికమయం చేస్తూ మన దేశం వాకిట్లోకి యుద్ధప్రమాదాన్ని తెచ్చిపెట్టారు సామ్రాజ్యవాదులు.

అందువల్ల యుద్ధానికి వ్యతిరేకంగాను, శాంతికి అనుకూలంగాను సాగవలసిన పోరాట అవసరాన్ని మరింత తీవ్రంగా కార్మికవర్గ శ్రేణులలోకి, సాధారణ ప్రజా సామూహాలలోకి తీసుకువెళ్ళేందుకు నిరంతరం కృషిచేయవలసిందిగా ఈ మహాసభ కార్యకర్తలను కోరుతోంది.

## జూట్ పరిశ్రమపై

జూట్ పరిశ్రమలో, మన రాష్ట్రంలో వేజ్‌బోర్డు నిర్ణయించిన వేతనాల కాలం తీరిపోయినా యింతవరకూ కొత్త ఒప్పందం జరగనందుకు ఈ మహాసభ నిరసన తెలియజేస్తున్నది. రాష్ట్రమందలి జూట్ కార్మికసంఘాలన్నీ ఉమ్మడిగా తీవ్రాందోళన గావించిన ఫలితంగా ఆలస్యంగానైనా కొత్త వేజ్‌బోర్డు ఏర్పడింది. కాని యజమానులు అవలంభించే కుటిల నీతి ఫలితంగా వేజ్‌బోర్డు ఒక్క అంగుళం కూడా అడుగు వేయని పరిస్థితి ఏర్పడింది. లోగడవున్న కాంగ్రెస్ ప్రభుత్వం ఆ వేజ్‌బోర్డు కార్యక్రమాన్ని త్వరితం చేయటానికి ఎలాంటి ప్రయత్నమూ చేయక యజమానులకే సాయపడుతూ వచ్చింది చివరకు యజమానులు పనిభారాన్ని పెంచాలని మొండి పట్టుపట్టినందువల్ల సి.ఐ.టి.యు ప్రతినిధి లేచి రావాలసిన అవసరం కూడా కలిగింది.

కొత్త ఒప్పందం జరిగేవరకూ పాత ఒప్పందం వుంటుందన్న సుప్రీంకోర్టు తీర్పుకు వ్యతిరేకంగా చిట్టివలస మేనేజిమెంటు పాత ఒప్పందం షరతులను ఉల్లంఘించి ఫాల్ బాక్ వేజ్ ఇవ్వ నిరాకరించారు. ఆ విధంగా వేలమంది కార్మికుల జీతాలను తగ్గించింది. మార్చి 16 నుండి మొత్తం కార్మికులు సమ్మెలోనికి వెళ్ళే పరిస్థితులను కల్గించింది. మేనేజ్‌మెంటుయొక్క ఈ వైఖరిని ఈ మహాసభ తీవ్రంగా ఖండిస్తున్నది చిట్టివలస కార్మికుల సమ్మెకు పూర్తి మద్దతును ప్రకటిస్తూ వారి విజయాన్ని కాంక్షిస్తున్నది.

గుంటూరు భజరంగమిల్లు మేనేజిమెంటు మూసివేత నోటీసు యిచ్చి 4000 మంది కార్మికులను నిరుద్యోగానికి గురిచేయ చూస్తున్నది.

విపరీత లాభాలు సంపాదించే జూట్ పరిశ్రమాధిపతులు ఈ విధంగా జీతాలపైనా, పని పరిస్థితులపైనా దాడిచేయటాన్ని ఖండిస్తూ ఈ దాడిని ఎదుర్కొంటానికి మొత్తం జూట్‌కార్మికులంతా ఐక్యంగా సన్నద్ధం కావాలని ఈ మహాసభ కోరుతోంది.

రాష్ట్రప్రభుత్వం వెన్వెంటనే జోక్యం కలిగించుకొని, చిట్టివలసలో లోగడ ఒప్పందాన్ని అమలుజరిపించేటట్లు చూడాలనీ గుంటూరు భజరంగమిల్లు మూతపడకుండా చూడాలని. వేజ్‌బోర్డు 2నెలలలో పనిని పూర్తిచేయునట్లు చూడాలనీ ఈ మహాసభ కోరింది.

## టెక్స్‌టైల్ కార్మికుల సమస్యపై

మన రాష్ట్రంలో సుమారు40వేలమంది కార్మికులు జౌళిపరిశ్రమలోపని చేస్తున్నారు. మరికొన్ని ఫ్యాక్టరీలు రానున్నట్లు కూడా తెలియవస్తున్నది.

మన రాష్ట్ర కార్మికవర్గం ఇంచుమించు తమిళనాడుతో సమానంగా పనిభారం మోస్తున్నా, ఆ రాష్ట్రంతో పోలిస్తే వేతనాలు ఇతర సౌకర్యాలు మన రాష్ట్రంలో తక్కువగా వున్నాయి.

ఇతర రాష్ట్రాలలోలాగా కాకుండా ఈ పరిశ్రమ మన రాష్ట్రంలో చెల్లాచెదురుగా వుండడం మూలంగా పంపు చైతన్యంలోను, నిర్మాణంలోనుగల తేడాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. పరిశ్రమలోని యాంత్రీకరణ సహితం విభిన్నంగా వుంది.

దీనిని ఆధారంగా చేసుకొని యజమానులు కార్మికులపై విపరీతమైన పని భారాన్ని పెంచడమేగాక, వారికి రావలసిన ప్రతిఫలం సహితం అతి తక్కువగా యిస్తున్నారు బదిలీలు, క్యాజువల్ కార్మికుల పేరిట కార్మికుల హక్కులు కుదించబడుతున్నాయి.

పేరుకు కో-ఆపరేటివ్ రంగంలోనే వున్నా వాస్తవంలో ప్రభుత్వరంగంలోనే వున్న కో-ఆపరేటివ్ స్పిన్నింగ్ మిల్లులు ఆదర్శవంతంగా వుండడంలేదు-సరికదా అవి నిరంకుశ అధికారవర్గం చేతిలోపడి నష్టదాయకంగా తయారౌతున్నాయి.

గత వేజ్ కమిటీ సిఫార్సులద్వారా జీతాలలోని వ్యత్యాసాలను తగ్గించేందుకు ఒక ప్రయత్నం ప్రారంభించింది. కాని ఆ సిఫార్సులు అమలుజరిగిన తీరు సంతృప్తికరంగా లేదు.

ఈ సంవత్సరం ప్రారంభం నుండి కొత్త ఒప్పందాలు జరగవలసివున్నా అందుకు తగిన ఏర్పాట్లకు ప్రభుత్వం ఇంకా పూనుకోలేదు.

తమిళనాడు కార్మికులు పొందే జీతభత్యాలను, ఇతర సౌకర్యాలను సాధించేందుకు కార్మికులు పూనుకొని పోరాడాలని ఈ మహాసభ కోరుతున్నది.

# పొగాకు పరిశ్రమ

## ఐ. ఎల్. టి. డి. చర్యకు ఖండన

ఐ. ఎల్. టి. డి. ఒక గుత్తాధిపత్య సంస్థ. లాభాలవేటలో అనేక కార్మిక వ్యతిరేక చర్యలకు పూనుకుంటున్నది.

గత కొద్ది సంవత్సరాలుగా తనకు అవసరమైన పొగాకును బినామీ కంపెనీలచేత కొనుగోలు చేయించి క్రమేపీ ఐ. ఎల్ టి. డి. కార్మికులకు పనిదినాలు తగ్గించడం, ఒక్కొక్క డిపోనే మూసి వేయడం చేసింది.

అనపర్తి ఫ్యాక్టరీలో జి ఎల్ టి యంత్రం పెట్టి యాంత్రీకరణకు పూనుకున్నది. ఫలితంగా ఈ సంవత్సరం చీరాల ఫ్యాక్టరీని, పరుచూరు డిపోను మూసివేసింది. ఇందువల్ల, ఆరు వేల మంది కార్మికులు-అందులో అత్యధిక సంఖ్యాకులు మహిళలు వృత్తులు కోల్పోతున్నారు.

మరోవైపు రైతాంగానికి తగు ధర ఇచ్చి పొగాకు కొనడం లేదు.

జి.ఎల్.టి. యంత్రానికి అనుమతినిచ్చిన కేంద్ర ప్రభుత్వం ఇందుకు బాధ్యత వహించాలి.

తెలుగుదేశం ప్రభుత్వం- నేరుగానే ముఖ్యమంత్రి సహితం ఫ్యాక్టరీని, డిపోను తెరవవలసిందిగా సలహా యిచ్చినా కంపెనీ పెడచెవిన పెట్టింది.

ఐ. ఎల్. టి డి. కార్మికులు దశలవారీగా పోట్లాడుతున్నారు వారికి రాష్ట్రంలో కార్మికవర్గం సౌహార్ద్రత ప్రకటించింది. వారందరినీ ఈ మహాసభ అభినందిస్తుంది.

పొగాకు రైతుల, కార్మికుల ప్రయోజనాలను కాపాడేందుకు రాష్ట్ర ప్రభుత్వాన్ని సహితం ధిక్కరిస్తున్న ఈ కంపెనీని తక్షణమే జాతీయం చేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం తగుచర్యలు చేపట్టాలని ఈ మహాసభ డిమాండ్ చేస్తున్నది

## పొగాకు పరిశ్రమలో జి యల్. టి. యంత్రాల లైసెన్సులు రద్దుచేయాలి, కార్మికుల కనీస వేతనాలు అమలుపర్చాలి

## బినామీ కంపెనీలను నిషేధించాలి

మనదేశంలో పొగాకు ఉత్పత్తిలో అత్యధిక భాగం ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్నది. పొగాకు ఎగుమతులద్వారావిదేశమారకం రూపంలో 200 కోట్ల రూపాయలు, దేశంలో సిగరెట్ల ఉత్పత్తి ద్వారా ఎక్సైజు పన్నులవల్ల 800 కోట్ల రూపాయలు కేంద్ర ప్రభుత్వానికి ఆదాయం లభిస్తున్నది. కాని పొగాకు పరిశ్రమపై ఆధారపడ్డ 70 వేలమంది రైతాంగానికి గిట్టుబాటుధర లేకుండాను, యీ పరిశ్రమలో పనిచేస్తున్న లక్షన్నరమంది 'పొగాకు కార్మికులకు కనీస వేతనాలు యివ్వకుండాను పొగాకు కంపెనీల యజమానులు తమ దోపిడీ కొనసాగిస్తున్నారు. 2 లక్షలమంది కార్మికులు గూడా ఈ ఉత్పత్తిలో భాగస్వాములుగా వున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో 8 జిల్లాలలో 250 పొగాకు కంపెనీలలో పనిచేస్తున్న పొగాకు కార్మికులకు కనీస వేతనాలు అమలు జరగడం లేదు. 1982 లో రాష్ట్రప్రభుత్వం గ్రేడర్‌కు రు. 10-16 లు, జనరల్ వర్కర్‌కు రు. 11-35 లు నిర్ణయించింది. కాని అమలుకు ప్రభుత్వ చర్యలు కొరవడుతున్నాయి.

ఐ.ఎల్ టి డి లో కార్మికులు తమవుద్యమబలంతో కనీసవేతనాల కన్నా ఎక్కువ జీతాలు పొందుతున్నారు. కాని కార్మికులకు ఈ జీతాలు యిచ్చేకన్నా తక్కువజీతాలు యిచ్చే కంపెనీలద్వారా తన పని చేయించుకుంటూ ఐ.ఎల్.టి డిలోవున్న కార్మికులకు పనిదినాలు తగ్గించడమేగాక, కొన్ని డిపోలను మూసివేసి ఉద్యమంద్వారా హక్కులు సాధించుకున్న కార్మికులను నిరుద్యోగులను చేస్తున్నది.

అలాగే ఈ పరిశ్రమలో యాంత్రీకరణకు అనుమతిస్తూ ప్రభుత్వం సహితం యజమానుల ఆటలకు తోడౌతున్నది.

నేషనల్ కంపెనీ వేతనాలు తగ్గించ పూనుకుంటే కార్మికులు ప్రతిఘటించారు 1981లో బ్రాంచీలన్నింటినీ మూసివేయగా13 వేల మంది నిరుద్యోగులయ్యారు. ఈ కంపెనీ వ్యాపారం నుండి తొలగ లేదు సరికదా బినామీ కంపెనీలద్వారా నిరాఘాటంగా తన వ్యాపారం సాగించుకుంటున్నది.

1982 గోల్డెన్ కంపెనీ నాలుగు బ్రాంచీలను మూసివేసి 4 వేల మంది నిరుద్యోగులను చేసింది.

కార్మికోద్యమంపై పెద్దకంపెనీలుఈవిధంగా దాడిచేస్తున్నాయి.

చిన్న కంపెనీలలో కనీస వేతనాలు అమలు జరగడంలేదు. ప్రావిడెంట్ ఫండు లేదు. గ్రాట్యుటీ యివ్వరు. బోనస్ నిరాకరిస్తున్నారు. చట్టాలన్నీ ధిక్కరిస్తున్నారు. అందుకోసం కార్మికులు సంఘటితపడనిచోట తమ బ్రాంచీలు తెరుస్తున్నారు. కారుచౌకగా కార్మికుల శ్రమశక్తిని కొల్లగొడుతున్నారు. సంఘటితపడిన కార్మికులకు కష్టాలు కలిగిస్తున్నారు.

పొగాకు విదేశీ ఎగుమతి వ్యాపారాన్ని జాతీయం చేయాలని, ఐ.యల్.టి డి. గుత్తకంపెనీ స్వాధీనం చేసుకోవాలని, జి యల్.టి. యంత్రాల లైసెన్సులు రద్దు చేయాలని, బినామీ కంపెనీలను నిషేధించాలని, పొగాకు కార్మికులకు కనీస వేతనాలు అమలుకు పూనుకోవాలని, మూసివేసిన బ్రాంచీలను తెరవాలని, గ్రాట్యుటీ,ప్రావిడెంటు ఫండు, బోనస్ తదితర చట్టబద్ధ సౌకర్యాలు అమలు జరుగునట్లు చూడాలని యీ మహాసభ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను కోరుతూ తీర్మానించుచున్నది. వేతనాల పెంపు కొరకు, బ్రాంచీల మూసివేతలకు వ్యతిరేకంగా ఆందోళన చేస్తున్న పొగాకు కార్మికులను యీ సభ అభినందిస్తున్నది. ఈ విషయంలో తక్షణచర్యలు తీసుకోవాలని సి ఐ. టి. యు రాష్ట్ర మహాసభ డిమాండ్ చేస్తున్నది.

## ప్రభుత్వ జి. వో. లను ఆంధ్రప్రదేశ్‌లోని యూనివర్శిటీలకుకూడా అమలుపరచాలి

యూనివర్శిటీస్‌లో పనిచేయుచున్న ఉద్యోగులకు, కార్మికులకు, ప్రభుత్వోద్యోగులకు యిచ్చు జి వో లను అమలుపరచవలెనని ఈ సమావేశం కోరుతున్నది. దానితోపాటు 1974లో ప్రభుత్వోద్యోగులకు పై స్కేలు యింక్రిమెంట్స్ యివ్వగా యూనివర్శిటీస్‌లో పనిచేయు లాస్ట్ గ్రేడ్ కార్మికులకు పై స్కేలు ఇంక్రిమెంటు కోసం సిండికేటు రికమండేషను చేసి ప్రభుత్వానికి పంపినది దానిని అమలు పరచాలని కోరుతున్నాము.

# కనీస వేతనాల సమస్య

సంఘ నిర్మాణం సాధ్యంగాని అసంఖ్యాక కార్మిక వర్గానికి కనీస వేతనం ప్రతి కార్మికుడికి అందాలని, 1945 వ సంగలో అంతర్జాతీయ కార్మిక సంఘం తీర్మానించింది. ప్రపంచ మండలి ఏ దేశములోని కార్మికులైన ఆయా దేశ, రాష్ట్రాల ప్రభుత్వాలు షెడ్యూల్ పరిశ్రమలలో కనీస వేతనం కాలమాన పరిస్థితులకు అనుగుణంగా యివ్వాలని కోరింది.

భారతదేశం స్వాతంత్ర్యం పొందినప్పట్నుంచి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎప్పటికప్పుడు కార్మికుల ఉద్యమాలు,ఆందోళనల వలన అనేక మార్పులు, చేర్పులు చేసి, కనీస వేతనాలు ప్రకటిస్తున్నాయి.

ప్రస్తుతం అనేక కనీస వేతనరంగ పరిశ్రమలలో కనీస వేతనాలు నిర్ణయించినంత మేరకైనా అమలుపర్చే యంత్రాంగం లోపభూయిష్టంగా వున్నది. దీనిని ఆసరాగా తీసుకొని యాజమాన్యం కనీస వేతనాలు అమలు జరపడం లేదు.

ఈ పరిశ్రమలలో ప్రతి రెండు సంవత్సరాల కొక పర్యాయము జీతాల సవరణ జరగటం లేదు. పైగా సవరణ చేసిన పెంపుదలైన జీతాలు జీవన వ్యయ సూచికలకు అనుగుణ్యంగా వుండటం లేదు. కనీసం వాటినైనా అమలు పర్చే కనీస బాధ్యతను తీసుకునేందుకు ప్రభుత్వం నిరాకరిస్తున్నది

ఈ మధ్యనే కేంద్ర కార్మిక సంఘాలైన సి. ఐ. టి. యు., ఏ ఐ టి.యు సి , హెచ్ ఎం ఎస్., ఐ ఎన్.టి.యు సి , బి యం.ఎస్ మరియు పలు స్వతంత్ర వృత్తి సంఘాల అధ్వర్యాన దక్షిణమండల సదస్సు 1979-80 సంవత్సరములలో నిర్వహించి, కనీసవేతనం ప్రతి కార్మికుడికి 500 రూపాయలు నెలసరి జీతంగా (30 రోజులకు విస్తరింపచేస్తూ) పెరుగుతున్న జీవనవ్యయ ధరలసూచికకనుగుణ్యంగా కరువుభత్యం వర్తింపచేయాలని, కోరారు. అలాగే అమలుపర్చే యంత్రాంగాన్ని పటిష్ఠం చేయాలనికూడా తీర్మానించారు. వాటి అమలుకై ఆందోళన, ఉద్యమాలు నిర్వహించాలని పిలుపుకూడా యిచ్చింది.

ఈ సందర్భంలోనే 1982 డిసెంబరులో కేంద్ర కార్మిక సంస్థ ప్రతినిధులు ఢిల్లీలో సమావేశమై కనీసవేతనం రు. 600 వుండాలని దానికై దేశవ్యాపిత ఆందోళన చేయాలని తీర్మానించింది. తదనుగుణ్యంగా 1983 జనవరి 5న కనీసవేతన అమలుదినంగా దేశవ్యాపితంగా ఆందోళన జరిగింది.

ఉద్యమం వున్నచోట్ల, రాజకీయంగా ట్రేడ్ యూనియన్ చైతన్యం పొందినచోట్ల కార్మికులు సంఘటిత శక్తితో ప్రస్తుతం వున్నవాటిని అమలుజరుపుకోవటం, లేనివాటికై ఆందోళనచేయటం జరుగుతున్నది. అలా ఆందోళన చేసినచోట్ల ప్రకటిత కనీసవేతన చట్టం పరిధిలోని పరిశ్రమలలో నిర్ణయించిన జీతాలకన్నా అదనంగా సంపాదించుకొనటం జరుగుచున్నది. ఈరకంగా సంఘటితపడి ఆందోళన చేయని పరిశ్రమలలో కనీస వేతనాలను కూడా యివ్వ నిరాకరించుతూ, వెట్టిచాకిరి చేయించుకొనటంవల్ల కార్మికులు నికృష్టజీవితం గడుపుతున్నారు.

ఇట్టి తరుణంలో ఈ మహాసభ ఈ క్రింది కోర్కెలను ప్రభుత్వం దృష్టికి తీసుకొచ్చి, అమలుపర్చటానికి కృషిచేయాలని కోరుచున్నది.

1) కనీస వేతనం పరిగణనలోని 34 షెడ్యూలు పరిశ్రమలలో ప్రతి కార్మికుడికి నెలకు రు. 500/- తగ్గకుండా (అన్నిరంగాలలోను) పెరుగుతున్న జీవనవ్యయ సూచి నాధారంగా కరువు భత్యంతోసహా జీతాలు యివ్వాలి. అలా అమలుజరుపని యాజమాన్యంపై చట్టరీత్యా శిక్షకు తగిన చర్యలు తీసుకోవాలి.

2) వీటన్నింటిని అమలుపర్చే యంత్రాంగాన్ని పటిష్ఠం చేయాలి

3) షాప్ ఆక్ట్, ఫాక్టరీ ఆక్ట్‌లలో వున్న అన్ని సౌకర్యాలు అమలుజరిగేటట్లు మరియు ఉద్యోగభద్రత కాపాడేందుకు ప్రభుత్వం గట్టి చర్య తీసుకోవాలి.

## కన్‌స్ట్రక్షన్ కార్మికుల సమస్యలపై తీర్మానం

ఆంధ్రరాష్ట్రంలోని నిర్మాణ కార్మికులు సంఘటితంగాలేరు. మన రాష్ట్రంలో దాదాపు 7 లక్షలు కార్మికులు పని చేస్తున్నారని అంచనా. వీరు కాంట్రాక్టర్లు, మేస్త్రీలు, ప్రభుత్వ సంస్థలైన హెచ్. ఎస్.సి.ఎల్ , ఎన్ పి సి.సి., ఎ పి ఎస్ సి.సి. లాంటి సంస్థల్లో పని చేస్తున్నారు.

కాంట్రాక్టర్లు, మేస్త్రీలక్రింద పనిచేసే కార్మికులకు సిమెంటు కొరత ప్రధాన సమస్య. సిమెంటు కొరత కారణంగా నిర్మాణం పనులు పూర్తిగా కుంటుపడ్డాయి. పర్యవసానంగా కార్మికులు నిరుద్యోగం లోనికి నెట్టబడుతున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో నిర్మాణంలో పాల్గొనే కార్మికులకు నెలలో 15 రోజులుకూడా పని దొరకటంలేదు. వేతనాల పరిస్థితి చెప్పుకొనే పనేలేదు అందువల్ల సిమెంటు కృత్రిమ కొరతను నిరోధించి ప్రభుత్వం నిర్ణయించిన రేటుకు సిమెంటు అన్ని చోట్ల దొరికేటట్లు చూడాలి ఇన్సూరెన్సు, ప్రావిడెంట్ ఫండు, వైద్య సౌకర్యాలు మిగిలిన కార్మికులలాగే ఈ కార్మికులకుకూడా వర్తింపజేయాలి.

కాంట్రాక్టు లేబరు (రెగ్యులేషన్ అండ్ ఎబాలిషన్)చట్టంలో కనీస వేతనాలు చట్టరీత్యా నిర్ణయింపబడనిచోట మాత్రమే ఈచట్టం వర్తిస్తుంది. అదినష్టకరం. కనుక ఆ పదాన్ని తొలగించడం ద్వారా వివిధ కాంట్రాక్టర్లవద్ద పని చేసే కార్మికులందరికీ ఆచట్టంలో ఉన్న కనీస వేతనాలు వర్తింప జేయాలి. నిర్మాణ కార్మికులకు కనీస వేతనాలు నెలకు రూ 650/-తగ్గకుండా ఇవ్వాలి, పెరిగే ధరలకు అనుగుణంగా డి. ఏ. చెల్లించాలి.

ప్రభుత్వ నిర్మాణ సంస్థలైన హెచ్. ఎస్ సి ఎల్, ఎన్. పి సి. సి , ఎన్. బి. సి. సి. తదితర కంపెనీలలో పని వున్నప్పటికీ, రిట్రెంచ్‌మెంటు చేసే దుర్మార్గపు పద్ధతి అరికట్టి, హైదరాబాద్ హెచ్.ఎస్.సి.ఎల్, ధవళేశ్వరం ఎన్. పి. సి. సి. కార్మికులను విశాఖ స్టీల్ ప్రాజెక్టుకు బదిలీ చేయాలని ఈ మహాసభ డిమాండ్ చేస్తున్నది. హైదరాబాద్ హెచ్. ఎస్. సి ఎల్. లో రిట్రెంచ్‌మెంట్ చేయబడినవారిని తిరిగిపనిలోచేర్చుకోవాలి. నిర్మాణ కార్మికులకు కూడ మిగిలిన ప్రభుత్వరంగ సంస్థలలో ఇచ్చే జీతాలు, సౌకర్యాలు ఇవ్వాలని ఈ మహాసభ డిమాండ్ చేస్తున్నది.

# రైల్వే రంగం

భారత రైల్వేల మంత్రిత్వ శాఖ ప్రవేశపెట్టిన బడ్జెట్, తదుపరి పార్లమెంటులో ఇచ్చిన వివరణలోగాని రైల్వేలు ఎంత దయనీయమైన పరిస్థితులలో వున్నవో మనకు అర్థమౌతుంది. నూటికి 20 శాతం రైల్వే లైను, 40 లక్షల వ్యాగనలో 30 శాతం అంటే 32,168 వ్యాగన్లు, 5635 ఇంజన్లు వయసు మీరిపోయినవి. ఇట్టి పరిస్థితులలో రైల్వేలను నడుపుతూ 265 లక్షల టన్నుల గూడ్సు రవాణాను చేరవేయాలని గరిష్ట పరిమితిని రైల్వే మంత్రిత్వ శాఖ సూచించింది. అంతే కాకుండా రైళ్ళ వేగాన్ని 110 కి. మీ.కు హెచ్చించి రైళ్ళ ప్రయాణాన్ని ప్రమాద భూయిష్టం చేసింది. ప్రయాణ పెట్టెల కప్పులపైన ప్రయాణం చేయడం, స్టేషన్లలో కాయగూరలు, చేపలు, పండ్లు వగయిరా రోజుల కొలదీ రవాణాకు వసతి లేకుండా మురిగిపోతుండటం, 80 యూనిట్ల బాక్సు వ్యాగన్ లతో లోతు రవాణా సాగించడంవలన ఒకటిరెండు వ్యాగన్ల సరుకుతో వ్యాపారం సాగించుకొంటున్న చిన్న చిన్న వర్తకులకు సకాలంలో వ్యాగన్లు సప్లయి చేయడంలేదు. బడ్జెట్‌లో ప్రయాణపు చార్జీలు, గూడ్సు,పార్సెలు రవాణాచార్జీలు అదనంగా తొమ్మిదివందల కోట్ల రూపాయలు రైల్వే వినిమయ దారులవద్ద రాబట్టడం అదే సమయంలో పెద్ద పెద్ద పరిశ్రమాధిపతులకు రాయితీలు కల్పించి, సాధారణ రైల్వే వినిమయదారులకు అపారమైన నష్టాన్ని అసౌకర్యాన్ని కలిగిస్తుండడమే గాకుండా రైల్వే కార్మికులకు 1974 నుండి ఒక దశాబ్దం జరిగినా వారి ఈ క్రింది సమస్యలను నేటికికూడా నివారించకపోవడంద్వారా వారిలో అపారమయిన అసంతృప్తిని రేకెత్తిస్తుంది.

1. రైల్వే కార్మికులకు తాత్కాలిక సహాయం రూ. 150 తక్షణం చెల్లించాలి.

2. మూడు వేతనసంఘాలు వచ్చినాకూడా రైల్వే కార్మికులకు (వేయిమంది క్యాటగిరీలకు) సరిగా వేతన నిర్ణయం జరగలేదు మరలా ప్రభుత్వం ఆదేశించిన నాల్గవ పే కమిషన్ కనీసం మూడు సంవత్సరాలైనా తన సిఫారసులను ఇవ్వడానికి జరుపుతుంది. వాటిని అమలుపరచడానికి మరి మూడు సంవత్సరాలు రైల్వే అధికార వర్గం తీసుకోవచ్చు. అయినాకూడా ఈ వేయిమంది కేటగిరి గల రైల్వే కార్మికులకు వారి వృత్తి నైపుణ్యం రీత్యా వేతన నిర్ణయం జరగటానికి అవకాశం లేదు. కాబట్టి రైల్వే అధికార వర్గం సంఘటిత పడిన రైల్వే కార్మికులతో ముఖాముఖి చర్చలు జరిపి వేతన నిర్ణయం జరపాలి.

3. కక్షసాధింపు చర్యలుగా రైల్వే కార్మికుల బదరఫ్ వగైరాలను రద్దుచేయాలి. 1981 జనవరిలో జరిగిన లోకో రన్నింగ్ స్టాఫ్ సమ్మె మూలంగా బదరఫ్ కాబడిన-క్రింది గ్రేడ్‌లకు తగ్గించబడిన-నిర్బంధముగా రిటైరు చేయబడిన, కార్మికుల కేసులను రద్దుచేయాలి. రాయనపాడు వర్కు-షాపులో లాకవుట్‌మూలంగా ఉద్యోగము నుండి తీసివేయబడిన 7 మంది కార్మికులను తక్షణం డ్యూటీలోకి తీసుకోవాలి. లాకవుట్‌మూలంగా సర్వీసు కోతకు గురైన మూడువేలమంది వ్యాగన్ వర్కు-షాపు కార్మికులకు సర్వీసు కోతను రద్దుచేయాలి.

4. రైల్వేలలో సకాలంగా ట్రాక్‌ను పటిష్టం చేయకపోవడం, వయస్సు మళ్ళిన వ్యాగన్లు ఇంజన్లు తదితర యంత్రసామాగ్రి ఉపయోగించడంవలన పనిభారం హెచ్చయింది. అంతేగాకుండా-సంవత్సర సంవత్సరానికి రవాణా లక్ష్యాలు హెచ్చించడ- మూలంగా పనిభారం హెచ్చయింది అట్టి పనిభారాన్ని సరైన కార్మికులను ఉద్యోగాలలో పెట్టుకోకుండా ఉన్న కార్మికులపై పనిభారాన్ని హెచ్చించడం లేక సంవత్సరాల తరబడి క్యాజువల్ లేబర్‌తో రైల్వే అధికారవర్గం పబ్బం గడుపుకొనుచున్నది అలా గాకుండా పెరిగిన పనిభారం మేరకు కార్మికులను అంచనాకట్టి అదనంగా వచ్చిన ఖాళీలలో దినసరి కూలీలను ఖాయపరచాలి.

5. 1968 నుంచి మూడవ తరగతి కార్మికుల రిక్రూట్‌మెంటుపై ప్రభుత్వం ఆంక్ష విధించింది ఈరోజున రైల్వే ఆఫీసులలోగాని తదితర డిపార్టుమెంటులోని గుమాస్తాలు వగైరా తరగతుల పైన పనిభారం మూడు నాలుగురెట్లు పెరిగింది. దానివలన గుమాస్తాలు చేసే విధులలో చాలా జాప్యం జరుగుతుంది. దానివలన రైల్వే కార్మికులకు చెందవలసిన సదుపాయాలు (బకాయిలు వగైరా), సకాలములో చేరడంలేదు. అంతేగాకుండా సూపర్‌వైజర్లు ఆఫీసర్లు, హెచ్చించడానికిగాను పునాది గ్రేడ్‌లలోని కార్మికులను (మ్యాచింగ్ సరండర్) కోత పెట్టవలసివస్తుంది. ఇట్టి దారుణమైన చర్యలు గర్హించవలసియుంది.

6. రైల్వేలో ఇంజనీరింగ్ డిపార్టుమెంటులో పనిచేస్తున్న క్యాజువల్‌లేబరుకు, ప్రాజెక్టులో పనిచేస్తున్నవారికి, నాన్‌ప్రాజెక్టులో పనిచేస్తున్నవారికి వ్యత్యాసముంది. ఇద్దరూ ఒకేరకమైన పని చేస్తూయున్నందున వారికిచ్చే సదుపాయములు సమానంగా వుండాలి.

## రైల్వేలో కాంట్రాక్టు పద్ధతి రద్దుచేయాలి

పార్లమెంటు 1970 సంవత్సరములో కంట్రాక్టు కార్మికుల పనివిషయములో కొన్ని క్రమపద్ధతులను ప్రవేశపెడుతూ, పరిశ్రమలలో కంట్రాక్టు పద్ధతిని రద్దుపర్చుటకు చట్టాన్ని చేసింది.

ఈ చట్టము అమలులోకి రాకపూర్వము జాతీయ పరిశ్రమ అయిన రైల్వేలో కంట్రాక్టు పద్ధతి చాలా అరుదుగా ఉండేది. కాని ఈ చట్టము అమలులోకి వచ్చిన తరువాత రైల్వేలో కంట్రాక్టు లేబరు పద్ధతి విపరీతంగా పెంచబడినది. రైల్వేలో భద్రతకు వ్యతిరేకంగానే ఈ కంట్రాక్టు పద్ధతిని అన్ని డిపార్టుమెంటుల్లో ప్రవేశపెట్టి ప్రయాణికుల భద్రతకు హానికల్గించే విధముగా అమలుజరుగుచున్నది. ఈ పరిశ్రమలో ఉద్యోగ అవకాశాలు కుదించే విధముగా ఆఫీసర్లకు లాభాలు వచ్చేవిధముగా కంట్రాక్టు పద్ధతిని రైల్వేలో ప్రవేశపెట్టే విధానాన్ని ఈ మహాసభ తీవ్రముగా ఖండించుచున్నది. ఈ పద్ధతిని రైల్వేలో తక్షణం రద్దుచేయాలని ఈ మహాసభ కోరుచున్నది.

## లోకో రన్నింగ్‌స్టాఫ్‌తో జరిపిన అగ్రిమెంటును అమలుపర్చాలి

1973 సంవత్సరములో లోకో రన్నింగ్‌స్టాఫ్ అసోసియేషన్‌తో పనిగంటల సమస్యపై 10 గంటల పనిని అమలుపర్చుటకు ఒప్పందం జరిగింది. ఆ ఒప్పందం ప్రకారం 10 గంటల పనిని లోకో రన్నింగ్‌స్టాఫ్‌కు అమలుచేయుటకు నిరాకరించుతూ

# రైల్వే కార్మికుల సమస్యపై

1981లో లోకో రన్నింగ్‌స్టాఫ్ కార్మికుల యెడల కక్షసాధింపు చర్యలు సాగించింది. ఈ సంవత్సరము రైల్వే బడ్జెటు సమావేశంలో లోకో రన్నింగ్‌స్టాఫ్‌తో జరిపిన ఒప్పందాన్ని ఉల్లంఘించామని రైల్వేమంత్రి అంగీకరించటం జరిగింది. కనుక యిప్పటికైనా ఆ అగ్రిమెంటును అమలుజరపాలని ఆ అసోసియేషన్‌తో సంప్రదింపులు పునరుద్ధరించి సత్సంబంధాలు నెలకొల్పాలని, సమ్మె తదనంతరం తీసుకొన్న అన్నిరకాల కక్షసాధింపు చర్యలనూ రద్దు చేయాలనీ ఈ మహాసభ కోరుచున్నది.

ఇలా భారతదేశపు రైల్వే మంత్రిత్వ శాఖ అటు రైల్వేలకు కోటానుకోట్లు ధనాన్ని యిస్తున్న రైల్వే వినియమదారులకు కనీస సౌకర్యాలుకూడా కలిగించకుండా యిటు రైల్వేలను దుర్భరమైన పరిస్థితులలో నిర్వహిస్తున్న 16 లక్షలమంది రైల్వే కార్మికులకు మొండి చేయి చూపి తనవంతు బాధ్యతలని అటు రవాణాదారుడుగా, ఇటు పారిశ్రామిక యజమానిగా నిర్వహించడం లేదు. కావున సి. ఐ. టి. యు. సమావేశం అటు రైల్వే వినియమదారులను, యిటు కార్మికులను తమ సమస్యల పరిష్కారానికై సంఘటితపడి ఒక బలీయమయిన ఉద్యమం ద్వారా తమకు రావలసిన సదుపాయాలను రాబట్టుకోవలసిందిగా కోరుతోంది. అట్టి ఆందోళనా కార్యక్రమంలో తన వంతు సహకార, సానుభూతుల్ని అందించడానికి తయారుగా వుంది.

## ఆంధ్రప్రదేశ్‌లో రైల్వే ప్రాజెక్టులకు నిధులు

గత 35 సంవత్సరాల నుండి దేశంలో రైల్వేలు ఎంతో అభివృద్ధి చెందినవి. ఎన్నో క్రొత్త రైలుమార్గములు వేసారు. కాని దురదృష్టవశాత్తు ఆంధ్రరాష్ట్రములో 30 ఏండ్ల తరువాత ఒకే ఒక రైలు మార్గం బీబీనగర్_నడికుడి మంజూరు చేసారు. కాని అదికూడా నలగొండవరకు పూర్తిచేశారు. మిగతా సగము నిధులు లేవని నిలుపు చేశారు.

దేశంలో రైల్వే వ్యాగన్ల కొరత హెచ్చుగా ఉన్నప్పటికి మన రాష్ట్రములో రాయనపాడు వ్యాగను రిపేరు వర్కుషాపును అభివృద్ధి పరచి ఈ కొరతను కొంతవరకైనా నివారించుటకుబదులు ఆ ప్రాజెక్టు అభివృద్ధిపరచుటకు ఎటువంటి కార్యక్రమముగాని, నిధులుగాని ఇవ్వడములేదు.

విజయవాడ - బలార్షా రైల్వే లైను విద్యుదీకరణకై 1982 పార్లమెంటు సమావేశాలలో ఆమోదించారు. అయినప్పటికీ యింతవరకు ఆ ప్రాజెక్టుకు కావలసిన నిధులు మంజూరు చేయలేదు. తత్ఫలితంగా ఈ ప్రాజెక్టు నత్తనడక నడుస్తున్నది. అదే విధంగా గూడూరు_తిరుపతి రైల్వే లైను విద్యుదీకరణ కార్యక్రమంకూడా తగిన నిధులు లేక కుంటుబడినది.

దేశంలో కాలం చెల్లిన ప్రయాణీకుల రైలు పెట్టెలు ఆరు వేలు వున్నవి. వాటిస్థానే నూతన రైలుపెట్టెలు తయారుచేయవలసిన అవశ్యకత ఎంతో ఉన్నప్పటికీ ఈ రాష్ట్రంలో నిర్మించదలచిన తిరుపతి కోచ్ ఫ్యాక్టరీని ఇంతవరకు ప్రారంభించలేదు. ఒక వైపున కాలం తీరిన రైలు పెట్టెలను ఉపయోగించి, వేగాన్ని హెచ్చించి ప్రయాణీకులకు భద్రత లేకుండా ప్రమాదాలకుగురిచేస్తూ మరోవైపు అవసరమున్న రైలు పెట్టెల ఉత్పత్తిని ప్రారంభించక కాలాయాపన చేస్తున్నారు. ఇదే విధంగా బోనకల్లు - జగ్గయ్యపేట, కారేపల్లి - మాదారం, భద్రాచలం - మణుగూరు ప్రాజెక్టులుకూడా నిధులు లేవనే నెపంతో నత్తనడక నడుస్తున్నవి.

పై ప్రాజెక్టులు రైల్వే నిర్వహణకు చాలా అవసరమైనప్పటికీ కేంద్ర ప్రభుత్వం పక్షపాత వైఖరితో జాతీయ పరిశ్రమ అనబడే రైల్వే పరిశ్రమ కుంటుబడుతుంది. ఇందుకు కేంద్రప్రభుత్వ వైఖరిని నిరసిస్తూ తక్షణం ఈ ప్రాజెక్టులకు కావలసిన నిధులను ఇచ్చి, ప్రాజెక్టులను పూర్తిచేయవలసినదిగా ఈ మహాసభ కోరుచున్నది.

## జట్టు, ముఠా, హమాలీ యాక్టు సవరించాలి

ఆంధ్రప్రదేశ్‌లో షుమారు 3 లక్షలమంది ఎగుమతి,దిగుమతి రవాణాలలో ముఠా కార్మికులుగా పనిచేస్తున్నారు. ఈ కార్మికులకు లోగడ ఏ రకమైన చట్టం వర్తించేదిగాదు. వీరి సుదీర్ఘ ఆందోళనా పోరాటాలనంతరం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976లో జట్టు, ముఠా, హమాలీ యాక్టును తీసుకొచ్చింది ఈ యాక్టులోని కొన్ని అంశాలు ప్రస్తుతం కార్మికులు పొందుతున్న కొన్ని హక్కులను హరింపజేసేవిగా వున్నాయని ఆనాటినుండి కార్మికవర్గం ఆందోళన వెలిబుచ్చుతున్నది. ముఖ్యంగా ఈ యాక్టు ప్రకారం పనిచేసే కార్మికులకు తమ యజమానులనుండి నేరుగా వేతనాలు పొందే అవకాశముండదు. బోర్డుద్వారా పొందవలసివుంటుంది. అయితే బోర్డు యింతవరకు నిర్దిష్టంగా వేతనం యింతని ప్రకటించియుండలేదు. అందుకని ఈ యాక్టులోని యిలాంటి అంశాలను సవరించి అమలుపర్చవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాం. అలాగే ఈ అంశాలపై తగిన సూచనలు తీసుకొనేందుకు రాష్ట్రంలోని జట్టు, ముఠా, హమాలీలకు చెందిన వివిధ యూనియన్ల నాయకులతో జాయింట్ సమావేశం ఏర్పాటుచేయవలసిందిగా ఈ మహాసభ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నది.

## రాష్ట్ర ప్రభుత్వ ప్రెస్‌కార్మికుల రిటైర్‌మెంట్ వయస్సు 60 సంవత్సరాలకు పునరుద్ధరించుట

రాష్ట్ర ప్రభుత్వ ప్రెస్‌లలో పనిచేయు కార్మికులకు రిటైర్‌మెంటు వయస్సు మొదటినుండి 60 సంవత్సరాలు వున్నది. దానిని తెలుగుదేశం ప్రభుత్వం ఆకస్మాత్తుగా 1983 ఫిబ్రవరి 28న కార్మికులకు ఏమాత్రం ముందుగా తెలపకుండా మార్చి 1 నుండి రిటైర్ చేస్తున్నట్లు (అనగా కార్మికుల రిటైర్‌మెంటు వయస్సు 60ని తగ్గిస్తూ 55 సం॥రాలు పూర్తయిన వారందరిని) ఆర్డర్సు ఇవ్వడం జరిగినది.

కార్మికులకు వున్న హక్కును ఏకపక్షముగా ప్రభుత్వం వారు రద్దుచేయుట సరైన విధానముకాదు. గాన ప్రభుత్వ ప్రెస్‌లలో పనిచేయు కార్మికులకు రిటైర్‌మెంటు వయస్సు 60 సం॥కు పునరుద్ధరించవలెనని ఈ మహాసభ కోరుతున్నది.

# ఎఫ్. ఆర్. 2 అమెండ్‌మెంటు ఉపసంహరించాలి

## ఎఫ్. ఆర్. 2 అమెండ్‌మెంటు ప్రభుత్వ ఉద్యోగుల హక్కులపైన దాడి

ప్రభుత్వ ఉద్యోగులకున్న ఎఫ్ ఆర్.2 ను అమెండ్ చేశారు. ఎఫ్ ఆర్. 2 ప్రకారం ప్రభుత్వ ఉద్యోగులకు వున్న ఏ హక్కును గాని తీసివేయరాదు. ఆ హక్కును ఉద్యోగులు అనేక పోరాటాల ద్వారా సాధించుకొన్నారు. దానిని ప్రభుత్వము ఏకపక్షముగా తీసి వేయుట అంటే ఇప్పటివరకు ప్రభుత్వఉద్యోగులకుగల ఏ హక్కునైనా తీసివేయుటకు వీలు కలుగుతుంది. ఈ చర్యను ఈ మహాసభ ఖండించుతూ ఎఫ్.ఆర్.2 అమెండ్‌మెంటును ప్రభుత్వము ఉపసంహరించుకోవాలి అని ఈ మహాసభ కోరుతున్నది.

## రాష్ట్రప్రభుత్వ ప్రెస్‌ల అభివృద్ధి- జోనల్‌ప్రెస్‌లను పెట్టవలసిన అవసరముపైన తీ ర్మా న ము

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ప్రభుత్వ ప్రెస్‌లలో వుండవలసిన నిష్పత్తిలో కార్మికులుగాని, ప్రెస్‌లుగాని లేవు. మద్రాసు రాష్ట్రముతో పోల్చుకున్నా మన రాష్ట్రములో కనీసము 10 వేలమంది ప్రెస్‌కార్మికులు ప్రభుత్వ ఆధ్వర్యంలోని ప్రెస్‌లలో అవసరము. ఇప్పుడు మన రాష్ట్రప్రభుత్వ ప్రెస్‌లలో హైదరాబాదు, కర్నూలులలో 2వేల 5వందలమంది కార్మికులుమాత్రమే పనిచేయుచున్నారు. ప్రింటింగ్ యంత్రములు మన దేశములోనే ప్రస్తుతము తయారగుచున్నవి విదేశీ మారకద్రవ్యము అవసరములేదు. అందువలన రాష్ట్రములో జోనల్‌ప్రెస్‌లు పెట్టాలని లోగడ రాష్ట్రప్రభుత్వము నిర్ణయించడం జరిగినది.

తిరుపతి, విజయవాడ, విశాఖపట్టణం, వరంగల్లు, నిజామాబాదులలో జోనల్ ప్రెస్‌లను పెట్టాలి అని, విజయవాడ ప్రెస్ బిల్డింగులో కొన్ని యంత్రములు వచ్చి తయారుగా వున్ననూ ఇంతవరకు ప్రెస్‌ను ప్రారంభించకపోవుట ప్రభుత్వము అలస్యము చేయుట సరైనది కాదని, అతితొందరలో ఆ ప్రెస్‌ను ప్రారంభించాలని ఈసభలో తీర్మానించడమైనది.

## ప్రభుత్వ ఉద్యోగులపై తీర్మానము

జె. సి. ఏ. యు. నాయకత్వాన 1982 డిసెంబరు 15 నుండి 25 వరకు రాష్ట్రవ్యాపితంగా 6½ లక్షల ప్రభుత్వ ఉద్యోగులు, కార్మికులు 11 రోజులు సమ్మెచేశారు. ఆ సందర్భంలో ప్రభుత్వం జె. సి. ఏ. యు. పెట్టిన 19 కోర్కెలను ఒప్పుకొన్నది. ఆ ఒప్పందం ప్రకారం ఉద్యోగులు సమ్మెను విరమించారు. తెలుగుదేశ ప్రభుత్వం ఆ ఒప్పందం ప్రకారం కుదిరిన కోర్కెలను అమలు జరపగలనని ముఖ్యమంత్రిగారు హామి ఇచ్చినారు. కానీ ఇంతవరకు అమలుజరపలేదు. జె. సి. ఏ. యు తో కుదుర్చుకొన్న ఒప్పందాలను అమలుజరపాలి అని ఈ మహాసభలో తీర్మానించడమైనది.

## రాష్ట్ర వర్క్‌చార్జ్‌డ్ మరియు మెయింటెనెన్స్ స్టాఫ్ లిస్ట్‌పై తీర్మానాలు

రాష్ట్రప్రభుత్వం గత 3సంవత్సరాలలో కొన్ని ఆర్డర్లు వర్క్‌చార్జ్‌డ్ కార్మికుల సమస్యలపై విడుదల చేసింది. అందులో ముఖ్యంగా జి.ఓ. ఎం. ఎస్. నెం. 212 మరియు జి. ఓ. ఎం. ఎస్. నెం. 130ద్వారా పెన్షన్ మంజూరు చేసింది. అయితే ప్రస్తుతం సంవత్సరాల తరబడి ఎన్.ఎమ్.ఆర్.లుగా పనిచేస్తున్న కార్మికులను పర్మనెంటు చేయకపోగా, ప్రస్తుతము వేకెన్సీలు భర్తీ చేయకూడదని ఆంక్షలు విధించడంవల్ల వేల సంఖ్యలో సంవత్సరాల తరబడి పనిచేయు ఎన్ ఎమ్ ఆర్. కార్మికులకు అన్యాయం జరుగుతూంది. ఇంతవరకు వారి సర్వీసులు క్రమబద్ధం చేయలేదు. రెండవ వైపు పెన్షన్ జి. ఓ.పైన ఏ. జి.కి గాని లోకల్ ఫండు వారికిగాని స్పష్టమైన సమాచారం పంపనందువల్ల దాదాపు 200 మంది చనిపోయిన వారుగాని, రిటైరయిన కార్మికులకుగాని లిబరలైజ్డు పెన్షన్ శాంక్షన్ చేయకపోవటం అక్రమం. అదే విధంగా ఖాళీ స్థానాలను భర్తీచేయక ఆంక్షలు విధించటంవల్ల ఆర్ అండ్ బి.లో 500 గ్యాంగుమెన్ పోస్టులు ఖాళీలువున్నా భర్తీ చేయటము లేదు. దానిస్థానే కాంట్రాక్టు పద్ధతిని పనులు చేయించటము జరుగుతుంది. పి.డబ్ల్యు.డి. ఇరిగేషన్ డిపార్టుమెంటులో 3సం॥ నుండి 8 సం॥ వరకు పనిచేయు ఎన్.ఎమ్. ఆర్. కార్మికులను రెగ్యులరైజ్ చేయకుండా తక్కువ వేతనాలు యిచ్చి కట్టుబానిసలులాగున పని చేయించుకోవటం జరుగుతున్నది. ఇంతవరకు డ్రయివర్ల పే స్కేల్సులో వ్యత్యాసాలు పవరించక పంచాయతీరాజ్ డిపార్టుమెంటుతో సమానంగా పెంచకపోవటం, అదే విధంగా వర్క్ ఇన్స్‌పెక్టర్ల పే స్కేల్సు 410/- 1976 నుండి ఇవ్వవలసివుండగా 1980నుండి యివ్వటం చేస్తూ ప్రభుత్వం ద్వంద్వ విధానం అవలంబిచడం అన్యాయం. ఇట్టి విధానాన్ని సి.ఐ టి.యు. మహాసభ నిరసిస్తున్నది. ఈ క్రింది కోర్కెలు అంగీకరించాలని డిమాండు చేస్తున్నాము.

1. ఉద్యోగ నియామకాలపై గల ఆంక్షలను తొలగించాలి. "సర్ప్లస్ పూల్" ప్రమేయం లేకుండా ఆర్. అండ్ బి. పి డబ్ల్యు. డి., ఇరిగేషన్, మునిసిపల్,వాటర్ సప్లై శాఖలలోని ఎన్ ఎం ఆర్. కార్మికులను వెంటనే రెగ్యులరైజ్ చేయాలి.

2 రిటైరైన, చనిపోయిన కార్మికులందరికీ లిబరలైజ్డ్ పెన్షన్ చెల్లించాలి.

3. డ్రైవర్ల స్కేల్‌లో వ్యత్యాసాలు తొలగించాలి.

4. వర్క్ ఇన్స్పెక్టర్ల పే స్కేల్స్ 1976 నుండి అమలు జరపాలి. వారి ప్రమోషన్ ఛానల్ జి. వో. 107 ప్రకారం అమలు చేయాలి.

5. వర్క్ చార్జ్‌డ్ అను పేరు మార్చి ఇండ్రస్ట్రియల్ వర్కర్లుగా మార్చాలి.

# మునిసిపల్ పంచాయితీ హైవేస్ కార్మికులు

## మున్సిపల్ కార్మికుల సమస్యలపై

1) రాష్ట్రంలోని 85 మున్సిపాలిటీలలో సుమారు 50 వేల మంది పారిశుధ్య కార్మికులు పని చేస్తున్నారు. వీరిని నాలుగవ తరగతి కార్మికులుగా గుర్తించాలని అనేక సమ్మెలు, పోరాటాలు చేసిన అనంతరం 1978లో ప్రభుత్వం దాన్ని అంగీకరించింది అయితేఅనేక మున్సిపాలిటీలు వీటిని అమలువర్చడంలో అనేకఅడ్డంకులుకల్పించడం ద్వారాకార్మికులు ఈహక్కునుపూర్తిగాపొందలేకపోతున్నారు. కనుక ప్రభుత్వం వెంటనే జోక్యం చేసుకుని 4వ తరగతి కార్మికులకు వర్తించే అన్ని హక్కులను వారికి కల్పించవలసిందిగా ఈ మహాసభ డిమాండ్ చేస్తున్నది. అనేక మున్సిపాలిటీలలో పెరుగుతున్న జనాభా మరియు ఏరియా ప్రాతిపదికపై కార్మికులను నియమించక పోవడంతో ప్రస్తుతంవున్న కార్మికులపై పనిభారం పెరుగుతున్నది. దాన్ని దృష్టిలో పెట్టుకొని అనేక మున్సిపాలిటీలు తమ సిబ్బందిని పెంచుకోవడానికి అనుమతి కోరుతూ తీర్మానించి ప్రభుత్వానికి నివేదించినప్పటికీ, ప్రభుత్వం తగిన చర్య తీసుకొనకపోవటంతో ఇంత వరకు అది అమలుజరగలేదు. దీనికి తోడుగా సెలవులోవున్న కార్మికుల స్థానంలో బదిలీ కార్మికులను పెట్టే ఆనవాయితీ గతంలో ఉండేది. దీన్ని ప్రభుత్వం రద్దుపర్చడం కేవలం దీర్ఘకాల సెలవులు పెట్టిన ఖాళీలను మాత్రమే ఎంప్లాయ్‌మెంట్ ఏక్స్చేంజిలద్వారా భర్తీ చేయాలనే నిబంధన పెట్టడంతో ప్రజలు, కార్మికులుకూడా యిబ్బందులకు గురవుతున్నారు. కావున దీన్ని వెంటనే సవరించి పూర్వం లాగానే బదిలీ కార్మికులను వేయుటకు స్థానిక మున్సిపాలిటీలకు అవకాశం ఇవ్వాలి.

ఈ రంగంలో వందలాది కార్మికులు ఎన్.యమ్.ఆర్ గా పనిచేస్తున్నారు. అయిదు సంవత్సరాలు పనిచేసిన యన్.యం.ఆర్.ల నైనా వెంటనే శాశ్వత కార్మికులుగా చేయాలి.

అలాగే అతి దయనీయ స్థితిలో జీవితం కొనసాగిస్తున్న ఈ కార్మికులకు ఇండ్లవసతి కలిగించాలని ఈ మహాసభ డిమాండ్ చేస్తున్నది.

## లారీ కార్మికుల సమస్యపై తీర్మానం

లారీ ట్రాన్స్‌పోర్టు, రైల్వేలతో సమానంగా సరుకులను చేరవేస్తూంది రైల్వే పోని మారుమూల ప్రాంతాలకు వెళ్ళగల్గుతుంది. నేటి పరిస్థితుల్లో చాలా కీలకరంగంగా కూడా వున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో 30వేలకు పైగావున్న లారీలపై సుమారు రెండులక్షల మంది పనిచేస్తున్నారు పనిగంటల నిర్ణయం లేనందున రాత్రింబగళ్ళు పనిచేసి గమ్యం చేరుతుంటారు. ఒక్కొక్కప్పుడు ప్రమాదాలకు గురి అవుతుంటారు. దూరప్రాంతాల్లో చనిపోయినపుడు వారిని స్వస్థలానికి చేర్చడానికి వీలులేక ఆ ప్రాంతంలోనే ఖననం చేయడం జరుగుతుంది.

ఈ పరిస్థితుల్లో లారీ కార్మికులు పనిచేస్తున్నా వారికి సర్వీసు భద్రత లేదు. కనీస వేతనాలు అమలు జరగడంలేదు.

ట్రాన్స్‌పోర్టు చట్టాన్ని నేటి పరిస్థితులకనుగుణంగా సవరించాలి. ముఖ్యంగా లారీలలో డ్రయివరు, క్లీనరు కలసి తమ కర్తవ్యాన్ని నిర్వహించుతున్నారు. కాని ఎక్కడా రికార్డులో లారీ క్లీనరు పేరు కనపడదు. ట్రిప్‌షీట్‌లో క్లీనరుపేరుకూడా చేర్చాలి.

అలాగే లారీని ఒకరి పేరునుండి మరొకరి పేరుకు ట్రాన్స్‌ఫర్ చేస్తున్నపుడు ఫైనాన్సు క్లియరెన్సు సర్టిఫికెట్ తప్పనిసరిగా వుండాలి. అలాగే లారీలోని కార్మికులనుండి కూడా జీతభత్యాలు బకాయిలు వలెనే "నో డ్యూ" సర్టిఫికెట్ పొందిన తరువాతనే లారీని ట్రాన్స్‌ఫరు చేయాలి.

ప్రమాదాలను కొంతవరకైనా నివారించేందుకు రాష్ట్రంలోని హైవే రోడ్లనైనా 4 వే రోడ్లుగా మార్చాలి రాత్రిపూట 12 గంటల నుండి ఉదయం 4 గంటలవరకు లారీల ప్రయాణాన్ని ఆపుచేయాలి

డ్యూటీలో ప్రమాదంలో చనిపోయిన కార్మికునికి ప్రభుత్వం ఎక్స్‌గ్రేషియోగా 10 వేలు యివ్వాలి అలాగే వర్కుమెన్ కాంపెన్సేషన్ కేసులు 6 నెలలలో పూర్తిచేసి ఆడబ్బు వారికిఅందజేయాలి.

కనీస వేతనాలను అవసరానుగుణ్యమైన వేతనం ప్రాతిపదికగా పునర్నిర్ణయించాలి. నిర్ణయించిన జీతాలతో పాటు చట్ట ప్రకారం కార్మికునికి రావాల్సిన ట్రస్టు వగైరా పూర్తిగా అమలు జరిగేట్లు చూడాలి. సంఖ్యతో నిమిత్తం లేకుండా ప్రావిడెంట్ ఫండ్ స్కీమును అమలువరచాలి.

ట్రాన్స్‌పోర్టు డెవలప్‌మెంటు అథారిటీలో కార్మిక ప్రతినిధులకు స్థానం కల్పించాలి.

లారీలను చెక్ చేసే అధికారం ట్రాన్స్‌పోర్టు అధికారులకే గాని పోలీసులకు ఉండరాదు.

## భారత ఆహార సంస్థ ఉద్యోగుల సమస్యలపై

భారత ఆహార సంస్థ ఉద్యోగులు ఎదుర్కొంటున్న సమస్యలు పరిశీలించిన తర్వాత ఈ మహాసభ వారి వేతనాలపై జరిగిన కోతను ఖండిస్తున్నది. వెంటనే ద్వైపాక్షిక చర్చలద్వారా వేతన సవరణ జరపాలని ఈ మహాసభ డిమాండు చేస్తోంది నానాటికి పని భారం పెరుగుతున్నది. పని భారానికి తగినట్లుగా ఉద్యోగులను రిక్రూట్ చేయడం లేదు భారత ఆహార సంస్థలో ఉద్యోగులు అదనంగా వున్నారనే వక్ర ప్రకటనను ఉపసంహరించుకుని, రిక్రూట్‌మెంటుకు అవకాశం కల్పించాలని, ఇప్పటికే ప్రమోషన్‌లపై వున్న నిషేధాన్ని తొలగించాలని మహాసభ డిమాండు చేస్తోంది.

ఈ సంస్థలో ఆంధ్రప్రదేశ్‌లోని 200 మంది రోజూవారి జీతాలపై పనిచేసే (మూడవ తరగతి) ఉద్యోగులను 1976లో సర్వీసు నుండి తొలగించడం జరిగింది. హైకోర్టుకు వెళ్ళగా 1976 నుండి బ్యాక్ వేజెస్‌తోసహా అన్ని సౌకర్యాలు యీ ఉద్యోగులకు కల్పించవలసిందిగా హైకోర్టు ఆదేశించింది హైకోర్టు ఆదేశాలను పాటించి వారిని వెంటనే పనిలో చేర్చుకొని వారి బకాయిలు చెల్లించవలసిందిగా ఈ మహాసభ భారత ఆహార సంస్థ యాజమాన్యాన్ని డిమాండు చేస్తోంది.

# బొగ్గు గని కార్మికులు

1. వేజ్ కమిటి: బొగ్గుగని కార్మికుల వేతన ఒప్పందం గడువు జనవరి 1 నాటికి ముగిసినా వేటి వరకు ఒప్పందం జరుపుకోవటంగాని కనీసం సరియైన పద్ధతుల్లో కమిటి ఏర్పడ్డం గాని జరగలేదు. సుమారు 10 నెలలకు పైగా ఆందోళన జరుపుతున్నా అన్ని యూనియన్లతో కూడిన వేతన సంప్రదింపుల కమిటీ 83 మార్చి నాటికి గాని కూర్చోలేకపోయింది దీనికి కేంద్రప్రభుత్వము మరియు ఐ యన్.టి.యు.సి. విచ్ఛిన్నకర పాత్రయే కారణము. దశలవారీ పోరాటాల ద్వారా నవంబర్ 8, జనవరి 17,18,19 నిరసన సమ్మెల ద్వారా కొంతవరకు ప్రభుత్వం, మేనేజిమెంట్లమొండి వైఖరిని సడలించగలిగాము. అన్ని ప్రభుత్వ రంగ సంస్థల ఆందోళనతోపాటు ప్రధానంగా బొగ్గుగని కార్మికుల సమ్మె, డి. ఎ. రేటు విషయంలో ప్రభుత్వ వైఖరిని సడలింపజేసింది. అయినప్పటికి ప్రతి విషయంలోను మదత పేచీలతో ఐ యన్ టి యు సి. శిఖండిని అడ్డంపెట్టుకొని ప్రభుత్వం వహిస్తున్న పాతవేత వైఖరిని మహాసభ ఖండిస్తున్నది.

2. సింగరేణి ఉన్నతాధికారులలో అవినీతి :- ఒకనాడు దేశంలోని పబ్లిక్ రంగసంస్థలలో పేరెన్నికగన్న సింగరేణి యాజమాన్యం నేడు అవినీతిమయంగా వుంది. ఒక డైరెక్టర్ జింకల పార్కులు, స్విమ్మింగ్‌పూల్స్, మరొక డైరెక్టర్ డ్రిల్ బిట్టుల కుంభకోణం, వేరొక డైరెక్టర్ 'కే-లైట్ టానిక్' వంటి కుంభకోణాలలో లక్షలాది రూపాయలు కంపెనీ నిధులను కైంకర్యం చేసుకొన్న ఫలితంగా నేడు కంపెనీకి వందకోట్లకుపైగా నష్టాన్ని చూపిస్తున్నారు. ఒకవైపు కార్మికుడు నికృష్టమైన పరిస్థితులలో కనీసం నిలువ నీడలేకుండా, మంచినీటి సౌకర్యం లేకుండా ఇబ్బందులపాలు అవుతుండగా, ఉన్నతశ్రేణి అధికారుల విలాసాలకు నిధులు దుర్వినియోగపరచబడుతున్నది. ఈ అవినీతికర పద్ధతులను అరికట్టబడాలని, గతంలో దోషులుగా నిర్ధారించబడిన వారందరూ శిక్షించబడాలని మహాసభ డిమాండ్ చేస్తున్నది.

3. బదిలీ వర్కర్స్/ఫిల్లర్స్ :- బదిలీల పేరుతో పదివేల మందికి పైగా వున్న కార్మికులను సింగరేణి యాజమాన్యం కట్టుబానిసలుగా చూస్తున్నది. సంవత్సరాల తరబడి పర్మినెంట్ చేయకపోవటం, వీరి విషయంలో గతంలో చేసుకున్న ఒప్పందాలను అమలు జరపకపోవడం, ప్రమాదకర కష్టభూయిష్టమైన పని స్థలాలలో కేవలం వీరితో పని చేయించటం, ఒకే షిఫ్టులో రకరకాల పనులను చేయించడం, పర్మినెంట్ కార్మికులకు యిచ్చే సౌకర్యాలను నిరాకరించటం జరుగుతున్నది. ఈ పరిస్థితులు నిలువరించబడకపోతే, కార్మికవర్గంలో ప్రబలియున్న అసంతృప్తికి తద్వారా రాగల పరిణామాలకు యాజమాన్యం బాధ్యత వహించాల్సి వుంటుంది కావున బదిలీల పేరుతో జరుగుతున్న కట్టుబానిస విధానాన్ని రద్దుచేయాలని మహాసభ డిమాండ్ చేస్తున్నది.

4. వైద్య,గృహవసతి మరియు నీటి సౌకర్యం :- కంపెనీలో మరియూ పెద్ద హాస్పటల్స్ తగినంత సిబ్బంది వున్నప్పటికీ కార్మికులకుతగు వైద్య సదుపాయాలు అందించబడటం లేదు. ఇంతేగాక కనీస అవసరాలకు తగిన మందులుకూడా లేవు కార్మికులకు నివాసయోగ్యమైన ఇండ్లను యివ్వటంలో మేనేజిమెంటు విఫలమైంది. ఇప్పటికి కేవలం 27 శాతం కార్మికులకు గృహవసతి కల్పించబడింది. మిగతా కార్మికులు మురికి కూపాలలోను, అద్దె యిండ్లలోను నివసించవలసి వస్తున్నది. కాలరీ ఏరియాలో కాకుండా బయటి వాడలలో నివసిస్తున్న గని కార్మికులందరికీ మంచినీటిని సరఫరా చేయడం యాజమాన్యం కనీస బాధ్యత. తన ఏరియా కాదనే పేరుతో అత్యధిక శాతం కార్మికులకు అందజేయవలసిన నీటిసౌకర్యాన్ని నిరాకరిస్తున్నది

5. గనులలో భద్రతాచర్యలు : నానాటికి గనులలో భద్రతా ఏర్పాట్లు క్షీణిస్తున్నవి. పొదుపు పేరుతో యాజమాన్యం అవలంబిస్తున్న నిర్లక్ష్య వైఖరి వీటికి కారణం దీని ఫలితంగా గనులలో ప్రమాదాల సంఖ్య పెరుగుతున్నది. ప్రమాదాలకు గురైన కార్మికులకు సర్ఫేస్‌లో పని కల్పించడానికి ఆలస్యం చేయటంగాని, నిరాకరించటంగాని జరుగుతున్నది

పై పరిస్థితులన్నింటిని వెంటనే సరిచేసి తగు చర్యలను తీసుకోవలసిందిగా మహాసభ కేంద్ర ప్రభుత్వాన్ని, సింగరేణి యాజమాన్యాన్ని డిమాండ్ చేస్తున్నది.

## కాకినాడ పోర్టును మేజర్‌పోర్టుగా కేంద్రప్రభుత్వం గుర్తించాలి !

కాకినాడ పోర్టునుండి సాలీనా 200స్టీమర్లు రాకపోకలు జరుగుతున్నాయి. సాలీనా 16 లక్షల టన్నులు ఎగుమతులు అతిసమర్ధనీయంగా జరుగుతున్నాయి- కేంద్రప్రభుత్వానికి విదేశీ మారకం హెచ్చుగా వస్తున్నది.

మేజరుపోర్టుకున్న అన్ని సౌకర్యాలున్నా, మేజరుపోర్టులో పనిచేయు ఉద్యోగులు, పనివారలకు జీతాలు, పనిపరిస్థితులు కాకినాడ పోర్టులో అమలుజరుగుటలేదు.

కేంద్ర మంత్రులు వాగ్దానంమేర కాకినాడ పోర్టును మేజర్ పోర్టుగా గుర్తించి ఉద్యోగుల పనిపరిస్థితులు క్రమబద్ధం చేయాలని రాష్ట్ర సి. ఐ. టి యు. మహాసభ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానిస్తోంది.

## పంచదార పరిశ్రమపై తీర్మానం

మన రాష్ట్రంలో ప్రభుత్వ, సహకార, ప్రైవేటు రంగాలలో 19 మిల్లులు పనిచేస్తున్నాయి.

రాష్ట్రప్రభుత్వం నియమించిన వేతనాల కమిటీద్వారా వేతనములు సవరించబడి, కనీసం వేతనం రు. 581లు సాధించుకోగల్గారు. అయితే కార్మికుల యితర సౌకర్యాలైన "రిటెయినింగ్" అలవెన్సు పెంచాలని ఇంటిఅద్దె, యింక్రిమెంట్లు పెంచాలనే డిమాండ్లు ప్రభుత్వం అంగీకరించలేదు పై సమస్యలపై ఆందోళన కొనసాగించాలి అని అన్ని సంఘాలు నిర్ణయం తీసుకొన్నాయి. ఆ నిర్ణయాన్ని మహాసభ బలపర్చుతుంది.

పిఠాపురంలోనున్న కిర్లంపూడి షుగర్‌ఫ్యాక్టరీ వేతనాల కమిటీ సిఫారసులను రెండేళ్లుగా అమలుజరుపలేదు సరికదా రైతులకివ్వవలసిన బకాయిలు రు. 30 లక్షలను చేరుకొన్నది యీ సీజనులో దాన్ని నిర్వహిస్తున్న మేనేజిమెంటు ఫ్యాక్టరీని మూసివేసింది. రాష్ట్ర ప్రభుత్వం దాన్ని స్వాధీనం చేసుకుంటామని అసెంబ్లీలో వాగ్దానం చేసింది. ప్రస్తుత ప్రభుత్వం ఆ పరిశ్రమను స్వాధీనంచేసుకొని నిర్వహించాలని రాష్ట్ర సి ఐ టి.యు. మహాసభ డిమాండుచేస్తోంది.

## బియ్యం మిల్లుల కార్మికుల కనీస వేతనాలు పెంచాలి– ఈ పరిశ్రమలోని హమాలీల అన్ని పనులకు కనీస రేట్లు నిర్ణయించాలి

1. మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1981 సం॥లో బియ్యం మిల్లులలో పనిచేయు కార్మికుల 1975 కనీస వేతనాల జి. ఓ.ను సవరిస్తూ యం.ఎస్. నెం. 363 జి. ఓ ను ప్రకటించింది. ఈ కనీస వేతనాలు, రేట్లు ఆనాటి జీవన స్థాయికే చాలా తక్కువగానున్నవి. అనంతరం ఈ రెండు సంవత్సరాలలో జీవితావసర వస్తువుల ధరలు బాగా పెరిగాయి. కార్మికుల జీవన ప్రమాణం - అవసరాలు బాగా పెరిగాయి. అందుచే నేటి జీవన ప్రమాణానికి అనుగుణంగా కనీస వేతనాలు రేట్లు పెంచవలసియున్నది.

2. బియ్యం మిల్లు పరిశ్రమలో ఒక ప్రధాన భాగమయిన హమాలీలు (ముఠా కార్మికులు) చేయు 40లేక50 పనులలో కేవలం ఒక్కపని ధాన్యం బడ్డీపోతకు మాత్రమే కనీస రేటు గత జి ఓ లో ప్రకటించబడింది. అందుచే మిగిలిన అన్ని పనులకుకూడా కనీసరేట్లు నిర్ణయించవలసియున్నది.

3. ఈ పరిశ్రమలో పనిచేయు బియ్యం మోత,తదితరపనులు చేయు పోరీ కార్మికులు వగయిరా రోజు వేతన కార్మికులు మొత్తం కార్మికులలో 40 శాతంపైగా ఉంటారు. వీరు యంత్రాల వేగంతో బాటు 8 గంటలు చాలా శ్రమతో కూడిన పని చేయాల్సియున్నది. వీరికి నిర్ణయించిన కనీస వేతనం రోజుకి రు 7.70 చాలా తక్కువగా నున్నది. తగు విధంగా పెంచాల్సియున్నది.

4. రోజు వేతన కార్మికులు, హమాలీలు (ముఠా కార్మికులు) అందరూ పనియున్నా లేకపోయినా సంవత్సరం పొడవునా యజమాని పిలుపునకు సిద్ధంగా వేచియుండాలి. పనిలేని రోజున మరో పనికి వెళ్ళే అవకాశం లేదు. ఈ పరిశ్రమలో మిల్లులు సంవత్సరానికి 6 మాసాలు లేదా 8 మాసాలు మాత్రమే పనిచేస్తాయి. అంటే 6 లేదా 8 మాసాల పని ఆదాయంతో సంవత్సరమంతా జీవించాలి ఈ ప్రత్యేక పరిస్థితిని పరిగణనలోకి తీసుకుని వీరికి తగు విధమైన వేతనాలు నిర్ణయించాలి.

5. ఈ పరిశ్రమలోని డ్రైవర్లు తదితర మెకానికల్ కార్మికులు నైపుణ్యం గల కార్మికులైనప్పటికి వీరి కనీస వేతనాలు ఇతర పరిశ్రమలలోని నైపుణ్య కార్మికుల కనీస వేతనాలకన్నా చాలా తక్కువగా నున్నవి. నైపుణ్యం లేని కార్మికుల వేతనాలకన్న తక్కువగా నున్నవి. అందుచే తగు విధంగా పెంచాలి.

మన రాష్ట్రంలో బియ్యం మిల్లు పరిశ్రమ మంచి లాభాలతో చాలా అభివృద్ధిలో ఉన్నది.

ఈ పరిస్థితులను పరిగణనలోనికి తీసుకొని ఈ దిగువనిచ్చిన ప్రతిపాదనల ఆధారంగా కనీస వేతనాలు వెంటనే నిర్ణయించాలని ఈ మహాసభ డిమాండ్ చేస్తున్నది.

1) నైపుణ్యంగల కార్మికుల కనీసవేతనం నెలకు రు600లు వుండాలి.

2) పోరీ కార్మికులకు దినసరి వేతనం రు. 16 వుండాలి.

3) హమాలీలకు 50 కిలోల నూరు బస్తాలు యూనిట్‌గా

| | | |
|---|---|---|
| 1. | బడ్డీ పోతకు | రు. 18_00 |
| 2. | రాసికొట్టె బడ్డీపోత | రు, 21_00 |
| 3. | కుండపోత | రు. 20_00 |
| 4. | రాసికొట్టి కుండపోత | రు. 23_00 |

ఈ ప్రాతిపదికన ఇతర పనులకు కనీస రేట్లు నిర్ణయించాలి.

(2) హమాలీలకు, పోరీ కార్మికులకు పనిలేని రోజున సహితం కనీసజీతం యివ్వాలని ప్రత్యేక ఉత్తర్వు తేవాలి.

## కాగితం పరిశ్రమ గురించి తీర్మానము

ఆంధ్రప్రదేశ్‌లో గుత్త పెట్టుబడిదారీ వర్గమైనటువంటి బిర్లా, బంగూర్, ఐ. టి. సి లాంటి గుత్త పెట్టుబడిదార్లు ఆదోని టి. జి ఎల్. గ్రూప్ చేతులలో భారీ పరిశ్రమలు నడుపబడుచున్నవి. యివి గాక మినీ పేపరుమిల్సు 14 మన రాష్ట్రములో గవర్నమెంటు ఆర్థిక సహకారంతో చిన్న పెట్టుబడిదార్లు నడుపుచున్నారు ఈ పరిశ్రమలలో సుమారు 10,000 మంది కార్మికులు పనిచేస్తున్నారు. వీరుగాక దీనికి సంబంధించిన కార్మికులు ఫారెస్టులలో 20,000 మంది పని చేస్తున్నారు.

1) ఈ పరిశ్రమలో పనిచేయు కార్మికులకు అతి నికృష్టమైన వేతనాలు చెల్లించుతూ దారి దోపిడీ కొనసాగిస్తూ మరో ప్రక్క పేపరు ధర విపరీతముగ పెంచుకొని కోట్లాది కోట్లు లాభాలు ఆర్జించుచున్నారు. పెద్ద పేపరుమిల్లులో పని చేయుచున్న కార్మికులకు కనీస వేతనము నెలకు 650/- ఉండాలని, మినీ పేపరు మిల్లులో కనీస వేతనం 500/- ఉండాలని సదరు వేతనములు చెల్లించేందుకు ప్రభుత్వము తగిన చర్య తీసుకోవాలని ఈ మహాసభ తీర్మానిస్తూ డిమాండ్ చేస్తున్నది.

2) మిల్లు ఉత్పత్తి విభాగాలలో బదిలీ, క్యాజువల్ పేరుతో వేలాదిమంది కార్మికులను వినియోగించి అతిహీనమైన వేతనాలు చెల్లించుతూ, బానిసలవలె పని చేయించుకొనుచున్నారు. ఈ కేటగిరి గల కార్మికులను మిల్లుకార్మికులు (పర్మినెంటు)గా గుర్తించి, వారితో సమానంగా వేతనాలు, ఇతర సౌకర్యములు కలిగించాలని డిమాండ్ చేస్తూ ఈ మహాసభ తీర్మానించడమైనది.

3) ఈ పరిశ్రమకు ముడిసరుకు అయినటువంటి వెదురు కలప నరికి సప్లై చేసే ఫారెస్టు కార్మికులను, సున్నం బట్టీలు, సామిల్స్ కార్మికులను, ఆయా మిల్లు కార్మికులుగా పరిగణించి కనీస అవసరాలు, ఇతర సౌకర్యాలు అమలు జరపాలని ఈ మహాసభ డిమాండ్ చేస్తున్నది.

4) ప్రభుత్వ ఆర్థిక సహాయముతో నడపబడుతున్న కొల్లేరు పేపరుమిల్లు యాజమాన్యం, కార్మికులకు కనీస వేతనములు, సౌకర్యములు యివ్వకుండా కాలయాపన చేస్తున్నది. కార్మికుల డిమాండ్లపై చర్చ జరపకుండా ఫిబ్రవరి 28 నుండి "అక్రమ లాకౌట్" ప్రకటించింది. కార్మికశాఖ సలహాను సహితం పెడచెవిన పెడుతున్నది.

తక్షణమే లాకౌట్ ఎత్తివేసి, ఆ కాలానికి జీతం ఇవ్వాలని ఈ పరిశ్రమను ప్రభుత్వమే నిర్వహించాలని ఈ మహాసభ డిమాండ్ చేస్తున్నది.

# జీవితభీమా ఉద్యోగులు

## జీవితభీమా సంస్థ ఉద్యోగుల సమస్యలపై

జీవితభీమా సంస్థ ఉద్యోగులపై ప్రభుత్వం సాగిస్తున్న బహుముఖ దాడిని ఈ మహాసభ ఖండిస్తోంది. 1974లో ఉద్యోగులు ద్వైపాక్షిక ఒప్పందంద్వారా సాధించుకున్న హక్కులను ఒక్కొక్కటే హరించివేస్తోంది. ఉద్యోగుల వేతనాలను తగ్గించడానికి, ద్వైపాక్షిక ఒప్పందాలలోని అంశాలను రద్దు చేయడానికి చివరకు పార్లమెంటులో తనకున్న మెజారిటీని ఉపయోగించుకుని చట్టంకూడా చేసింది.చట్టంద్వారా స్వీకరించిన అధికారాలను దుర్వినియోగపరుస్తూ, బోనస్ హక్కు హరింపు, కరువుభత్యం, గరిష్ట వేతనాలపై పరిమితులు విధించడం, రిటైర్‌మెంటు వయస్సు తగ్గించడంవంటి చర్యలకు పూనుకున్నది. ద్వైపాక్షిక ఒప్పందాలను రద్దుచేస్తూ ఏకపక్షంగా నిర్ణయాలు తీసుకొనడానికి వీలుగా పార్లమెంటును ఉపయోగించడంపై ప్రభుత్వాన్ని ఐ. ఎల్. ఒ మందలించడంకూడా జరిగింది. ప్రభుత్వం 1981 ఎల్.ఐ.సి. (సవరణ) చట్టం చేయడం ద్వారా ట్రేడ్‌యూనియన్ ఉద్యమం అనేక దశాబ్దాల పోరాటం ద్వారా సాధించుకున్న సమిష్టి బేరసారాల హక్కు హరించి వేసింది. ఈ చట్టాన్ని వెంటనే ఉపసంహరించుకోవలసిందిగా ఈ మహాసభ డిమాండు చేస్తోంది.

ప్రభుత్వం, ఎల్. ఐ. సి. మేనేజిమెంటు1977లోనే ఉద్యోగ సంఘాలు సమర్పించిన ఛార్టరుపై వెంటనే చర్చలు జరిపి వేతన సవరణ జరపాలని మహాసభ కోరుతున్నది.

దేశసమైక్యతకు, పట్టాదారులు, ఉద్యోగుల ప్రయోజనాలకు విరుద్ధంగా జీవిత భీమా సంస్థను విభజించడానికి పార్లమెంటులో బిల్లు ప్రవేశపెడుతున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది. తెన్నేటి విశ్వనాధం కమిటీ, మొరార్కా కమిటీ, తదితర కమిటీలు ఎల్. ఐ. సి. విభజన సంస్థ ప్రగతికేమాత్రం దోహదం కాదని తమ నివేదికల్లో పేర్కొన్నాయి.ఈసంస్థను విభజించడం ద్వారా కొద్దిమంది బ్యూరోక్రాట్లకు ప్రమోషను అవకాశాలు రావడం మినహాయించి పట్టాదారులకెలాంటి ప్రయోజనంలేదు. నిర్వహణా యంత్రాంగ ఖర్చులు పెరిగి ఆ భారం పట్టాదారులపై పడుతుంది. ప్రీమియం ద్వారా ఏ ప్రాంతంలో సంపాదించిన ఆదాయాన్ని ఆ ప్రాంతంలోనే పెట్టుబడి పెట్టాలనే డిమాండునుముందుకు తీసుకురావడం ద్వారా ప్రాంతీయ దురభిమానాన్ని రెచ్చగొట్టే శక్తులకు బలం చేకూరే ప్రమాదమున్నది. దానితో వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి ఎల్. ఐ. సి. చేయగల్గిన సహాయం మృగ్యమవుతుంది. ఈ కారణాలవలన ఎల్. ఐ సి.ని విభజించడాన్ని యీ మహాసభ వ్యతిరేకిస్తూ, యీ విభజన ప్రతిపాదనను విరమించుకొనవలసిందిగా యీ మహాసభ డిమాండు చేస్తోంది.

ఎల్. ఐ సి. వికేంద్రీకరణ పేరిట "ఆర్గనైజేషన్ ఇంప్రూవ్‌మెంట్ సెల్" స్కీము పేరిట ఒక స్కీమును ప్రవేశపెడ్తున్నది. ప్రస్తుతం డివిజనల్ ఆఫీసులలో మాత్రమే యంత్రాలు వినియోగించడం జరుగుతున్నది. వీటికంటె మిక్కిలి శక్తివంతమైన మినీ కంప్యూటర్లను డివిజనల్ ఆఫీసులో అన్ని బ్రాంచి ఆఫీసులలో అధిక సంఖ్యలో ప్రవేశ పెట్టడం ద్వారా భవిష్యత్తులో ఉద్యోగావకాశాలు సన్నగిల్లేటట్లు చేయడం జరుగుతున్నది. పట్టా దారులకు, ఉద్యోగులకు ఏ మాత్రం ప్రయోజనం చేకూర్చని యీ స్కీము ఉద్యోగ సంఘాలతో చర్చించక ఏకపక్షంగా అమలు చేయడం జరుగుతోంది. ఈ ప్రణాళిక కడప, బెంగుళూరు, ఢిల్లీ డివిజన్‌లలో ప్రయోగాత్మకంగా అమలు చేయబడి, దాని వైఫల్యాలను గమనించి కూడ మేనేజిమెంటు మొండిగా యీ స్కీమును యితర డివిజనకు విస్తరించడం జరుగుతున్నది. వెంటనే యీ స్కీముపై ఉద్యోగులతో చర్చించి ఒక ఒప్పందానికి రావలసిందిగా ఈ మహాసభ డిమాండు చేస్తోంది. ఈ సమస్యలపై పోరాటం సాగిస్తున్న ఉద్యోగులకు యీ మహాసభ తన సంఘీభావాన్ని ప్రకటిస్తోంది.

## సిమెంటు పరిశ్రమపై తీర్మానం

దేశవ్యాపితంగా అందులో ప్రత్యేకించి మనరాష్ట్రంలో వేగంగా అభివృద్ధి చెందుతున్న పరిశ్రమల్లో సిమెంటు పరిశ్రమ ఒకటి. యజమానులకు విపరీతంగా లాభాలుతెచ్చే పరిశ్రమలో సిమెంటు పరిశ్రమ మొదటి శ్రేణిలో వుంటున్నది. ద్వంద్వ ధరల విధానంవల్లనూ, నాణ్యతలేని సిమెంటు, దుమ్ము ధూళితో సహా మార్కెట్‌లో సిమెంటుగా అమ్ముకోవడంవల్ల ఈ లాభాల రేటు పెరుగుతున్నది. దేశ వ్యాపితంగా సిమెంటు పరిశ్రమలో అత్యధిక భాగం గుత్త సంస్థల అధీనంలో వుంటున్నాయనేది ఈ సందర్భంలో గమనార్హం.

సిమెంటు పరిశ్రమలో జీవన ప్రమాణం మాత్రం ఏరకంగానూ మెరుగ్గాలేదు. వేతనాల పెరుగుదల విషయంలో కార్మిక సంఘాల సమిష్టి బేరసారాలకు ఈ పరిశ్రమలో తిలోదకాలు ఇవ్వబడింది. వాలంటరీ ఆర్బిట్రేషన్ పేరుతో కేంద్ర ప్రభుత్వం ఒక దొడ్డిదారిని కనిపెట్టి పరిశ్రమల గుత్తాధిపతులకు లొంగిపోయింది. కార్మికులకు, వారి కుటుంబాలకు ఎంతో హాని కలిగిస్తున్న ఈపరిశ్రమలోని ప్రత్యేక ఆరోగ్య పథకాలకు శ్రద్ధతీసుకోబడటంలేదు. దుమ్ము, ధూళిని అరికట్టేందుకు గట్టి చర్యలు తీసుకోవటలేదు. ఆధునిక యంత్రాలను ప్రవేశపెట్టడం ద్వారా, పాత యంత్రాలపైనే ఉత్పత్తిని పెంచడానికై చేస్తున్న చర్యల వలన కార్మికులపై పనిభారం బాగా పెరుగుతున్నది. క్యాజువల్, కాంట్రాక్టు పేర్లతో కార్మికుల్ని రెగ్యులర్ ప్రాసెస్‌లో వుపయోగిస్తూ వారిని వేజ్‌బోర్డ్ పరిధినుంచి మినహాయించి తక్కువ వేతనాలతో పనిచేయించే పద్ధతిని యజమానులు ప్రవేశపెడుతున్నారు.

ఇటీవల సిమెంటు పరిశ్రమలో చిన్నచిన్న పరిశ్రమలు అనేకం వస్తున్నవి.

మార్కెట్‌లో గుత్త సంస్థలతో పోటీపడవలసి వస్తున్న చిన్నచిన్న పరిశ్రమల అధిపతులు కార్మికుల సహకారంతో ఉత్పత్తిస్థాయి పెంచుకోవడంద్వారా మార్కెట్‌లోనిలిచేపద్ధతికాకుండా,కార్మిక సంఘాలపై కక్షసాధింపు చర్యలు తీసుకుంటూ కార్మిక వ్యతిరేక చర్యలు చేపట్టడం ఇటీవల జరుగుతున్నది. ఇది విచారించదగిన పరిణామం.

## రామానుజం - వివేకియా కమిటీని రద్దుచేయాలి

1981 అక్టోబర్ నుండి సిమెంటు కార్మికులకు కొత్త వేతనాలు అమలులోకి రావలసివున్నది. సిమెంటు పరిశ్రమలోని అనేక కార్మికసంఘాలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నను, సిమెంటు యజమానులతో లాలూచీపడిన కేంద్ర కాంగ్రెస్ ప్రభుత్వము "వాలంటరీ ఆర్బిట్రేషన్ కమిటీ" పేరుతో ఐ. ఎన్. టి యు. సి. అధ్యక్షులు రామానుజం, పారిశ్రామికవేత్తల ప్రతినిధి వివేకియాలతో ఒక కమిటీ ఏర్పరచింది. పై ఇద్దరు ప్రతినిధులు కలిసి లక్షలాదిమంది కార్మికులు భవిష్యత్తును నిర్ణయించే పై విధానాన్ని సి ఐ. టి. యు. తీవ్రంగా ఖండిస్తున్నది. సిమెంటు కార్మికుల కోర్కెకు అనుగుణంగా వెంటనే రామానుజం - వివేకియా కమిటీని రద్దుచేయాలని సి.ఐ టి యు. రాష్ట్ర మహాసభ కేంద్ర ప్రభుత్వాన్ని కోరుచున్నది. సిమెంటు పరిశ్రమలోని అన్ని కార్మికసంఘాల ప్రతినిధులతో నేరుగా చర్చలు జరిపి వెంటనే వేతనాన్ని పునఃనిర్ణయించి 1981 అక్టోబర్‌నుంచి అమలుజరపాలని సి ఐ. టి. యు. రాష్ట్ర మహాసభ కోరుచున్నది.

రాష్ట్రవ్యాపితంగా సిమెంటు పరిశ్రమలోని కార్మికులు పై డిమాండ్‌ను సాధించుకోడానికై కృతనిశ్చయంతో పోరాడవలసిందిగా సిమెంటు కార్మికులకు ఈ మహాసభ పిలుపునిస్తున్నది.

## బ్యాంకు ఉద్యోగుల గురించి

3వ ద్వైపాక్షిక ఒప్పందం ముగిసి నెలలు గడిచింది. చార్టర్ ఆఫ్ డిమాండ్స్ ఈ రంగంలో పనిచేసే అన్ని సంఘాలు సమర్పించాయి. అయినా ఇండియన్ బ్యాంక్స్ అసోసియేషన్ సంప్రదింపులు జరపక కాలయాపన చేస్తున్నది,

వెంటనే సంప్రదింపులు ప్రారంభించి, ఒప్పందానికి రావలసిందిగా ఈ మహాసభ ఇ.బి ఎ ను డిమాండ్ చేస్తున్నది.

బ్యాంకింగ్ రంగంలో యాంత్రీకరణకు పూనుకుంటున్నారు ఇప్పటికే గ్రిండ్లేస్ బ్యాంకులో యాంత్రీకరణ వల్ల వెయ్యిమంది ఉద్యోగావకాశాలు పోగొట్టుకున్నారు. రిజర్వుబ్యాంకు ఉద్యోగుల ప్రతిఘటనలు ఖాతరుచేయకుండా బొంబాయి ఆఫీసులో పోలీసు బలగంతో ఒక కంప్యూటర్ నెలకొల్పారు. ఇది చదువుకున్నవారి వుద్యోగాలను పోగొట్టి, వుద్యోగావకాశాలను వమ్ముచేసే చర్య. ఈ మహాసభ ఈ చర్యను నిరసిస్తున్నది.

## కేంద్రప్రభుత్వ ఉద్యోగుల సమావేశము - ప్రతిపాదించుచున్న తీర్మానములు

1. కేంద్ర ప్రభుత్వం బడ్జెటు సమావేశములో కేంద్రప్రభుత్వ ఉద్యోగుల కోసం ప్రతిపాదించిన 4వ వేతనసంఘ నియామకాన్ని ఈ మహాసభ వ్యతిరేకిస్తున్నది గత మూడు వేతన సంఘాల నియామకం వల్ల ఉద్యోగుల నిజవేతనం 60 శాతం పడిపోయింది. ఇది కేవలం ఉద్యోగుల సమస్యలను కొంతకాలం వాయిదావెయ్యడానికి మాత్రమే తోడ్పడుతుంది. కేంద్రప్రభుత్వ ఉద్యోగుల సంఘాలన్నీ ఏక కంఠంతో వ్యతిరేకించినప్పటికీ పెడచెవిని బెట్టి ఉద్యోగుల నెత్తిన దీనిని రుద్దటాన్ని సి. ఐ. టి. యు 4వ మహాసభ తీవ్రంగా ఖండిస్తోంది

ఉద్యోగుల సంఘాలు కోరుతున్న ప్రభుత్వరంగ పరిశ్రమల కార్మికులతో సమానంగా వేతనాలు చెల్లించాలనే ప్రతిపాదనను, దానితోపాటు వెంటనే నెలకు 150 రు.లు తాత్కాలిక భృతి చెల్లించాలన్న డిమాండును ఈ మహాసభ పూర్తిగా సమర్థిస్తోంది ఈ కోర్కెను ప్రభుత్వం వెంటనే ఉద్యోగుల సంఘాలతో ద్వైపాక్షిక చర్చలు జరపటం ద్వారా పరిష్కరించాలని కోరుతోంది.

ద్వైపాక్షిక చర్చల ద్వారా వెంటనే సమస్య పరిష్కారం కాని పక్షంలో ఉద్యోగుల సంఘాలు ఈ సమస్యల పరిష్కారానికి నిర్దిష్టమైన ఐక్య ఉద్యమం నిర్మించడం ద్వారా మాత్రమే సాధించగలరన్న సత్యాన్ని గుర్తించాలని ఈ మహాసభ సూచిస్తోంది

కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు ఉత్పత్తితో నిమిత్తము లేకుండా 8 33 శాతమును బోనసుగాచెల్లించాలని డిమాండు చేస్తోంది.

2. సర్వీసుల పునర్వ్యవస్థీకరణ పేరుతో ప్రభుత్వం అనుసరిస్తున్న కార్మిక వ్యతిరేక, ప్రజావ్యతిరేక చర్యలవల్ల తంతి-తపాలా సర్వీసులలో పని సామర్థ్యం రోజురోజుకూ దిగజారిపోతుంది

శ్రీ

ర్మా

తీ ర్మా ★ నా లు

నా

లు

## సౌహార్ద సందేశాలు

ఎ. ఐ. టి. యు. సి

శ్రీ జోస్యభట్ల సత్యనారాయణ

భారత ప్రజాతంత్ర యువజనసమాఖ్య

శ్రీ వి. మధు

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మికసంఘం

శ్రీ పాటూరు రామయ్య

ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం

శ్రీ బోడేపూడి వెంకటేశ్వరరావు

గారలు మహాసభకు హాజరై తమ సౌహార్ద సందేశాలిచ్చారు.

## తీర్మానాలు

(ఎ) ఉత్తరాల రవాణాలో కీలకపాత్ర వహిస్తున్న ఆర్ ఎమ్ ఎస్. సార్టింగు సెక్షన్లు రద్దు.

(బి) జిల్లాలవారీ సార్టింగు పద్ధతి ప్రవేశపెట్టడం

(సి) పనికతగిన సిబ్బంది నియామకానికి బదులు షార్టు డ్యూటీ, క్యాజువల్ ఉద్యోగులను సర్వీసులలో నియమించడం.

ఈ పై చర్యలను ప్రభుత్వం వెంటనే ఉపసంహరించుకోవాలని ఈ మహాసభ డిమాండ్ చేస్తుంది.

3. ఈ మధ్యకాలంలో ప్రభుత్వ కార్మిక వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా కేరళ, బీహారు, ఆంధ్ర తదితర రాష్ట్రాల్లోను జరిగిన తంతి, తపాలా ఉద్యోగుల పోరాటాలపై అధికారుల కక్ష సాధింపు చర్యలను ఈ మహాసభ తీవ్రంగా గర్హిస్తోంది. వెంటనే అన్ని రకాలైన కక్ష సాధింపు చర్యలను ఉపసంహరించాలని ఈ మహాసభ డిమాండు చేస్తోంది.

4. ప్రభుత్వం పార్లమెంటులో ప్రతిపాదించిన "పరిశోధనా సంస్థలు, ఆసుపత్రులు, విద్యారంగ సంస్థల సవరణ బిల్లు" ద్వారా కార్మికులు ఎన్నో సంవత్సరాలు పోరాడి, అనేక త్యాగాల తర్వాత సంపాదించుకున్న సంఘ నిర్మాణ హక్కులతో సహా అనేక ట్రేడ్ యూనియన్ హక్కులు హరించుకొనటాన్ని ఈ మహాసభ తీవ్రంగా గర్హిస్తోంది. దీన్ని వెంటనే ఉపసంహరించాలని ఈ మహాసభ డిమాండు చేస్తోంది

ప్రజాశక్తి ప్రెస్, విజయవాడలో ముద్రింపబడి, సి. ఐ. టి. యు. ఆంధ్రప్రదేశ్ కమిటీ పక్షాన శ్రీ నండూరి ప్రసాదరావుచే విజయవాడ నుండి ప్రకటింపబడింది. ఎడిటర్ : శ్రీ నండూరి ప్రసాదరావు

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVO1A 165 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 23/08/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | prathyusha, |
| పేజీలు విడదీసినది | prathyusha |
| స్కాన్ చేసినది | Nandhu |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యబడి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |